# ఆదిత్యహృదయరహస్యము



రచయిత:

కాళిదాసు రామచంద్రశాస్త్రి

కల్పలతా పబ్లికేషన్స్
కోట్ల బిల్డింగ్
మంగళవారప్పేట, రాజమండ్రి - 1

తొలిముద్రణ

1-1-80

శ్రీ సిద్ధార్థి నామ సంవత్సర పుష్యశుద్ధ ౧౪

ప్రతులు - 3000

వెల 8-00

ముఖచిత్రం - బాపు

ప్రతులకు :

కె. హరికృష్ణ

మేడూరి వారి సందు, అగ్రహారం, ఏలూరు

(లేక)

కె. శివరామకృష్ణ

కోట్ల బిల్డింగ్, రాజమండ్రి -1

ప్రింటర్సు : నవజ్యోతి, నర్సాపురం.

# భూమిక

## ఆదిత్య హృదయ రహస్యము

"ఆదిత్య హృదయము" ను ఆదికవియగు వాల్మీకి మహర్షి ఆది కావ్యమైన శ్రీమద్రామాయణంలో– రావణవధ గావించుటకు అగస్త్య మహర్షి– శ్రీరామచంద్రమూర్తికి ఉపదేశించిన మీదట వారిని యీ స్తోత్ర ముతో ధ్యానించి శత్రువధగావించి జయము నొందెనని తెల్పియున్నారు.

పరమపవిత్రమైన యీ స్తోత్రరాజమును, భక్తులు నాడు మొదలు నేటివరకు నిత్యము పారాయణ గావించుచు కోరిన ఫలములను పొందు చున్నారు.

ఈ సూర్యవంశీయుడైన శ్రీరామప్రభువు రఘువంశమున అవత రించి యుండెను.

ఆ రఘువంశమును మహాకావ్యముగ వ్రాయబూనిన కాళిదాస మహాకవి "క్వసూర్య ప్రభవో వంశః క్వచాల్ప విషయామతిః". సూర్య భగవానునివలన వృద్ధినందిన రఘువంశమెంత గొప్పది? అల్పమతినైన నేనెంతటివాడను. ఈ నాప్రయత్నమెట్లున్నదనగా అజ్ఞాని దాటుటకశక్య మైనసాగరమును తెప్పకొయ్య సాయముతో దాటదలచినట్లున్నదని తన యసామర్థ్యమును తెలిపియుండెను.

ఆ కాళిదాసు వంశమున జన్మించినవారిలో మిక్కిలి సామాన్యుడ నైన నేను రఘువంశమునకును సమస్త లోకములకు ఆరాధ్య దైవమైన సూర్యభగవానుని స్వరూపమును మహిమను దెలుపుచుండు యీ స్తోత్ర మును వివరింపబూనుట అత్యంత సాహసకార్యము. ఈ స్తోత్రమునకు గీర్వాణాంధ్ర భాషలలో ఇప్పటివరకు ఎందరో వ్యాఖ్యానించి లోకోప కారము గావించినారు. వారికి నా అనంతానంత నమస్కారములు.

మరల నేనుగూడ యీ స్తోత్రము ఆదిత్య హృదయ రహస్యమను పేర వివరింప బూనుటెందులకనగా–

రమారమి 25 సంవత్సరములనుండి శ్రీమద్రామాయణ ప్రవచనము గావించువాడనైనందున ఈస్తోత్రమునందు నాకు ప్రత్యేకమైన భక్తియేర్పడినది మరియు సుదీర్ఘకాలమునుండి అనారోగ్యముతో బాధ పడుచున్నందున నావలే బాధపడువారందరు ఈ సూర్యారాధనచేసి ఆరోగ్యభాగ్యమునుపొందవలెనని కోరుచు ఈ కార్యమునకు గడంగితిని.

వాల్మీకి మహర్షికి - నావంటివారియందు మిక్కిలిదయ గలదు. అది యెట్టిదనగా మహర్షి–సామాన్యులకు సులభులయ్యును, పండితులకు గూడ అంతు చిక్కనివారై ఆశ్రయించిన వారి యోగ్యతాను సారము తమహృదయమును తెలియ పరతురు. కాన నాకు కొంత చొరవగల్గినది. ఈవిషయమున మహర్షికి–వారి కావ్యనాయకుడైన శ్రీరాముడేసాటి. నేనీసంవత్సరం నరసాపురంలో శ్రీమద్రామాయణ ప్రవచనము చేయుచుండగా దానికి కార్యకర్తలగు శ్రీ కె. యస్ సత్యనారాయణ (హిందీలెక్చరరు)గారును, శ్రీశ్రీపాద రామలింగేశ్వర శాస్త్రిగారును నేను "ఆదిత్య హృదయము" ప్రవచనము చేయుటకు వ్రాసికొనియున్న చిత్తు ప్రతిని విని యానందించి దీనిని గ్రంథస్థము చేయవలయునని వారితో ముచ్చటించినంతనే వారు ఆదిత్య హృదయమును ప్రచురించిన కీర్తిమా నరసాపురమునకు రాగలదని ఈ విషయంలో మా గ్రామవాసులు గూడ మనకు తప్పక సహకరింతురని తెల్పి నన్ను సర్వవిధముల ప్రోత్సహించిరి.

ఈ ముద్రణ విషయంలో ఉదార హృదయులైన

శ్రీ నరిపల్లి రెడ్డెయ్యగారును

శ్రీ విడుమోలు వెంకటేశ్వరరావుగారును

శ్రీ గూడా వెంకటాత్రిమయ్యగారును
శ్రీ ప్రిహరాజు సీతారామచంద్రమూర్తిగారును
శ్రీ పి. సన్యాసిరావుగారును
శ్రీ జై కుంటిలాల్ మెహతాగారును

తదితరదాతలును గొప్పగా సహాయము గావించిరి. ఆదాతలపేర్లు గూడ యీగ్రంధము నందే ప్రకటింపబడినవి. ఈదాతలకు మా కృతజ్ఞతలు శ్రీ N. V. రావుగారు మాకు కోశాధికారిగా వుండుట మా అదృష్టము. వారు, ప్రసిద్ధ సినీ దర్శకులు, చిత్రకారులైన శ్రీ బా పు గా రి కి. వ్రాసి ముఖచిత్రమును గూడ తెప్పించి యిచ్చినారు మిక్కిలి యంద ముగ ముఖచిత్రంవ్రాసి పంపిన శ్రీ బాపుగారికిని నాకృతజ్ఞతాపూర్వక వందనములు. తమ అమూల్యమైన యాశీస్సులతోటి అభిప్రాయము లను వ్రాసి పంపిన పూజ్యులకు నాభక్తిపూర్వక వందనములు.

ఈ గ్రంధమును శ్రమించి పూర్తిపు చూచి పెట్టిన శ్రీ సరిపల్లి రెడ్డెయ్యగారికిని తమ అమూల్యసలహాలనిచ్చుచు ముద్రణకార్యములో తోడ్పడిన శ్రీ K .S. సత్యనారాయణగారికినీ శ్రీపాద రామలింగేశ్వర శాస్త్రి గారికిని అందముగ ముద్రించిన నవజ్యోతి ప్రెస్సువారికిని నాధన్య వాదములు.

ఈగ్రంధమునకు సకల విధముల తోడ్పడిన వారి కెల్లరకును శ్రీ సూర్యనారాయణమూర్తి ఆరోగ్యమునొసగుగాతయని ప్రార్ధన.

ఇట్లు
విధేయుడు
కాళిదాసు రామచంద్రశాస్త్రి




# శుభవార్త

బహు కాలంగా భక్తులు కోరుచున్న సుందరకాండ ప్రతి శ్లోకమునకు అర్థ తాత్పర్యములు, విశేష వ్యాఖ్యతో, కామ్య పారాయణ విధానములు, సంకల్ప విధానములు, సీతా - రామ - ఆంజనేయ అష్టోత్తరములు హనుమత్ప్రీతి కరమైన పుష్పముల వివరమును మొదలగు అనేక విశేషములతో మూడు భాగములుగ త్వరలో వెలువడనున్నది




# అభిప్రాయము 1

పండిత శిరోమణులయిన శ్రీ రామచంద్రశాస్త్రిలవారి
"ఆదిత్య హృదయ వ్యాఖ్యానము" అను గ్రంథము
నిప్పుడు ప్రకాశింపబడుచున్న దానిం జూచుట
కవకాశము గలిగినదనుటకు మిక్కిలి
యానందింపఁదగిన విషయము

బ్రహ్మశ్రీ రామచంద్రశాస్త్రిలవారు — పాండిత్యముచేతను, నిజ కులోచితమైన సదాచారముచేతను, వినయాతిశయముచేతను, కేవలము వేదమందేగాక, న్యాయాది శాస్త్రములలోఁగూడ విచార చాతుర్యముచేతను సమస్తాస్తిక శ్రేష్ఠులకును మిగుల తెలిసినవారే.

ఈ వ్యాఖ్యానములో ఎన్నో విషయములు—సరసములు, నిపుణములునయిన యుక్తి కదంబములచే విమర్శింపబడినవి. మరియు నిందు విషయ ప్రతిపాదన ప్రకారములు ప్రామాణ్యోపేతములై, సన్న్యాయోపేతములై కానవచ్చుచున్నవి. అన్ని విధముల నీగ్రంథమాస్తికుల మనస్సులను మిక్కిలి లోగొనుచున్నది, కేవలము వేద పండితులకు మాత్రమేగాక, తంత్ర చతుష్టయ నిష్ణాతులైన పండిత ప్రకాండులకు సైతము మనోరంజకము గావించునని యెంచుచున్నాను. ఇట్లు మహోపకార ప్రవృత్తులైన శ్రీరామచంద్రశాస్త్రిలవారు వేద భాష్యాదులలోఁ చేసిన పరిశ్రమ మీ వ్యాఖ్యానములో విశదీభూతమైనదని సంతోషించుచున్నాను. ఇట్లే ముందు ముందుకూడ వీరు ఆర్ష గ్రంథములను ప్రకాశింపఁజేయుటలో మిక్కిలిగా కృషి సలుపుదురని యాకాంక్షించుచున్నాను. ఈ గ్రంథమందాస్తికులందరు బద్ధాదరులప్పుదురు గావుతమని విశ్వసించుచున్నాను. లోకోపకార ప్రవృత్తులైనవారి కెల్లరకును సర్వేశ్వరుఁడు సర్వాభీష్టప్రదుండౌఁగాక । ఇతిశమ్.

శ్రీ కాళహస్తి
6..1...80

ఇట్లు,
అరుణాలచ కృష్ణమూర్తి ఘనపాఠి

# ప్రకాశిక 2

డా॥ ఐ. పాండురంగా రావు
ఆఫీసర్ ఆన్ స్పెషల్ డ్యూటీ,
యూనియన్ పబ్లిక్ సర్వీసు కమీషన్, న్యూఢిల్లీ

శ్రీమద్రామాయణ పరాయణులు శ్రీ కాశిదాసు రామచంద్ర శాస్త్రిగారు వివరించిన "ఆదిత్య హృదయ రహస్యము" సొంతంగా చదివాను. చాలా బాగుంది. రామాయణమొక రత్నమాలిక. అందులో అనర్ఘరత్నం ఆదిత్య హృదయం. సూర్యుడు ఉదయించేందుకు సరిగ ఎంత సమయం పడుతుందో అంత సమయంలోనే-మూడు నాలుగ నిమిషాల్లో-చదువుకుని ఉదయ భాస్కరుని భానుమద్భాను సంతతి హృదయగతం చేసుకునేందుకు అనువుగా అక్షరబ్రహ్మ వాల్మీకి అమోఘమైన ఈ స్తోత్రం లోక కల్యాణంకోసం ప్రసాదించాడు. ఈ స్తోత్రానికి ఇప్పటికి వెలువడిన వ్యాఖ్యలన్నింటినీ సూక్ష్మంగా పరిశీలించి తన సంస్కార బలాన్ని పురస్కరించుకొని శాస్త్రిగారు ఈ "రహస్యం" ప్రభవింపజేసి ఆ లోక రుచిరమైన లోకానికి అపారమైన సేవచేశారు. ఇన్ని వ్యాఖ్యానాలుండగా మరో రహస్యదీపిక యెందుకనే ప్రసక్తిలేదు. ఎవరి హృదయం వారిది. అందరి హృదయాలను స్పందింపజేసే ఆదిత్య హృదయాన్ని అందరూ తమ తమ సంస్కారంకొద్దీ అవగాహన చేసుకుని ఆరాధించి తరించటం మానవ ధర్మ సమ్మతం

సామాన్య మానవులకు అందుబాటులో ఉండాలని మహర్షులు మంత్రపూతంలా మాటిమాటికి మనన చేసుకునేందుకు అనువయిన మాటల్లో మహత్తరమైన సత్యాన్ని అందరి మంచికోసం చెప్పారు కాని దురదృష్టవశాత్తు వాళ్ళ సరళ హృదయాన్ని పండితుల వితండవాదాలు, పాండిత్య ప్రకర్షలు, రాగద్వేషాలు సామాన్యులకు దూరంచేశాయి.

అందువల్ల మామూలు మనిషికి మనుగడలోని మహా రహస్యంమీద నమ్మకం తగ్గిపోయింది. హేతువాదం వెర్రితలలు వేసింది. నీతి, భీతి, ప్రీతి, రీతిని దాటి తప్పుదారిని పట్టాయి. కాని ఆత్మజ్ఞానం చెరిపితే చెరిగేదికాదు. ఎంత కరిగినా తరిగేదికాదు. ఎంత తరిచి తరిచి పరిశీలిస్తే అంత తరళంగా, సరళంగా తేటతెల్లంగా తేరుకొని తరింపజేసే పరమ సత్యం విజ్ఞాన కలశంలో ఇమిడివుంది. పైపై పసిడిపూతలకు మోసపోక లోపల దాగియున్న ఆ లోక మాధుర్యాన్ని చూరగొనేందుకు మహర్షుల మహనీయ వాఙ్మయం మనకు కలకాలం ఉపకరిస్తుంది.

పరమేశ్వరి, పరమ శివుడు, శ్రీ మహావిష్ణువు, భాస్కరుడు, వినాయకుడు ప్రతి జీవీ ఆరాధించవలసిన పంచదేవతలు. వీరిలో ప్రత్యక్షంగా కనిపించి కాంతిని ప్రసరింపజేసే పరదేవత ప్రభాకరుడు. భగవంతుడు ఉన్నాడా లేడా అని జీవితాంతం పనికిమాలిన ప్రశ్నలతో పొద్దులు పుచ్చుకునేకంటే పొద్దున్నే ప్రతి దినం ప్రత్యక్షంగా మనకు కనిపించి కనిపించవలసిన ప్రపంచాన్ని కనిపింపజేసే జగచ్చక్షువయిన సూర్యభగవానుని దివ్యశక్తిని గుర్తించి మెలకువతో, నిలకడతో ఆ దేవదేవుని అనుగ్రహం పొందేందుకు ప్రయత్నించటం వివేకవంతుల విధి.

వేదమాత గాయత్రిని మించిన మంత్రంలేదు అలాంటి గాయత్రి కూడా ప్రత్యక్ష దైవమయిన ప్రభాకరుని ప్రభాసవిత్రి. స్తుతిమాత్రంచేత మతికి పవిత్రత ప్రసాదించే పరమపావన స్వర సావిత్రి. తనను కీర్తించిన కైవల్య పరాయణులకు కాంతిని, శాంతిని, దాంతిని ప్రసాదించే జగన్మాత. గాయత్రీ బీజ సమ్మితం రామాయణం. రామనామ సంస్మరణ సహస్రనామతుల్యం. గాయత్రీకీ, రామాయణానికీ, సహస్రనామాలకూ గల ప్రాశస్త్యం, ప్రాధాన్యం, ప్రాముఖ్యం ఆదిత్య హృదయానికికూడా ఉంది. గాయత్రిలోని ఇరవై నాలుగు బీజాక్షరాలను పురస్కరించుకొని ఒక్కొక్క అక్షరానికి ఒక వెయ్యి శ్లోకాల చొప్పున వాల్మీకి మహర్షి

చతుర్వింశతి సహస్రికయైన రామాయణ సంహితను రూపొందించారు. ఇలాంటి రామాయణ రసాయనంలో రసవత్తరమయిన ఘట్టం ఆదిత్య హృదయం. సూర్య వంశంలో ఉదయించిన రామభద్రుడు సూర్యోపాసనతో బాహ్యాభ్యంతర తిమిరాన్ని ఛేదించి జయం సాధిస్తాడు. భద్రత నెలకొల్పుతాడు. ఈ సందర్భంలో ప్రభవించిన ఆదిత్య హృదయంకూడా సహస్రాక్షర సంయుతం. రామాయణ మహాకావ్యంలోని ఇరవైనాలుగు వేల శ్లోకాలకు సాంకేతంగా ఈ అక్షర సహస్రం వెలువడింది. భరత వాక్యంలాంటి చివరి శ్లోకంతో చేర్చి ఇందులో 31 శ్లోకాలు ఉన్నాయి. వీటిలోని వెయ్యి అక్షరాలను ప్రత్యక్షం చేసుకుంటే ప్రభాకరుని అనుగ్రహం పరిపూర్ణంగా లభిస్తుంది.

ఆదిత్య హృదయంలోని మొదటి తొమ్మిది శ్లోకాలు అంగన్యాస కరన్యాసపూర్వకమైన పూర్వ రంగాన్ని రూపొందిస్తే చివరి తొమ్మిది శ్లోకాలు ఫలశ్రుతిని చెప్తాయి. మధ్యనున్న పన్నెండు శ్లోకాలు ద్వాదశాత్ముడయిన ప్రభాకరుని నమక – చమకాలతో స్తుతించి నుతిస్తాయి. ఈ స్తోత్రరాజంలోని ఈ విలక్షణ రచనా సౌష్ఠవం శాస్త్రిగారికీ, నాకూ సమానంగా స్ఫురించిన భావలహరి కావటం ఆహ్లాదకరమైన విషయం. తనలోని అందాన్ని తానే అందిస్తేగాని అందని ఆత్మానందం ఆత్మీయులకు సమానాధికరణమవటంలో సందేహంలేదు. తదీయుల తత్త్వం తదీయంగానే ఉంటుంది.

ఆదిత్య హృదయం అందరికీ అందుబాటులో ఉన్న స్తోత్రం. పిన్నలు, పెద్దలు, పండితులు, పామరులు అందరూ దీన్ని ఆరాధించవచ్చు కాని దీనికికూడా కొంత మెలకువ అవసరమే. సూర్యుడు ఉదయించేలోగా నిద్రలేచి, పళ్ళు తోముకుని, వీలయితే స్నానంకూడా చేసి ఉదయభానుని ఉజ్జ్వల బింబలావణ్యాన్ని హృదయారవిందంలో నెలకొల్పుకొని ఈ స్తోత్రం నిత్యం పఠించటం అనుకున్నంత సులువైన పనికాదు.

చెప్పటం సులభం, చెయ్యటం కష్టం. కాని అనుకున్న ప్రకారం చెయ్య· దలచుకున్న పని చేసి తీరవలెననే పట్టుదలతో చెయ్యగలిగితే జీవితం తరించినట్టే. అనేక జన్మలకుగాని దరిజేరని సంసారికి ఇంత సరళమైన తరణోపాయాన్ని అనుగ్రహించిన ప్రాచేతసుని తపస్సు అమోఘం. ఆ తపస్సును పదిమందికీ పంచిపెట్టి ఋషి ఋణం తీర్చుకుంటున్న శ్రీ రామచంద్రశాస్త్రిగారి కృషి అభినందనీయం. వారి కృషి నిజంగా ఫలించాలంటే ఈ రహస్య భాష్యం చదువుకొనే చదువరులు చదివిన చదువును పెదవుల వరకే వదలక అడుగడుగునా ఆచరణలో పెట్టాలి. ఆచరణ శూన్యమయిన ఆరాధన ఆయాసమే అవుతుంది.

లోకసారం ఆలోకం. ఆ లోకానికి ఆధారం ఆదిత్యమూర్తి. ఆ మూర్తి కోరేది ఆచరణ, ఆచరణశుద్ధి. ఆ (శ్రీ) చరణసిద్ధికి ఏకైక మార్గం. మహాజనో యేనగతః స పంథాః. మంగళంమహత్

న్యూఢిల్లీ 29-1-80 } ఇలపావులూరి పాండురంగారావు

## డా॥ ధూళిపాళ అర్కసోమయాజి, 3

ఎమ్. ఏ., పి. హెచ్‌డి.,
కార్యదర్శి హిందూధర్మ, పతిష్ఠానము,
తిరుపతి-తిరుమల దేవస్థానము, తిరుపతి.

బ్రహ్మశ్రీ కాళిదాసు రామచంద్రశాస్త్రిగారు రచించిన "ఆదిత్యహృదయము" అను గ్రంథమును స్థాలీపులాకన్యాయముగ పరిశీలించు వకాశము నాకు కలిగినది. గ్రంథకర్త అనేక పర్యాయములు శ్రీమద్రామాయణమును పఠించుచు, తన్నిహితమైన నవనీత సదృశమగు ఆదిత్యహృదయము"ను ప్రజోపకారార్థమై రచించిరి. ఏతద్గ్రంథ ·రకులకు ఆధ్యాత్మిక విభూతితోపాటు, ఆయురారోగ్య భాగ్యసంతానలు కలుగుగాక! ధూళిపాళ అర్కసోమయాజి

31....1....80

# అభిప్రాయము 4

శ్రీ కనుమళ్ల రామమూర్తి
హైద్రాబాదు.

"ఆదిత్య హృదయ రహస్యము చదివినాను. నాలాంటి సామాన్యులైనా పండితులైనా దీనిని చదివిన ఒక విధమైన ఆనందమును ఆత్మ విశ్వాసమును అనుభవిస్తారు.

అర్థము తెలిసికోకుండా పారాయణ చేసినా, "ఆదిత్య హృదయము" ఫలితమిస్తుందని పెద్దలు అంటారు. అది ఎంత వరక న్యాయమో నాకు తెలియదు. కాని అర్థము, అంతరార్థమ తెలిసికొని పారాయణచేయుట ఇంకా మేలు. అదియే సరియైన పద్ధతికూడా ఇందుకు ఈ పుస్తకము చాలా సహాయకారి.

ఇహ పరసాధకంగా, రామాయణ కథను నలుగురికి చెప్పుకొంటూ జీ యాత్రసాగిస్తున్నాడు దీని రచయిత అందువలననో మరెంద వలననో, రచన సులభశైలిలో ఆకర్షణీయంగా వున్నది.

కనుమళ్ళ రామమూర్తి
హైద్రాబాదు
26-1-1980





# కృతజ్ఞత

సనాతన, ఆర్ష సంప్రదాయములను పాదుకొల్పి, హిందూ
ధర్మ పరివృద్ధి కొరకు ఆర్థిక సహాయముతోపాటు
నైతిక భక్త్యుత్సాహములను భారత దేశము
దశదిశలా కలిగిస్తూ ఉన్న

**శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానమువారు**

**ఈ "ఆదిత్య హృదయ రహస్యము"**

గ్రంథ ప్రచురణకు రు. **1265**/-లు ధన సహాయము
చేసినారు. వారికి ఇందుమూలముగా

**——కృతజ్ఞతలు——**

అందజేసికొనుచున్నాము.

—గ్రంథకర్త



## ఈ గ్రంధమునకు ద్రవ్యసహాయకులగు దాతల పేర్లు

| | | | |
|---|---|---|---|
| 1 | సర్వశ్రీ మంతెన రామకృష్ణంరాజు | నర్సాపురం | 10-00 |
| 3 | కాకర్ల హరనాధబాబా | " | " |
| 4 | పాలెప్పు సూర్యప్రకాశరావు | రాజమండ్రి | " |
| 5 | కొచ్చర్లకోట వెంకటరమణమూర్తి | కావలి | " |
| 6 | రామావఝుల వెంకటశేషయ్య | " | " |
| 7 | ఏకా రామయ్య పంతులు | గుంటూరు | " |
| 8 | పచ్చిపులుసు సత్యనారాయణ | " | " |
| 9 | ఆర్. సుబ్బావధాన్లు | మానేపల్లి | " |
| 10 | ఆదూరి భాస్కరరావు | నర్సాపురం | " |
| 11 | శ్రీ డి. వెంకటరామలింగేశ్వరరావు | మద్రాసు | 25-00 |

☞ సవరణ : 44వ పేజీలో 10వ లైనులో `నుతికి తరవాత మిగతా 6 శ్లోకాలు స్తుతికి చెందినవని చదువుకోవాలి.

# ఆదిత్యహృదయ పీఠిక

## సూర్యోపాసనవల్ల వివిధ లాభముల నందిన వ్యక్తులు

1 వాల్మీకి రామాయణం శత్రువిజయమును గోరువారు సూర్యోపాసన జేయవలయునని చెప్పింది. రామప్రభువు శత్రువిజయము నందెను

2 శ్రీమద్భాగవతము "తేజస్కామో విభావసుం" తేజస్కాముడు సూర్యోపాసన జేయవలయునని తెల్పింది

3 స్కాందపురాణంలో "దినేశంసుఖార్థం" సుఖముకొరకు దినేశుని భజింపవలయునని కలదు.

4 మహాభారతం అరణ్యపర్వంలో "ధర్మరాజు" సూర్యోపాసన గావించి వారివలన అక్షయపాత్రను బొంది, నిత్యము అతిధి పూజ కావించేవాడని యున్నది

5 మహాభాగవతం దశమస్కంధంలో సూర్యోపాసకుడైన "సత్రాజిత్తునకు". వారు శ్యమంతకమణినొసగినటుల కన్పడుచున్నది

6 ఋక్షరజస్సు అనువానరమునకు సుగ్రీవుని, కుంతీదేవికి కర్ణుని, సూర్యభగవానుడు పుత్రులనుగా అనుగ్రహించియుండుట జగద్విదితము

7 ఋగ్వేదము, అధర్వణవేదములందును ఇతరపురాణములందును సూర్యుడు "ఆరోగ్యదేవత" కాన వారిని పూజింపవలయునని డిండిమఘోషము చేయబడినది

శ్లో॥ ఆరోగ్యంభాస్కరాదిచ్ఛే। చ్ఛ్రియమిచ్ఛేద్ధుతాశనాత్।
ఈశ్వరాద్జ్ఞానమిచ్ఛేచ్ఛ। మోక్షమిచ్ఛేజ్జనార్ధనాత్॥

(మత్స్యపురాణం)

తా॥ భాస్కరుని వలన ఆరోగ్యమును గోరవలెను. శ్రీకృష్ణునిపట్టపుర యైన జాంబవతికి సుతుడు సాంబుడనువాడు దుర్వాసమహర్షిశాపమున కుష్ఠరోగియై సూర్యారాధనగావించి, నిరోగి, సుందరాంగుడు అయ్యె సాంబపురాణంలోవుంది బాణభట్టు బావమరిది భక్తకవియ "మయూరభట్టు" సూర్యోపాసనాప్రభావముచేత నిరోగి, వజ్రశరీ దైయ్యెను. ఇతడు సూర్యమహిమను ప్రతిపాదించు "మయూ శతకమును వ్రాసెను సూర్యోపాసనా విధానమే"నేచురోపతీ." అమెరిక డాక్టరు "మిస్టర్ జాన్‌డోన్," అనువారు సూర్యకిరణాల వలన క్షయవ్యా వంటి భయంకర రోగమునుగల్గించుక్రిములు నష్టమగునని ప్రకటిం యుండెను.

## ఆరోగ్యమే మహాభాగ్యము

ఈ మహాభాగ్యమునకు ముఖ్యదేవత సూర్యభగవానుడు. వీరు ప్రత్య దైవము కాన వీరినందరు ఆరాధించి సమస్త సుఖములు బడయవచ్చును.

మనము ఈలోకంలో విషయ సుఖములను గాని పరలోకంలో స్వర్గసుఖమును గాని ఇవియెల్ల అక్కరలేదని తలచినవారు మోక్షసుఖమ గాని పొందవలయుననిన శరీరారోగ్యము ముఖ్యము. కావుననే మహా కివికాళిదాసు "శరీరమాద్యం ఖలుధర్మసాధనం" ధర్మసాధనములలో శరీరము మొదటి సాధనమని సెలవిచ్చిరి. కానియీశరీరము సహజముగ "శరీరంవ్యాధిమందిరం" అన్నటుల రోగనిలయముగానున్నది. అందు వలన మానవులందరు ప్రయత్నం చేసి శరీరమును నిరోగముగావించు కొని సకలశ్రేయస్సులనందవలయును.

మనము ఆరోగ్యముకొరకు కొన్ని నియమములను పాటింపవలయును.

ఆరోగ్యదేవతయగు ఆదిత్యునకు వారములేడింటిలో ఆదివారము మిక్కిలి ప్రీతికరము, అందుచే ఆవారంనాడు నూనెతోటి తలంటు కొన కూడదు. ఉసిరిక, మద్యము, మాంసము, స్త్రీ వీనిని సేవింపరాదు.

శ్లో॥ ఆమిషం మధుపానంచ। యఃకరోతిరవేర్దినే।
సప్తజన్మభవేద్రోగీ। జన్మజన్మదరిద్రతః॥

మానవులెవ్వరైనను ఆదివారమునాడు మధుమాంసముల సేవింతు రేని యేడుజన్మలవరకు రోగియగును. జన్మజన్మలందు దరిద్రుడుగను అగును

శ్లో॥ స్త్రీతైలమధు మాంసాని। యస్త్యజేత్తురవేర్దినే।
నవ్యాధిశోకదారిద్ర్యం। సూర్యలోకంసగచ్ఛతి॥

స్త్రీ సేవనము. అభ్యంగనస్నానము మద్యము మాంసము ఆది వారము నాడువిడిచి పెట్టిన యెడల వారికి వ్యాధి భయము శోకము దరిద్రం రావు. వారు సూర్యలోకమునకు బోవుదురని తాత్పర్యము కాన రవి వారమున ముఖ్యంగా బ్రహ్మచర్యవ్రతము గల్గియుండ వలయును.

ఈ నియమముల నవలంభించితిమేని సూర్యానుగ్రహములభించి యారోగ్యవంతులమయ్యెదము. మరియు నిత్యము ఆచరింప వలసిన నియమములు కొన్ని గలవు. మానవు లందరు సూర్యోదయానికి ముందే శయ్యను వదిలిపెట్టవలయును అటుల నిదురలేవక పోయినచో పాపము వచ్చునని వేదము, రామాయణము, తెల్పినవి.

ఒకప్పుడు దేవతలకు యజ్ఞము చేయవలయునని సంకల్పవ గలిగినది. అందుకుగాను వలయు హవిస్సును తయారు చేయుట. వారు ధాన్యమును దంపిరట; అందువలన హింస యేర్పడినదట. వా అగ్నిహోతృని సహాయముతో ఆపాపమును గ్రహింప గల "అప్త్యేన వారిని సృజించి, ఆపాపమును వారి యందుంచిరట; వారు "ఆపా

ఆమృజత సూర్యోభ్యుదితే."

తా॥ వారాపాపమును సూర్యోదయానంతరము నిద్రించిన వారియందుం రట; వారు. "సూర్యాభ్యుదిత స్సూర్యాభినిమ్రుక్తే" సూర్యాస్తమయకాలంల నిద్రించే వారి యందుంచిరట; ఇటుల ఆపాపముక్రమంగా బ్రహ్మహత్య పాతకుని వరకు వెళ్లి యంతటితో ఆగిపోయినదట.

(కృష్ణయజుర్బ్రాహ్మణం మూడవ అష్టకం;

ఈ నీతి బోధకార్థవాదవాక్యముచే సూర్యోదయానంతరమ నిద్రించిన యడల పాపము వచ్చునుగాన అంతకు ముందుగనే నిద్రలేవ వలయునని సారము. రామాయణంలో గూడ సూర్యోదయాస్తమయమ లందు నిద్రింపరాదని వాల్మీకి మహర్షి తెల్పియుండెను

భరతుడు రాముడు అరణ్యమునకు వెళ్లిన సంగతి తనకేమియు తెలియదని కౌసల్యా దేవివద్ద నలభైయెనిమిది శపథములు చేసియుండెను అందొకటి.

శ్లో॥ ఉభేసంధ్యేశయానస్య। యత్పాపంపరికల్ప్యతే।
తచ్చపాపంభవేత్తస్య। యస్యార్యోనుమతేగతః॥

తా॥ తల్లీ! ఎవరియనుమతిపైరాముడరణ్యానికి వెళ్లెనో వారు రెండు సంధ్యలలోనిదురించువారికి రాగల పాప మనుభవింతురని ప్రతిజ్ఞచేసెను.

మేమనగా సూర్యునికెదురుగ కూర్చొని మలమూత్రవిసర్జన
ఈవిషయమును గూడ భరతుడు

ర్యంచ ప్రతిమేహతు" అనుశపథముద్వారా ప్రకటించెను.
దయానంతరము పండ్లుతోమరాదు.
క యర్థవాదవాక్యము వేదంలో గలదు.

జ్ఞంలో వీరభద్రుడు సూర్యుని దంతములను రాల గొట్టి
స్మా త్పూషాప్రపిష్టభాగో౽దంత ర్రోహితందైవా అబ్రువన్
గముగయివ్వవలెను ఏలన వారికిదంతములు లేవుగాన నమల
డి. ఇందుమూలంగా వారు, ఉదయించిన తరువాత వారి
లి దంత ధావనము చేసితి మేని వారినవమానించినట్లగును.
యమునకు ముందె దంత ధావన జేసికోవలయును

విధంగా నియమ పాలనంచేయుచుండిన యెడల మంచి
మేర్పడును.

# ఆదిత్యహృదయము

పూజావిధానము:-

ఆచమ్య॥ కేశవాయస్వాహా। నారాయణాయస్వాహా। మాధవాయ స్వాహా। గోవిందాయనమః। విష్ణవేనమః। మధుసూదనాయనమః। త్రివిక్ర మాయనమః। వామనాయనమః। శ్రీధరాయనమః, హృషీకేశాయనమః। పద్మనాభాయనమః। దామోదరాయనమః। సంకర్షణాయనమః। వాసుదేవా యనమః। ప్రద్యుమ్నాయనమః। అనిరుద్ధాయనమః। పురుషోత్తమాయన మః। అధోక్షజాయనమః। నారసింహాయనమః। అచ్యుతాయనమః। జనార్ద నాయనమః। ఉపేంద్రాయనమః, హరయేనమః, శ్రీకృష్ణాయనమః॥ ఉత్తిష్ఠంతు। భూతపిశాచాః।ఏతేభూమిభారకాః ఏతేషామవిరోధేన। బ్రహ్మ కర్మసమారభే॥ ఓంభూః। ఓంభువః। ఓగ్ంసువః: ఓంమహః। ఓంజనః। ఓంతపః। ఓగ్ంసత్యం ఓంతత్సవితుర్వరేణ్యం భర్గో దేవస్యధీమహి। ధియోయోనః ప్రచోదయాత్। ఓమాపోజ్యోతీరసోఽమృతం బ్రహ్మ భూర్భువస్సువరోమ్॥ మమ ఉపాత్త। సమస్తదురితక్షయ ద్వారా శ్రీపర మేశ్వరప్రీత్యర్థం। శుభేశోభనెముహూర్తే। ఆద్యబ్రహ్మణః ద్వితీయపరార్థే। శ్వేతవరాహకల్పే। వైవస్వతమన్వంతరే। కలియుగే। ప్రథమపాదే జంబూద్వీపే భరతవర్షే। భరతఖండే, మేరోః, దక్షిణదిగ్భాగే, శ్రీశైలస్య ఈశాన్యప్రదేశే గంగాగోదావర్యోః మధ్యప్రదేశే, శోభనగృహే, సమస్తదేవతా, బ్రాహ్మణ, హరిహరసన్నిధేః

అస్మిన్ వర్తమానేన ...వ్యావహారిక చాంద్రమానేన . నామసంవ త్సరే ...అయనే... ఋతౌ... మాసే....పక్షే....తిధే . వాసరే, శుభనక్షత్ర శుభయోగ శుభకరణ ఏవంగుణ విశేషణ విశిష్టాయాం శుభతిథౌ మమఃఉపాత్తసమస్తదురితక్షయద్వారా శ్రీపరమేశ్వరప్రీత్యర్థం శ్రీమాన్ .... గోత్రః ... నామధేయః, ధర్మపత్నీసమేతోఽహం, శ్రీమతః ....

గోత్రస్య... నామధేయస్య ధర్మపత్నీ సమేతస్య। మమసకుటుంబస్య క్షేమస్థైర్యవిజయ అభయ ఆయురారోగ్యైశ్వర్యాభివృద్ధ్యర్థం। సంజ్ఞా ఛాయాసమేత శ్రీసూర్యనారాయణస్వామి దేవతాముద్దిశ్య, శ్రీసూర్య నారాయణస్వామిదేవతాప్రీత్యర్థం మమ శరీరేవర్తమాన, వర్తిష్యమాణ, వాత, పిత్త, కఫోచ్ఛ్వాదినానాకారణ నిమిత్తజ్వర, పాండు, కుష్ఠ, శూల, అతిసార, ధాతుక్షయ, వ్రణ, మేహ, భగందర పైశాచిక బాధాది నామక సమస్తామయ నివృత్తిద్వారా శీఘ్రమేవ శరీరారోగ్యసిద్ధ్యర్థం

ఆదిత్యహృదయ స్తోత్రపారాయణ మహంకరిష్యే,
అస్య శ్రీ ఆదిత్యహృదయస్తోత్ర మహామంత్రస్య, అగస్త్యో
భగవాన్ ఋషిః। అనుష్టుప్ఛందః, బ్రహ్మాదేవతా।
రశ్మిమతే ఇతిబీజం। సూర్యాయేతిశక్తిః। నమఇతికీలకం.
మమనిరస్తాశేష విఘ్నతయా బ్రహ్మవిద్యాసిద్ధౌ,
నీరోగతాసిద్ధౌ, సర్వత్రజయసిద్ధౌ, జపేవినియోగః,

1 రశ్మిమతేనమః జ్ఞానాయ – అంగుష్ఠాభ్యాంనమః
2 సముద్యతేనమః ఐశ్వర్యాయ – తర్జనీభ్యాంనమః
3 దేవాసురనమస్కృతాయనమః-శక్త్యై – మధ్యమాభ్యాంనమః,
4 వివస్వతేనమః - బలాయ – అనామికాభ్యాంనమః
5 భాస్కరాయనమః - తేజసే - కనిష్ఠికాభ్యాంనమః
6 భువనేశ్వరాయనమః – వీర్యాయ – కరతలకరపృష్ఠాభ్యాంనమః

1 రశ్మిమతేనమః – జ్ఞానాయ – హృదయాయనమః
2 సముద్యతేనమః – ఐశ్వర్యాయ – శిరసేస్వాహా
3 దేవాసురనమస్కృతాయనమః – శక్త్యై – శిఖాయైవషట్
4 వివస్వతేనమః – బలాయ – కవచాయహుం

5 భాస్కరాయనమః – తేజసే – నేత్రత్రయాయవౌషట్
6 భువనేశ్వరాయనమః .వీర్యాయ – అస్త్రాయఫట్
భూర్భువస్సువరోమితి దిగ్బంధః

ధ్యానం :–

శ్లో॥ పవిత్రస్య విష్ణోరూపంయత్। సత్యర్తస్యచ బ్రహ్మణః
అమృతస్యమృత్యోశ్చ। సూర్యమాత్మానమీమహే॥

# ఆదిత్యహృదయము

స్తోత్రప్రారంభః :–

1

శ్లో॥ తతోయుద్ధపరిశ్రాంతం। సమరే చిన్తయాస్థితం।
రావణంచాగ్రతోదృష్ట్వా। యుద్ధాయసముపస్థితం॥

2

శ్లో॥ దైవతైశ్చసమాగమ్య ద్రష్టు మభ్యాగతోరణం
ఉపాగమ్యా బ్రవీద్రామ మగస్త్యో భగవాన్ ఋషిః॥

1 ప్రతి పదార్థము:–

తతః = అనంతరమందు,
యుద్ధపరిశ్రాంతం = యుద్ధము నందలసి యున్నట్టియు,
యుద్ధాయ = యుద్ధముకొరకు,
సముపస్థితం = సమీపంగా వచ్చియున్నట్టి,
రావణంచ = రావణునిగూడ,
అగ్రతః = ఎదురుగ,
దృష్ట్వా = చూచి,
సమరే = యుద్ధమందు,
చింతయా = చింతతో,
స్థితం = ఉన్నవాడును,

2 దైవతైశ్చ = దేవతలతో గూడ,
సమాగమ్య = కలసికొని
రణం = యుద్ధమును,
ద్రష్టుం = చూచుటకొరకు,
అభ్యాగతః = సమయానికివచ్చి నటువంటినీ
భగవాన్ = త్రికాలజ్ఞుడైన,
అగస్త్యః = అగస్త్యుడను
ఋషిః = మహర్షి.
ఉపాగమ్య = దగ్గరకు వచ్చి,
రామం = రామునిగూర్చి
అబ్రవీత్ = పలికెను.

భావము:- ఒకటి రెండుశ్లోకాలు ఒకేఅన్వయము. రావణుని యొక్క సారధి అతనియాజ్ఞ ప్రకారము రణరంగంలో రథముంచిన తర్వాత రామ-రావణయుద్ధాన్ని చూచుటకై వచ్చిన దేవతలతోగూడ వచ్చినవాడును భూతభవిష్యద్వర్తమానములను మూడుకాలములు ఎఱిగినయగస్త్యమహర్షి అంతవరకు రావణునితో జరిగిన యుద్ధంలో అలసి యున్నవాడై మరల యుద్ధము కొరకు వచ్చిన రావణుని యెదురుగ చూచి పరత్వ ప్రకటన లేకుండ మనుష్యుడుగానే వ్యవహరింపుచు నీతనిచంపుటెట్లాఅని చింతలో మునిగియున్న రాముని దగ్గరకు వచ్చి యాతనితోనిట్లు పలికెను.

3

శ్లో॥ రామ రామ మహాబాహో, శృణుగుహ్యంసనాతనం
యేన సర్వానరీన్ వత్స, సమరే విజయిష్యసి॥

ప్రతి పదార్థము :-

వత్స= కుమారా, రామరామఅని ప్రేమతో రెండుమార్లు పిలచి
మహాబాహో = శత్రువుల జంపగల దీర్ఘమైన బాహువులు గలవాడా,

యేన = ఏస్తోత్రముచేత, (తం = అటు వంటి)
సర్వాన్ = సమస్తమైన, సనాతనం = నిత్యమైనదియు
అరీన్ = శత్రువులను, గుహ్యం = రహస్యమైనదియు
సమరే = యుద్ధమందు. నగుస్తోత్రమును,
విజయిష్యసి = జయింపగలవో శృణు = వినుము

తా॥ వత్స, రామ, ఆజానుబాహో! రహస్యమైనదియు వేదమువలె నిత్యమైనదియునగు స్తోత్రమును వినుము. దీనివలన యుద్ధమున సమస్త శత్రువులను జయింప గలవు.

4

శ్లో॥ ఆదిత్యహృదయం పుణ్యం। సర్వశత్రువినాశనం।
జయావహం జపేన్నిత్యం। అక్షయం పరమంశివం॥

5

శ్లో॥ సర్వమంగళమాంగళ్యం। సర్వపాప ప్రణాశనం
చింతాశోకప్రశమనం। ఆయుర్వర్ధనముత్తమం॥

ప్రతిపదార్థము :-

ఆదిత్య హృదయం = ఆదిత్య హృదయమను స్తోత్రము
పుణ్యం = పుణ్యమును గలుగ జేయును
సర్వశత్రు వినాశనం = సమస్త శత్రువులను నాశనముచేయునది
జయావహం = జయకరమైనది
అక్షయం = నాశరహితమైనదియు
పరమం = ఉత్కృష్టమైన
శివం = కల్యాణకరము

ప్రతి పదార్థము :-

5 సర్వమంగళ మాంగళ్యం = మంగళము లన్నిటిలో మంగళకర మైనదియు

సర్వపాప ప్రణాశనం = సమస్త పాపములను బూర్తిగ బోగొట్టునదియు

చింతాశోక ప్రశమనం = చింతను శోకాన్ని పోగొట్టునటు వంటిన్ని

ఆయుర్వర్ధనం = ఆయుస్సును వృద్ధినందించునదగు

ఉత్తమం = శ్రేష్టమైనదియు (అగు ఆదిత్య హృదయమును)

నిత్యం జపేత్ = ఎల్లప్పుడు జపింపవలయును.॥

తా॥ ఆదిత్య హృదయము పరమపావనమైనదట. మన లోపలగల కామక్రోధాలు అను అంతఃశతృవులను వెలుపల మనలను ద్వేషించు వారిని, మనము ద్వేషించువారిని (ఇటువంటి శతృవులందరిని) నశింప జేయు శక్తి ఈ స్తోత్రములో ఉందట. శుభం కల్గుతుంది. లభించిన జయము, కూడిన శుభము కలకాలము నిలబడతాయి. శతృజయము లభించినానూ లాభనష్టములు సమముగా నుండునటుల ఒకప్పుడు జయము లభింపకపోవచ్చు ఈ స్తోత్రపాఠమట్లుగాక జయమును కలుగజేయునట.

ఈ మహామంత్రము సకల పాపములను పోగొట్టి ఆయుస్సును పెంచి చింతాశోకములను రెంటినీ ఉపశమింపజేస్తుంది. కాన ఇంతకు మించిన స్తోత్రంలేదు, మరియు కోరికలేకుండా స్తుతించు భక్తులకు మోక్షమునే కలుగజేస్తుంది.

6

శ్లో॥ రశ్మి మంతం సముద్యంతం । దేవాసుర
నమస్కృతం ।
పూజయస్వ వివస్వన్తం। భాస్కరం భువనేశ్వరం॥

ప్రతిపదార్థం :-

| | |
|---|---|
| రశ్మిమంతం = బంగారువంటి కాంతిగల ప్రశస్తమైన కిరణములు గలవాడును | వివస్వన్తం = తన తేజోవిశేషముచేత మిగిలిన తేజస్సులను కప్పివేయువాడును |
| సముద్యన్తం = పూర్తిగ కనిపించునటుల బాగుగ ఉదయించిన వాడును | భాస్కరం = సూర్య, చంద్ర అగ్నులకును తేజస్సు నిచ్చు వాడును |
| దేవాసుర నమస్కృతం = దేవతలు, అసురులు (రాక్షసులు) అందరిచేతను నమస్కరింపబడిన వాడును | భువనేశ్వరం = ఎండవానలచేత సమస్త లోకాలను నియమించు వాడును అగు సూర్య భగవానుని |
| | పూజయస్వ = పూజింపుము |

తా॥ రామా! స్తుతించవలసిన (పూజింపవలసిన) దేవతా స్వరూపమున గూర్చి నీకు ధ్యానము నిమిత్తము తెలుపుచుంటిని. ఆ సూర్యభగవానుడు బంగారు కాంతివలె ప్రశస్తమైన కిరణములుగల్గి బాగుగ ఉదయించినవాడును, సత్వగుణము, రజోగుణము, తమోగుణము, అను మూడు గుణములకు ప్రతీకలైన దేవాసురులచేత నమస్కరింపబడే వాడును, తన తేజో విశేషముచేత చంద్రుడు, అగ్ని, మొదలగు చిన్న చిన్న తేజోమండలములను కప్పివేయువాడునూ, ఎండగాచియు, వర్షింపజేసియు, సమస్త లోకములను నియమించువాడునగు ఆదిత్యుని సూర్య,

చంద్రి-అగ్నులకుకూడా కాంతినిచ్చు పరబ్రహ్మ స్వరూపముగా ఎరిగి పూజింపుము అనెను.

7

శ్లో॥ సర్వదేవాత్మకో హ్యేష। తేజస్వీరశ్మి భావనః।
ఏషదేవాసురగణాన్। లోకాన్పాతి గభస్తిభిః॥

ప్రతిపదార్థము:-

హి = ఏకారణము వలననగా
సర్వ దేవాత్మకః = సర్వదేవతా శరీరుడు
తేజస్వీ = పరులను దిరస్కరింప దగిన తేజస్సుగలవాడు
ఏషః = ఇతడు
గభస్తిభిః = కిరణములచేత
దేవాసురగణాన్ = దేవాసుర సంఘములను
పాతి = రక్షించు చున్నాడు

తా॥ భాస్కరుని యుపాసింపవలసిందని యుపదేశించిన తర్వాత దేవతలెందరోయుండగా యీసూర్యునేయేలపూజింపవలెను అనుసందేహము దొలగింప అగస్త్య మహర్షి యిటుల దెల్పుచున్నాడు. సకల దేవతలు ఆభాస్కరునిలోనే మూర్తీభవించి యున్నారు దేవతలను రాక్షసులను సమభావముతో పోషించు సాత్వికస్వభావము సూర్యకిరణాలలో స్వతస్సిద్ధంగా ఉందట. ఈసూర్యుడు మంచివారికి - చెడ్డవారికి, ఉన్నవారికి-లేనివారికి, పండితులకు - పామరులకు, పూరిగుడిసెలకు- రాజభవనములకు, జడములకు - చేతనములకు, పుణ్యాత్ములకు - పాపాత్ములకు, అందరకూ సమానంగా ప్రకాశము, ప్రేరణ కలుగజేయు చున్నాడు.

8

శ్లో॥ ఏష బ్రహ్మాచ విష్ణుశ్చ, శివస్కన్దః ప్రజాపతిః।
మహేంద్రోధనదః కాలో। యమస్సోమోహ్యపాంపతిః

ప్రతి పదార్థము:-

ఏషః = ఇతడే
బ్రహ్మాచ = చతుర్ముఖ బ్రహ్మయు
విష్ణుశ్చ = విష్ణుమూర్తియు
శివః = సాంబమూర్తియూ
స్కన్దః = కుమారస్వామియూ
ప్రజాపతిః = ప్రజాపతియూ
మహేంద్రః = దేవరాజైన ఇంద్రుడును
ధనదః = కుబేరుడును
కాలః = కాలస్వరుపుడును
యమః = శిక్షించు వాడైన యముడును
సోమః = చంద్రుడునూ
అపాంపతిః = వరుణుడునూ
ఏషః = ఈతడే

తా॥ బ్రహ్మ, విష్ణు మహేశ్వరులు, కుమారస్వామి, ప్రజాపతి, ఇంద్రుడు, కుబేరుడు, భూత భవిష్య ద్వర్తమానములను దెల్పు కాలస్వరుపుడునూ, శిక్షించు యమధర్మరాజును, కాంతి నొసగు చంద్రుడును, జలాధిపతియగు వరుణుడు ఈ సూర్యభగవానుడే.

9

శ్లో॥ పితరోవసవ స్సాధ్యా హ్యశ్వినౌమరుతోమనుః
వాయుర్వహ్నిః ప్రజాప్రాణ, ఋతుకర్తా ప్రభాకరః।

ప్రతి పదార్థము:-

పితరః = పితృదేవతలు
వసవః = అష్ట వసువులు,
సాధ్యాః = పన్నెండు మందిసాధ్యులు
అశ్వినౌ = అశ్వినీ కుమారు లిరువురు
మరుతః = మరుద్గణములు
మనుః - వైవస్వత మనువు
వాయుః = వాయువు
వహ్నిః = అగ్ని,

15

ప్రజాప్రాణః = ప్రజలకు ప్రభాకరః = ప్రభ నిచ్చువాడు
ప్రాణదాత ఆదిత్యః = ఆదిత్యుడు.
ఋతుకర్తా = వసంతాది ఋతు నిర్మాత

తా॥ సూర్యుని సర్వ దేవాత్మకత్వము అంతటితో ఆగలేదు. వంశ వృద్ధికరులైన పితరులు, ఎల్లప్పుడుండే వసువులెనిమిదిమంది, బ్రహ్మ ముఖమునుండి సృజింపబడి మంత్రమూర్తులైన సాధ్యులు పన్నెండుమంది· అధి వ్యాధులను పోగొట్టు అశ్వనీ కుమారులు, ప్రజలకు ప్రాణములను పోసే ప్రజాపతి, ఆప్రాణములను హరించే యముడు, భూమిని సస్యశ్యా మలంచేసే చంద్రుడు, ఆలోచనలనుయిచ్చు మనువు, గాలి, నిప్పు, ఊపిరి– ఋతువులు, పగలు - రాత్రి వీటన్నిటికి మూలాధారము సూర్యుడే। సూర్యుని సహాయముతోనే – ఈ యీ పనులన్ని యధావిధిగా సాగుచున్నవి. ఇట్లింతవరకు సూర్యభగవానుడు సర్వదేవతా స్వరూపుడైనందున సూర్యమండలాంతర్యామి యగు పరబ్రహ్మోపాసనచేతనే సర్వ దేవతోపాసనా ఫలము సిద్ధించగలదని ఈ స్తోత్రమహాత్మ్యము నిరూపింపబడినది.

10

ఇచటనుండి ఆదిత్యహృదయ స్తోత్రమారంభమగు చున్నది.

శ్లో॥ ఆదిత్యః స్సవితా సూర్యః। ఖగః పూషా గభస్తిమాన్
సువర్ణ సదృశో భానుః హిరణ్య రేతా దివాకరః॥

ఈ శ్లోకము నాల్గవ పాదమున హిరణ్యరేతః అనుచోట "స్వర్ణరేతా" అను పాఠాంతరముకూడా కలదు

ప్రతిపదార్థము :-

ఆదిత్యః = ఆదిత్యుడు | సువర్ణ సదృశః
సవితా = సవితయు |
సూర్యః = సూర్యుడు | భానుః = ప్రకా
ఖగః = ఖగుడు | హిరణ్యరేతాః =
పూషా = పూషుడు | రేః
గభస్తిమాన్ = కిరణములు గలవాడు | దివాకరః = ప
 | జేయ

సూర్యదేవా

తా॥ నీవాదిత్యుడవు. జగత్తును సృష్టించువాడవు తమ కర్మలందు ప్రవర్తింపజేయువాడవు. ఆకాశవీధిలో స వర్షమునిచ్చు జగత్తును పోషించేవాడవు, ప్రశస్తకిరణాలక కాంతిగలవాడవై ప్రకాశము నొసగి పగటిని కలుగజేయు భావము.

11

శ్లో॥ హరిదశ్వస్సహస్రార్చి । స్సప్తసప్తిర్మరీచి
తిమిరోన్మథన శ్శంభు । స్త్వష్టామార్తాండ

ప్రతిపదార్థము :-

హరిదశ్వః = ఆకుపచ్చరంగు గల గుఱ్ఱములుగలవాడవు | శంభుః = సుఖమున
సహస్రార్చిః = వేయి కిరణములుగలవాడవు | త్వష్టా = సమస
సప్తసప్తి = సప్తాశ్వములువాహనముగలవాడవు | మార్తాండః = వ ... మును
మరీచిమాన్ = కిరణములుగలవాడవు | అంశుమాన్ =
తిమిరోన్మథనః = చీకట్లనుబెకలించువాడవు

తా॥ పచ్చనిగుఱ్ఱములు గల్గివేయికిరణములతో నొప్పినవాడు సప్త నామకఅశ్వములు గలవాడు, శంఖ చక్ర గదా పద్మములు ధరించువాడు, చీకటిని బోగొట్టినవాడును, సుఖమును గల్గించువాడును, సమస్త రూపములను కృశింపజేయువాడును, మరణించిన అండమునుండి పుట్టినవాడును, కిరణములతో నొప్పువాడు అని తాత్పర్యము.

12

శ్లో॥ హిరణ్యగర్భ శ్శిశిర। స్తపనో భాస్కరో రవిః ।
అగ్నిగర్భోఽదితేః పుత్రః। శంఖః శిశిరనాశనః ॥

ప్రతి పదార్థము :-

హిరణ్య గర్భః = హిరణ్యము గర్భమున గల వాడును

శిశిరః = చల్లనైనవాడును

తపనః = తపింపజేయు వాడును

భాస్కరః = ప్రకాశింపజేయు వాడును

రవిః = రవియు

అగ్నిగర్భః = అగ్నిగర్భమందు గలవాడును

అదితేఃపుత్రః = అదితికి పుత్రుడును

శంఖః = శంఖుడును

శిశిరనాశనః = మంచును బోగొట్టువాడును సూర్యుడే

తా॥ అతడు హిరణ్య గర్భుడు. సృష్టికి ఆదియాధారం ఈహిరణ్యమే. ఈ హిరణ్యం సూర్యగర్భంలో పుష్కలంగా వుంది. ఎంత కాళరాత్రి గడిచినా సూర్యుడుదయించుటతో ఆశలు చిగురిస్తాయి. శిశిరంలో ఉన్న చల్లదనం, సుఖం సూర్యుని వల్లనే లభిస్తాయి. అనగా తాపత్రయతప్తులకు విశ్రాంతి స్థానము సూర్యుడే. ఆసూర్యుడే మండు వేసవిలో తపనుడై భూమిని తపింపజేస్తాడు. కాంతి నిచ్చే భాస్కరుడే చైతన్యాన్ని ప్రసాదించే అంత స్తేజస్సును వెలయించే రవి యౌతాడు. అతని కడుపులో బంగార

మున్నట్లే అగ్ని కూడయున్నది. అదితికి అల్లారు బిడ్డగాన అతడున్న
చోటు పవిత్రమౌతుంది "శంఖ"అను శబ్దంలో శం అనుపదము సుఖమున
ఖ శబ్దం ఆకాశాన్ని తెలుపునుగాన సూర్యగమనం ఆకాశానికి పావనత్వ
యిస్తుంది. అతడున్న చోట మంచు విల్వనందున మంచును హరించి
మంచినిపెంచే మహనీయుడు సూర్యుడు.

13

శ్లో॥ వ్యోమనాథ స్తమో భేదీ। ఋగ్యజుస్సామపారగః ।
ఘనవృష్టిరపాంమిత్రో । వింధ్య వీథీ ప్లవంగమః ॥

ప్రతి పదార్థము:–

వ్యోమనాధః = ఆకాశానికి పతి
తమోభేదీ = చీకటిని బోగొట్టు వాడు
ఋగ్యజుస్సామపారగః = ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, పూర్తిగ చూచిన వాడు
ఘనవృష్టిః = గొప్పవర్షము విచ్చువాడు
అపాంమిత్రః = జలములకు మిత్రుడు
వింధ్యవీథీప్లవంగమః = దక్షిణాయనమందు వింధ్యమార్గము సంచరించువాడు

తా॥ ఆకాశానికి అధిపతియవడంవల్ల అతనికివ్యోమనాధుడనే పేరు
వచ్చింది. చీకటిని చీల్చుకొని వేదత్రయీనాదాన్ని లోకత్రయికి వినిపిస్తు
మేఘాలను మెరిపిస్తూ వర్షాన్ని కురిపిస్తూ నీళ్ళతో చెలిమి కలిగి వింధ్యా
చలం మీద దక్షిణాయనంలో గంతులు వేస్తాడీ సూర్యుడు.

14

శ్లో॥ ఆతపీమండలీ మృత్యుః పింగళస్సర్వతాపనః
(క) రవిర్విశ్వో మహా తేజాః । రక్తస్సర్వ భవోద్భవ

19

ఇరువదినాల్గవశ్లోకములో 4వ పాదములో "సర్వేషరవిః ప్రభుః" అని రవి శబ్దము వచ్చినందువల్ల ఈ శ్లోకములో కవి అని పాఠమే సమంజస మనితోచెడిని.

ఆతపీ = ఎండకాయువాడును
మండలీ = మండలాకారం కల వాడును
మృత్యుః = మృత్యు స్వరూపుడును
పింగళః = తేనెవంటి పచ్చని రంగు కలవాడును
సర్వతాపనః = అందరిని తపింప జేయువాడును
కవిః = విద్వాంసుడును
విశ్వః = ప్రపంచ స్వరూపుడును
మహాతేజాః = గొప్పతేజశ్శాలియూ
రక్తః = ఎఱ్ఱని వర్ణముగలవాడును
సర్వభవోద్భవః = సమస్త కార్య సమూహముయొక్క ఉత్పత్తికి హేతువైనవాడును

తా॥ కోపమువస్తే కాలాగ్నిలా మండిపడును. సూర్యమండలం అతనికి జన్మకుండలి. ఆ మండలికి ఆతడే ప్రభువు. ఉదయకాలంలో పింగళ వర్ణంలో ఉంటాడు. అవసరమైనప్పుడు ప్రాణులందరినీ తపింప జేస్తాడు. నూతనంగా ప్రపంచాన్ని సృష్టించగలవాడు గాన కవియను నామము ఈతనికి సార్థకము. విశ్వరూపుడైన అతని దివ్య తేజస్సులో రంజిల్లని అంశము లేదు అన్ని భావాలకు, భవములకు, భువనాలకు అతడే మూలము.

15

శ్లో॥ నక్షత్ర గ్రహతారాణా। మధిపో విశ్వభావనః
తేజసామపి తేజస్వీ। ద్వాదశాత్మన్నమోస్తుతే॥

ప్రతిపదార్ధము :-

నక్షత్ర గ్రహతారాణాం

నక్షత్ర = అశ్వన్యాది నక్షత్రములకు

గ్రహ = చంద్రాది గ్రహములకు

తారాణాం = చుక్కలకు

అధిపః = ప్రభువును

విశ్వభావనః = విశ్వస్థితికి మూలమైనవాడు

తేజసామపి = తేజస్సు కలవానికి కూడ

తేజస్వీ = గొప్ప తేజస్సు గలవాడవగు

ద్వాదశాత్మన్ = పన్నెండు మూర్తులుగలసూర్యభగవానుడవగు

తే = నీకు

నమః = నమస్కారము

అస్తు = అగుగాక

తా॥ ఆకాశంలో కనిపించే అశ్వని మొదలు రేవతి వరకుగల యిరువదేడు నక్షత్రములకు కదలికగల చంద్రాది గ్రహములకు, కదలిక లేని చుక్కలకు, సూర్యుడే ప్రభువు. మన సూర్యునిలాంటి సూర్యులు అనేకమంది బ్రహ్మాండములో ఉన్నారు. వారికి ఆదిసూర్యుడు ఆదిత్యుడు. ఆలాటి ఆదిత్యులు పన్నెండుమంది. వారిలో విష్ణువు ప్రధానుడు. ఈద్వాద శాత్మ స్తుతితోటి ఆదిత్యహృదయం లోని పూర్వార్థం అనగా స్తుతిభాగం ముగుస్తుంది.

16

శ్లో॥ నమః పూర్వాయగిరయే। పశ్చిమేగిరయేనమః
జ్యోతిర్గణానాంపతయే। దినాధిపతయేనమః॥

ఇకమీద నుతిభాగము (అనగా) నమకం ప్రారంభం అవుతుంది.

ప్రతిపదార్థము :-

పూర్వాయ=తూర్పుదిక్కునందున్న
గిరయే=పర్వతముకొరకు
నమః= నమస్కారము
పశ్చిమే= పడమరదిక్కునందున్న
గిరయే= పర్వతము కొరకు
నమః= నమస్కారము

జ్యోతిర్గణానాం= తేజస్సమూహములకు
పతయే=ప్రభువుకొఱకు
నమః= నమస్కారము
దినాధిపతయే = పగటికధిపతియగు సూర్యునికొరకు
నమః= నమస్కారము

తా॥ సూర్యుడు తూర్పుదిక్కున ఉదయపర్వతముపై యుదయించును. పడమరదిక్కున అస్తమనపర్వతముపై యస్తమించును. కావున ఆ పర్వతముల స్వరూపునిగానే భావించి, యట్టి వేవెలుగుల ప్రభువునకు పగటి కాలమునకు అధిపతియైన కాంతిదేవునకు నమస్కారము.

17

శ్లో॥ జయాయ జయభద్రాయ। హర్యశ్వాయనమోనమః।
నమోనమ స్సహస్రాంశో। ఆదిత్యాయనమోనమః॥

ప్రతిపదార్థము:-

జయాయ = జయమూర్తికొఱకు
నమః= నమస్కారము
జయభద్రాయ= జయమును మంగళమునిచ్చువానికొరకు
నమః= నమస్కారము
హర్యశ్వాయ=పచ్చని గుఱ్ఱాలు గలవారికొరకు

నమోనమః= మాటిమాటికి నమస్కారము
సహస్రాంశో= ఓ వేయికిరణాలస్వామి!
ఆదిత్యాయ = అదితి కుమారుని కొరకు
నమోనమః = మాటిమాటికి నమస్కారము

తా॥ ఎన్నడు అపజయమెరుగని జయస్వామికి నమస్కారము. మంగళముతో గూడిన జయాన్ని ప్రసాదించే జయభద్రునకు నమస్కారము. పచ్చనిగుఱ్ఱాల రధముపై పయనించే వేవెలుగులదొరకు నమస్కారము.

18

శ్లో॥ నమఉగ్రాయ వీరాయ। సారంగాయ నమోనమః।
నమః పద్మప్రబోధాయ। ప్రచండాయనమోఽస్తుతే॥

ప్రతిపదార్థము:—

| | |
|---|---|
| ఉగ్రాయ = క్రోధమూర్తి కొఱకు | పద్మప్రబోధాయ = తామరపూలను వికసింపజేయు వారి కొరకు |
| నమః = నమస్కారము | నమః = నమస్కారము |
| వీరాయ = వీరునికొరకు | ప్రచండాయ = సర్వసమర్థుడవైన |
| నమః = నమస్కారము | తే = నీకు |
| సారంగాయ = వేగంగా ప్రయాణముచేయు దేవునకు | నమః = నమస్కారము |
| నమః = నమస్కారము | అస్తు = అగుగాక |

తా॥ వీరుడైన యుగ్రమూర్తికి నమస్కారము. సంసారమందలి సారమును దెలిసిన వాడైనందున, తాను దానికి దూరంగావుండి భక్తుల నా సంసారమునుండి తరింపజేయగల తరణికి నమస్కారము. వేకువన వీచే చల్లగాలికి హాయిగా నిద్రించు తామరకములాలను తన యుదయకిరణ స్పర్శచేత మేలుకొలిపే చిన్మయ మూర్తికి నమస్కారము. సర్వసమర్థుడైన ఆ ప్రచండభానునకు నమస్కారము.

19

శ్లో॥ బ్రహ్మేశానాచ్యుతేశాయ। సూర్యాయాదిత్యవర్చసే।
భాస్వతే సర్వభక్షాయ। రౌద్రాయవపుషేనమః॥

ప్రతిపదార్థము :-

| | |
|---|---|
| బ్రహ్మ = బ్రహ్మకును | భాస్వతే = ప్రకాశించెడివాడును |
| ఈశాన = ఈశ్వరునకును | సర్వభక్షాయ = సమస్త విషయములను భక్షించువాడై |
| అచ్యుత = విష్ణుమూర్తికివి | రౌద్రాయ = భయంకరమైన |
| ఈశాయ = ప్రభువైనవాడును | వపుషే = దేహముగల |
| ఆదిత్యవర్చసే = ఆదిత్యరూపమైన వర్చస్సుతో | సూర్యాయ = సూర్యునికొరకు |
| | నమః = నమస్కారము |

తా॥ బ్రహ్మ విష్ణు మహేశ్వరులను గూడ సర్వాపదలనుండి రక్షించేవాడును చక్కని కాంతితో వెలుగుచుండువాడును భయంకరమైన దేహముతో సమస్త విషయములను భక్షించే సూర్యునకు నమస్కారము. (ఈ శ్లోకం మత్స్యావతారము, నృసింహావతారములను సూచించును)

20

శ్లో॥ తమోఘ్నాయ హిమఘ్నాయ। శత్రుఘ్నాయామితాత్మనే।
కృతఘ్నఘ్నాయ దేవాయ। జ్యోతిషాం పతయేనమః ॥

ప్రతిపదార్థము:-

| | |
|---|---|
| తమోఘ్నాయ = చీకటిని నశింప జేయువాడును | శత్రుఘ్నాయ = శత్రువులను జంపువాడును |
| హిమఘ్నాయ = మంచును బోగొట్టువాడును | అమితాత్మనే = సర్వవ్యాపకుడును |

కృతఘ్నఘ్నాయ = చేసిన మేలును మరచు వారిని చంపు వాడును

దేవాయ = తనంతట తానే ప్రకాశించు వాడును అయిన

జ్యోతిషాం = వెలుగులకు

పతయే = ప్రభువుకొఱకు

నమః = నమస్కారము

తా॥ చీకటిని బోగొట్టి మంచును చీల్చివేసి శత్రువులను సంహరించే సూర్యుడు అమితాత్ముడు. చేసిన మేలునుమరచేవారిని నిర్దాక్షిణ్యంగా శిక్షించే ప్రభువు దయ చేసేసరికి మనము మేలుకొని, యాజ్యోతిర్మయు నకు జలాంజలి యొసగుటే మనకృతజ్ఞత. అట్టి జ్యోతిర్మయునకు నమస్కారము.

## 21

శ్లో॥ తప్త చామీకరాభాయ। హరయే విశ్వకర్మణే।
నమస్తమోఽభినిఘ్నాయ। రుచయే లోక సాక్షిణే ॥

ప్రతిపదార్థము :-

తప్తచామీకరాభాయ = కాచిన బంగారు వంటి కాంతి గలవాడును

హరయే = సంసారమును హరించు వాడును

విశ్వకర్మణే= జగత్కర్తయును

తమోఽభినిఘ్నాయ = చీకటి నశింప జేయువాడును

రుచయే = కాంతి స్వరూపుడును

లోక సాక్షిణే = లోకసాక్షియైన ఆదిత్యునకు

నమః = నమస్కారము

తా॥ కాచిన బంగారము వలె కళ కళలాడుచు, భక్తులను బాధించు సంసారమును బోగొట్టువాడును మనకు లోపలవుండే అజ్ఞానమును వెలుపల బాధించే చీకటిని బోగొట్టుచు కాంతి స్వరూపుడై లోకమునకు

సాక్షియు సకల కార్య దక్షుడైన విశ్వకర్మకు నమస్కారము।

ఇంతటితోనమకం ముగుస్తుంది।

22

శ్లో॥ నాశయత్యేషవై భూతం। తదేవసృజతిప్రభుః।
పాయత్యేష తపత్యేష। వర్షత్యేష గభస్తిభిః ॥

ప్రతిపదార్థము :-

| | |
|---|---|
| ప్రభుః = పరిపాలకుడైన | ఏషః = ఇతడు |
| ఏషః = ఈ యాదిత్య దేవుడు | గభస్తిభిః = కిరణములచేత |
| భూతం = ప్రాణికోటిని | పాయతి = రక్షించు చున్నాడు |
| నాశయతి = నశింప జేయు చున్నాడు (మరల) | ఏషః = ఇతడు |
| | తపతి = ఎండగాయు చున్నాడు |
| తదేవ = ఆప్రాణికోటినే | ఏషః = ఇతడు |
| సృజతి = సృష్టి చేయుచున్నాడు | వర్షతి = వర్షించు చున్నాడు |

తా॥ ఈ సూర్యుడు ప్రాణి సమూహమునంతయు లయింప జేసి మరల ఆప్రాణి సముదాయమును సృజించుతాడు. అతడు తన వేడి కిరణాలతో మాడ్చివేసి శిక్షిస్తాడు. ఆకిరణాలతో మరల చల్లని వర్షమును ప్రసాదించి రక్షిస్తాడు.

23

శ్లో॥ ఏషసుప్తేషుజాగర్తి। భూతేషు పరినిష్ఠితః।
ఏషఏవాగ్నిహోత్రంచ। ఫలంచైవాగ్నిహోత్రిణాం॥

ప్రతి పదార్థము:-

| | |
|---|---|
| ఏషః ≡ ఇతడు | ఏషః ≡ ఇతడే |
| భూతేషు ≡ ప్రాణులు | అగ్నిహోత్రిణాం ≡ |
| సుప్తేషుసత్సు ≡ నిదురించుచుండగా | అగ్నిహోత్రమునను ష్ఠించువా దీక్షితులకు కలి |
| జాగర్తి ≡ మేలుకొనియుండును | ఫలంచ — ఫలస్వరూపముగా |
| అగ్నిహోత్రంచ ≡ త్రేతాగ్ని స్వరూపుడుగూడ | ఏషఏవ ≡ ఇతడే |

తా॥ మనమునిదురించు సమయమందుగూడ యీసూర్యు మనలో అంతర్యామియైయున్నందున సర్వకాల సర్వావస్థలందును మన తోడుగవుండి రక్షించును. దక్షిణాగ్ని, గార్హపత్యము, ఆహవనీయము మూడగ్నులకుత్రేతాగ్నులనిపేరు. ఆమూడింటిని నిత్యము సాయంకాల ప్రాతఃకాలము ఆరాధించుటకు అగ్నిహోత్రమనిపేరు. ఆస్వరూప సూర్యుడే అంతమాత్రమేగాదు। దానిని శ్రద్ధగా ఆరాధించే యజమానుల దీక్షితులని పేరు. వారికి ఈలోకంలోనకల సంపదలు వచ్చునని స్వర్గఫ కూడ వచ్చుననియు, అదే అనుష్ఠానము నిష్కామంగా చేసే వారికి మో వస్తుందని వేదమాత యుపదేశించింది. ఈ చెప్పిన సకల ఫలముల స్వ పంగా సూర్య భగవానుడే వున్నాడని భావము.

24

శ్లో॥ వేదాశ్చక్రతవశ్చైవ। క్రతూనాం ఫలమేవచ।
యానికృత్యానిలోకేషు। సర్వఏషరవిః ప్రభుః ॥

ప్రతిపదార్థము :–

వేదాశ్చ ≡ వేదములును
క్రతవశ్చైవ ≡ క్రతువులు గూడను
క్రతూనాం ≡ ఆక్రతువులయొక్క
ఫలమేవచ ≡ ఫలము గూడ
సః ≡ అతడే
లోకేషు ≡ పదునాలుగులోకము లందును

యాని ≡ ఏ,యే
కృత్యాని ≡ పనులు గలవో
సర్వాః ≡ అవన్నియు
ఏషః ≡ ఈ
ప్రభుః ≡ పరిపాలకుడైన
రవిః ≡ సూర్యభగవానుడే

తా॥ ముందుశ్లోకంలో చెప్పిన అగ్నిహోత్రము దాని నాచరించినందున వచ్చేఫలమేగాక "యావజ్జీవమగ్ని హోత్రింజుహుయాత్" జీవించియున్నంత వరకు అగ్నిని హోమంద్వారా ఆరాధించ వలయును అనియు, అంతమాత్రమేగాక సృష్టిసంచాలనము ప్రవాహరూపంగా సాగిపోవుటకు మనకు గావలసిన ఇహపరసుఖముల నివ్వగల యజ్ఞములు ఆయజ్ఞములస్వరూపము, విధానము, ఫలము మొదలగు వానినిదెలిపే వేదములు ఆయాగములను యథావిధిగా అనుష్ఠానం చేసినందు వలన ఆ సోమయాజులవారికిని లోకమునకును వచ్చేఫలములు మరియులోకంలో సమస్త ప్రాణులు తమ తమ మనుగడకై జరుపుకానే సకల కార్యములకు ఫలదాత ప్రభువైన యీసూర్యుడే.

ఇంత వరకు సూర్యమహిమ మూడు శ్లోకములతో దెలిపిరి.

25

శ్లో॥ ఏనమాపత్సు కృచ్ఛ్రేషు । కాంతారేషు భయేషు చ।
కీర్తయన్ పురుషకశ్చి। న్నావసీదతి రాఘవ॥

ప్రతిపదార్థము :-

హేరాఘవ = ఓరఘుకుమారా!
కశ్చిత్పురుషః = ఏమానవు డైనను
ఏనం = ఈయాదిత్యుని
కృచ్ఛ్రేషు = సమస్తమైన
ఆపత్సు = ఆపదలందును
కాంతారేషు = దుర్గమారణ్యము లందును
భయేషుచ = భయములుగల్గిన ప్పుడును
కీర్తయన్ = కీర్తించెనేని
నావసీదతి = చెడిపోడు

తా॥ రఘురామ! మానవులకు ఆపదలు వచ్చుట సహజము. అసందర్భమున ఎనలేని భయము గల్గును. ఏమిచేయుటకు తోచదు. ఒకప్పుడు మార్గమున ప్రయాణవశమున దుర్గమారణ్యములందు చిక్కుబడెదము. ఇట్టియన్ని యిబ్బందులలోను ఏమానవుడైనను దీనిని (ఆదిత్యహృదయమును) కీర్తించిన యెడల వాడు సమస్త దుఃఖములు తొలగి సుఖించును.

26

శ్లో॥ పూజయస్వైనమేకాగ్రో। దేవదేవం జగత్పతిం।
ఏతత్త్రిగుణితం జప్త్వా। యుద్ధేషు విజయిష్యసి॥

ప్రతిపదార్థము:-

దేవదేవం = దేవతలకు దేవుడును
జగత్పతిం = జగత్తునకుపాలకుడైన
ఏనం = ఈయాదిత్యుని
ఏకాగ్రః = సావధానుడవై
పూజయస్వ = పూజింపుము
ఏతత్ = ఈయాదిత్య హృదయమును
త్రిగుణితం = మూడుమారులు
జప్త్వా = జపించితివేని
యుద్ధేషు = యుద్ధములందు
విజయిష్యసి = విజయమును సాధింప గలవు

29

తా॥ దేవతలకు ప్రభువై, జగత్తునుపాలించువాడైనయీఆదిత్యుని యేకాగ్ర చిత్తముతో పూజింపుము. ఈస్తోత్రాన్ని మూడు మార్లు జపించి ఏవేని యుద్ధములందు తప్పక జయింప గలవు

27

శ్లో॥ అస్మిన్క్షణే మహాబాహో రావణంత్వంవధిష్యసి।
ఏవముక్త్వాతదాగస్త్యో। జగామచ యధాగతం॥

ప్రతిపదార్థము :-

| | |
|---|---|
| హే మహా బాహో = ఓఆజాను బాహుడవైనరామా: | ఏవం = ఈరీతిగ |
| | ఉక్త్వా = పలికి |
| త్వం = నీవు | తదా = అప్పుడు |
| రావణం = రావణాసురుని | అగస్త్యః = అగస్త్య మహర్షి |
| అస్మిన్ క్షణే = ఈక్షణములోనే | యధాగతం = వచ్చినట్లనే |
| వధిష్యసి = చంప గలవు | జగామచ = వెళ్లెనుగూడ |

తా॥ ఓమహానుబాహుడవైన రామా! ఈక్షణంలోనే నీ చేతిలో రావణ సంహారం జరుగుతుందని అగస్త్య మహర్షి రామునకు బోధిస్తాడు తొలిపలుకుల్లో చేసిన మహాబాహో! అను సంబోధనే మలిపలుకుల్లోకూడ చేసి రాముని బాహువులలో ఉపాస్య దైవమైన యాదిత్యదేవునిపరాక్రమము సంక్రమించిందని తెలిపి యగస్త్య మహర్షి వచ్చిన చోటునకే (గగన మార్గమునే వెళ్లెను)॥

28

శ్లో॥ ఏతచ్ఛ్రుత్వా మహాతేజా। నష్టశోకోఽభవత్తదా।
ధారయామాస సుప్రీతో। రాఘవః ప్రయతాత్మవాన్॥

ప్రతిపదార్థము:-

మహాతేజాః = గొప్పపరాక్రమముగల
రాఘవః = రఘురాముడు
ఏతత్ = ఈఆదిత్యహృదయ స్తోత్రమును
శ్రుత్వా = విని
సుప్రీతః = బాగుగసంతసించినవాడై
ప్రయతాత్మవాన్ = పవిత్రమైన మనస్సుతో
ధారయామాస = ధరించెను
తదా = అప్పుడు
నష్టశోకః = నశించిన శోకముగలవాడుగ
అభవత్ = ఆయెను

తా॥ మహా పరాక్రమశాలియగు రఘురాముడు ఠః యాదిత్య హృదయమును విని శత్రుసంహారమునకు దైవానుగ్రహము గల్గినందులకు బాగుగ సంతసించినవాడై చింతను విడిచి పెట్టెను. పవిత్రమైన యంతఃకరణముతో యీస్తోత్రమును ధారణ చేసెను.

29

శ్లో॥ ఆదిత్యం ప్రేక్ష్యజప్త్వాతు। పరంహర్ష మవాప్తవాన్।
త్రిరాచమ్య శుచిర్భూత్వా। ధనురాదాయవీర్యవాన్॥

ప్రతి పదార్థము :-

త్రిరాచమ్య = మూడుమార్లు ఆచమనము చేసి
శుచిర్భూత్వా = పరిశుద్ధుడై
ఆదిత్యం = ఆదిత్యుని
ప్రేక్ష్య = బాగుగ చూచి
జప్త్వాతు = జపించిన వెంటనే
పరం = గొప్పదైన
హర్షం = సంతోషమును
అవాప్తవాన్ = పొందినవాడయ్యెను
వీర్యవాన్ = పరాక్రమశాలియగు రాముడు
ధనుః = ధనస్సును
ఆదాయ = తీసికొని

31

తా॥ అంత రాముడు మూడుపర్యాయములాచమించి పరిశుద్ధుడై యాదిత్యుని దర్శించుచూ ఈస్తోత్రమును మూడు మార్లు జపించి యంతు లేని సంతసముతో ధనస్సును చేతగొనెను.

30

శ్లో॥ రావణంప్రేక్ష్య హృష్టాత్మా। యుద్ధాయ సముపాగమత్।
సర్వయత్నేన మహతా । వధే తస్య ధృతోఽభవత్॥

ప్రతి పదార్థము :-

హృష్టాత్మా = సంతసించిన రాముడు
రావణం = రావణాసురుని
ప్రేక్ష్య = బాగుగ జూచి
యుద్ధాయ = యుద్ధముకొరకు
సముపాగమత్ = బాగుగ సమీపించెను
మహతా = గొప్పదగు
సర్వయత్నేన = సర్వ విధములైనయత్నముతో
తస్య = ఆరావణునియొక్క
వధే = వధవిషయమున
ధృతః = ధృఢమైననిశ్చయము గలవాడుగ
అభవత్ = అయ్యెను

తా॥ ఈస్తోత్రమును జపించుట వలన సంతోషము గలిగిన రాముడు యుద్ధమునకు సన్నద్ధుడై రావణుని యెదుట నిలచి సర్వ యత్నముతో యతనిని సంహరింప సిద్ధు డయ్యెను.

31

శ్లో॥ అధరవిరవద న్నిరీక్ష్య రామం
ముదితమనాః పరమం ప్రహృష్యమాణః।
నిశిచరపతి సంక్షయం విదిత్వా
సురగణ మధ్య గతో వచస్త్వరేతి॥

ప్రతిపదార్థము :-

అథ = అనంతరమందు
సురగణమధ్యగతః = దేవతల సంఘము మధ్యనున్న
రవిః = సూర్యుడు
ముదితమనాః = సంతసించిన మనస్సుతో గూడినవాడై
నిశిచరపతి సంక్షయం = రాక్షస ప్రభువు యొక్క సంపూర్ణ నాశనమును
విదిత్వా = నిశ్చయమని తెలిసికొని
రామం = రామ ప్రభువును
నిరీక్ష్య = చూచి
పరమం = మిక్కిలి
ప్రహృష్యమాణః = సంతసమును గలిగించుచున్నవాడై
త్వర = త్వరపడుము
ఇతి = అని
వచః = మాటను
అవదత్ = పలికెను

తా॥ అప్పుడు దేవతల మధ్యమున్న రవి, రాక్షస ప్రభువుయొక్క సంపూర్ణనాశనమును నిశ్చయమని తెలిసికొని రామప్రభువును జూచి వారికి మిక్కిలి సంతసమును గల్గించు చున్నవాడై త్వరపడుమని పలికెను

ఓంతత్సదిత్యార్షే శ్రీమద్రామాయణే వాల్మీకియే
చతుర్వింశత్సహస్రికాయాం సంహితాయాం
యుద్ధకాండే సప్తోత్తర శతతమస్సర్గః॥

ఇది ఆదిత్యహృదయము. దీన్ని చదవటానికి నాలుగు నిమిషముల కంటె యెక్కువ పట్టదు. సూర్యుడుదయించేందుకు ఎంతకాలంపడుతుందో సరిగ అంతే సమయంలో ఈస్తోత్రం చదవవచ్చు. ఇలాలెక్కప్రకారం వాల్మీకి మహర్షి వ్రాశారా! అని అనిపిస్తుంది.

ఈ ఆదిత్యహృదయం, ఉదయం, మధ్యాహ్నం, సాయంత్రం మూడుకా
లోచదవవచ్చును నియమనిష్ఠలతో జదువుట మిక్కిలి శ్రేయస్కరం.
డు చదివినా ఉదయించిన సూర్యబింబాన్ని మనస్సులో వుంచుకొవి
ఫలం మంచిది. అర్థం తెలియకుండ చదివినా ఈస్తోత్రం అనిర్వచ
మైన ఆనందాన్నిస్తుంది. మందు తయారుచేయు విధానం రోగికి
దకపోయినను ఔషధసేవ విశ్వాసముతో జేసిన యడల ఆరోగ్యమునే
చినటుల దీనిపారాయణ చేతనే సకల శ్రేయస్సులు లభింపగలవు.
ము తెలుసుకొని చదివినగల్గు ఆనందమును గూర్చి యిక చెప్పన
గలదు?



శ్రీ మహాగణపతయేనమః

శ్రీరామశ్శరణంమమ

# ఆదిత్యహృదయ రహస్య పీఠిక

ఆదిత్యహృదయ పీఠిక వలన శరీరారోగ్యమే మహాభాగ్యమని తెలిసికుంటిమి. ఇప్పుడు మనం ఆదిత్యహృదయ రహస్య పీఠికలో శరీరం వలన పొందవలసిన మహోన్నత స్థితిని గూర్చితెలిసి కుందము. మానవాది శరీరములకు శరీరము, దేహము అనుపేర్లు లోకవాడుకలో నున్నవి. జీర్ణమయ్యే స్వభావం దీనిలో నున్నందున దీనిని శరీరమనిరి. అమృత భాండంలో పుంచినా యిది జీర్ణంకాక తప్పదు కావుననే "జాతస్యహిధ్రువోమృత్యుః" అని గీతలో పరమాత్మస్పష్టంగా తెల్పిరి. దీనికి లోకంలో దేహమను పేరు వాడుకలో నున్నది గదా! అదెటుల వచ్చిన దనగా దహింప బడేది కావున దేహమనిరి. ఎప్పుడో మరణానంతరం కాల్చబడడంగాదు. మనం జీవించి యుండగానే యిది తాపత్రియాగ్నిచే దహింపబడేదని కూడ భావము.

ఇటువంటి స్వభావముగల యీశరీర సహాయంతో నిజమైన లాభం పొంద వలసిందిగా శ్రీకృష్ణపరమాత్మ తన భక్తుడైన యుద్ధవునితో

శ్లో॥ ఏషాబుద్ధిమతాంబుద్ధిః, సామనీషామనీషిణాం।
యత్సత్య మనృతేనేహ। మర్త్యేనాప్నోతిమాఽమృతం॥

(భాగ॥ ఏకాదశ స్కం 29 అ. 22 శ్లో)

తా॥ భక్తశిరోమణీ! అసత్యము మరణశీలమునగు మానవ దేహముతో సత్యస్వరూపుడను అమృతస్వరూపుడను అయిన నన్ను ఈ జన్మలోనే పొంద గల్గుటే వివేకము, చాతుర్యము అగునని సెలవిచ్చిరి.

మానవ శరీరము అసత్యము మరణ శీలము గలది. అయినప్పటికి వైదిక వాఙ్మయంలో ఈశరీరానికి గల "అయోధ్యా- బ్రహ్మపురము- బ్రహ్మ "అనునామములనుబట్టి యిది పరమాత్మను బొందింపగల స్వభావము గూడ గలదని తెలియుచున్నది.

అష్టాచక్రానవద్వారా। దేవానాంపూరయోధ్యా।

తా॥ త్వగాద్యష్టధాతు రూపములగు అష్టచక్రములతో ఇంద్రియాది నవద్వారములతోను అయోధ్య అనిసార్థక నామమున బరగుచు దేవతా నిలయమగు నీశరీరమనెడి పురమొప్పుచుండును.

తస్యాగ్ంహిరణ్మయః కోశః, స్వర్గోలోకోజ్యోతిషావృతః।
యోవైతాంబ్రహ్మణోవేద। అమృతేనావృతాంపురీం।
తస్మై బ్రహ్మచబ్రహ్మాచ। ఆయుఃకీర్తింప్రజాందదుః॥

తా॥ ఈపురిమున జ్యోతిర్మయమైనకోశము స్వర్గలోకము- అయ్యది జీవచైతన్య రూపమగు జ్యోతిస్సుచేనావృతమై యుండును కావున నీపురిని సత్యజ్ఞానానందలక్షణమగు బ్రహ్మకు సంబంధించినదనియు అమృతముతో (పరమానందముతో) నావృతమైనదనియు నెవడు తెలుసుకొనునో ఆట్టివిద్వాంసునకు బ్రహ్మయు (పరమాత్మయు) ప్రజాపతియు ఆయుస్సును కీర్తిని, సంతానమును ఇచ్చెదరు. ఉపనిషత్తులచే చెప్పబడే బ్రహ్మయే కొలది భేదంతో త్రైలోక్య శరీరియగు విరాట్టగును. ఈవిరాట్స్వరూపము బ్రహ్మశబ్దముచే తెలుపబడినట్లే స్థూల, సూక్ష్మ, కారణ రూపమున నొప్పుచు బ్రహ్మకర్మ సాధనమగు మానవశరీరముగూడ బ్రహ్మ అని చెప్పబడును. విరాట్పురుషుని త్రైలోక్య శరీరమెట్లు అగ్ని. ఇంద్రుడు మొదలగు దేవతలకు నిలయమో, అట్లే ప్రతి శరీరము దేవతానిలయము.

శ్లో॥ దేహోదేవాలయఃప్రోక్తః। జీవోదేవస్సనాతనః॥
అని మహాన్యాసంలో చెప్పబడింది।

కాశీ, గయా, ప్రయాగ, శ్రీకాళహస్తి, శ్రీశైలము, తిరుప
కురుక్షేత్రము మొదలైన పుణ్యస్థలాలను క్షేత్రములంటారు. భగవ
భూతి నెలకొన్న పుణ్యస్థలాలను క్షేత్రమనడంగలదు. అటులనే భగవం
డుగూడ మన మానవశరీరాన్ని క్షేత్రంగా పేర్కొన్నారు.

శ్లో॥ ఇదంశరీరం కౌంతేయ। క్షేత్రమిత్యభిధీయతే।
ఏతద్యోవేత్తి తంప్రాహుః। క్షేత్రజ్ఞ ఇతి తద్విదః॥
(గీత 13 అ 2 శ్లో)

తా॥ కుంతీకుమారా ! ఈశరీరము క్షేత్రమనిచెప్పబడును. ఈ
క్షేత్రముతనదిగా తెలిసికునేవానిని క్షేత్రజ్ఞుడని యావిషయమునెఱిగి
పెద్దలందురు. (క్షేత్రమనగా) క్షతత్రాణాత్, క్షయాత్, క్షరణాత్, క్షే
వద్వా అస్మిన్ కర్మఫలనిష్పత్తేఃక్షేత్రం॥ అని శంకర భగవత్పాదులవా
తమ గీతాభాష్యంలో సెలవిచ్చారు.

1 కవచంవలె జీవునికాపాడుతుందిగావున క్షేత్రమని యర్థమ
2 నశించే స్వభావం గలదనియొకఅర్థం 3 జీర్ణమైపోయ్యేద
యొక అర్థం 4 పొలమనియొక అర్థము. ఈ శరీరము క్షేత్రము, ఈ
క్షేత్రపాలకులైనజీవులము పొలంలోయేవిత్తనాలు వేస్తామో అవంటనుకో
కుంటాము. ఈక్షేత్రంలో పుణ్యబీజాలు చల్లుకొని సుఖంపొందించుకోవచ్చు
పాప బీజాలను వేసికొని దుఃఖమును పొందవచ్చును. ఈ రెండూగాక
జ్ఞాన బీజాలను చల్లుకొని మోక్షఫలాన్ని పొందవచ్చును. ఋతుభేదం తో
నిమిత్తంలేదు. రాత్రింబవళ్లనక యీపొలంలో కృషిచేసిపైరుపండించుకో
వచ్చు. అదివాని పురుషార్థముపైనాధారపడి యుంటుంది. మన పొలంలో

పండించేపంట ఈలోకంలోవున్నంతవరకు అనుభవింప వచ్చును. పరలోకానికి వెళ్లవలసినప్పుడు యిక్కడవిడిచిపెట్టవలసిందే. శరీరమను పొలంలో పండించిన పంట "సుకృతం దుష్కృతం చైవగచ్ఛన్తమను గచ్ఛతి" పుణ్య పాపములను పంట మనసూక్ష్మశరీరముతో గూడ మన వెంట వచ్చును ఈశరీరమను క్షేత్రములో జ్ఞాన బీజాలు చల్లుకొని ముక్తికాంతను వరింతము. ఈముక్తిదాత ఆదిత్యభగవానుడే.

శ్లో॥ కింకింనసవితా సూతే। కాలే సమ్యగుపాసితః।
ఆయురారోగ్యమైశ్వర్యం। వసూనిసపశూంస్తథా॥

శ్లో॥ మిత్రపుత్రకళత్రాణి। క్షేత్రాణివివిధానిచ।
భోగానష్టవిధాంశ్చాపి। స్వర్గంచాప్యపవర్గకం॥
(స్కంద. పు. కాశీఖండం 47-48 శ్లో)

తా॥ భక్తచింతామణియగు భానుమూర్తి సకాలంలో బాగుగ నుపాసింపబడిన వారగుచు యివ్వలేని కోరిక లేదు. వారు ఆయుస్సు, ఆరోగ్యము, ఐశ్వర్యము, ధనము, పశువులు, మిత్రులు పుత్రులు, భార్య, క్షేత్రములు, అష్టైశ్వర్యములు, స్వర్గము, మోక్షము. అన్నింటిని యిచ్చెదరు. అనియున్నందున యీఆదిత్యహృదయ రహస్యమును గూడ పరిశీలింతము.

శ్రీ మహాగణపతయేనమః॥

1

శ్లో॥ తతోయుద్ధపరిశ్రాన్తం। సమరేచింతయాస్థితం।
రావణం చాగ్రతో దృష్ట్వా। యుద్ధాయసముపస్థితం

2

శ్లో॥ దైవతైశ్చసమాగమ్య। ద్రష్టుమభ్యాగతోరణం।
ఉపాగమ్యాబ్రవీద్రామం। మగస్త్యో భగవాన్ ఋషి

ఆదిత్యహృదయంలోని ఒకటి, రెండు శ్లోకాలు, ఈ సందర్భాన్ని వివరిస్తాయి.

ఆసందర్భమిది -

రామాయణ కథానాయకుడైన శ్రీరాముడు, సూర్యవంశ అవతరించినాడు ఆయన తండ్రిగారి యాజ్ఞచొప్పున భార్యయగు జ తమ్ముడైన లక్ష్మణులతో గలసి, దండకారణ్యమునకు జని, పర్ణశా నుండెను. శూర్పణఖ వలన సీతాదేవియొక్క రూపలావణ్యములను రావణుడు కామాతురుడై రామలక్ష్మణులాశ్రమంలో లేని సమయ ప్రవేశించి యాలోకమాతను అపహరించి తెచ్చి లంకలో దాచి రాము బద్ధవైరము పెచ్చుకొనెను.

రాముడు సీతాదేవిని తనకు సమర్పింప వలసినదని బారమంపెను అతిమూర్ఖుడైన రావణుడందులకు సమ్మతింపలేదు. అ సర్వప్రాణికంటకుడైన రావణుని సంహరించుటకు రాముడు ప్రహరణాయుధములతో సమరం సాగించాడు. ఘోరతపస్సుగా పరమేశ్వరానుగ్రహ పాత్రుడైన రావణుని సంహరించుట, రామ శ్రమతో గూడిన సమస్యగాసిద్ధమైంది. రణరంగంలో అలసినా

రావణుడాసుర ధైర్యంతో పోరాడు చున్నాడు, రాముడు తనదివ్యత్వమును బ్రికటించకుండా మానవుడుగానేయుండి, రావణవధ చేయుటెటులనా యని చింతించుచుండెను.

ఆ రామ – రావణ యుద్ధమును జూడ వచ్చిన సురాసురులు ధర్మాధర్మములను ప్రేమించు చుండిరి అసురులు దశగ్రీవునిజయింపు మను చుండ, దేవతలు రఘువీరునితో "రామ! నీవు జయింపుమని పలు మారు పలుకు చుండిరి.

ఆదేవతల వెంట సమరమును జూడవచ్చిన విద్యామండలఋషి యగు అగస్త్యమహర్షి, చింతలోమునిగియున్న రఘువీరుని వాలకమును దిలకించి, యేకాంతంగా సమీపించి రామ! చింతింపనేల? మీకుల దైవము, ప్రత్యక్షదైవము, అగు ఆదిత్యునియారాధింపుము. నీకిప్పుడే శత్రుజయము లభింపగలదని చెప్పెను.

మహాభారతంలో భగవంతుడు అర్జునుని నిమిత్తంగా జేసికొని గీతామృతమును లోకమునకు ప్రసాదించినట్లే రామాయణంలో అగస్త్య మహర్షి రఘురాముని నిమిత్తంగా జేసికొని యీస్తోత్రాన్ని లోకమున కనుగ్రహించాడు.

ఆభగవద్గీత, ఈఆదిత్యహృదయము రెండూ రణరంగంలోనే వెలువడుట వలన యీరెంటికి తాత్విక సామ్యమున్నదని తోచుచున్నది. ఆగీతామృతమును లీలామానుష విగ్రహుడైన శ్రీకృష్ణపరమాత్మ నరావతారుడైన యర్జునునకు ఉపదేశించినాడు. ఈఆదిత్యహృదయమును మాయామానుషవిగ్రహుడై "ఆత్మానంమానుషంమన్యే" "రామందశరథాత్మజం"అని తననుగురించితానే మానవుడనని ప్రకటించుకున్న మర్యాదా పురుషోత్తముడైన రామునకు విద్యామండల ఋషియగు అగస్త్య మహర్షి ఆచార్య మూర్తియై యుపదేశించిరి.

వాల్మీకి రామాయణం ఒక మహాస్తోత్రము. అందలి యొక్కొక్క అక్షరము మహాపాతకములను నశింపజేస్తుంది.

ఇలాంటి మంత్రశక్తితో, గాయత్రీబీజసంపుటితో రచింపబడిన రామాయణంలో స్థానమును సంపాదించుకున్న యీస్తోత్రమహిమ వాచామగోచరము.

మూడవశ్లోకం అగస్త్యమహర్షి రాముని సంబోధించడంతో ఆరంభంఅవుతుంది.

3

శ్లో॥ రామ! రామ। మహాబాహో। శృణుగుహ్యంసనాతనం।
యేన సర్వానరీన్ వత్స। సమరే విజయిష్యసి॥

వివరణ —

అగస్త్యమహర్షి ఆజాను బాహుడైన రామచంద్రమూర్తిని వత్స। అనివాత్సల్యమును ప్రకటింపుచు రామ।రామ। అని ముద్దుగ ఒకటికి రెండు మార్లు పిలచి "మహాబాహో। అని సంబోధించాడు.

రణరంగంలో రావణసంహారంకోసం తనపరాక్రమమును సార్ధకం చేయుచున్నరఘువీరుని "మహాబాహో" అని సంబోధించుట సమయోచితముగా నున్నది. అంతకంటెను రామ। రామ। అనుచు రెండు మారులు పిలచుట భావపూర్ణము. ఎటులనగా

రఘురామ। నీవు బాల్యమందే శివధనుర్భంగముగావించి వీర రాఘువుడవని లోకంలో కీర్తివిగాంచితివి. ఆవిషయమును వినిన భార్గవరాముడు (ఈర్ష్యతో) ఔర। నేను భూమండల మందుగల

దుష్టక్షత్రియులను ఇరువదొక్కమారు సంహరించినవాడను. నేడొకక్షత్రియ బాలుడు మాగురువుగారి ధనస్సును భంగముగావించెనా। అతని వీర్యమెంతటిదోపరీక్షించెదగాక। అని తాను వైష్ణవధనస్సును రామునకందించి, యిటులపలికెను. రామ। ఈధనస్సు నెక్కుపెట్టుము. అప్పుడు నీపరాక్రమమును జూచి నీతో ద్వంద్వ యుద్ధము చేయగలనని సగర్వంగా బలికెను.

అంతట నీవు పరశురాముని చేతగల ధనస్సును బాణమును వాటితో గూడు వారియందుగల స్వీయవైష్ణవీశక్తిని గూడ గ్రహించిన సమర్థుడవనచు దెలిపి, యాపరశురాముని పరాక్రమంగూడ, నీలోసంక్రమించిన దనుచు దెల్పి మహర్షి రాముని యుత్తేజితుని గావించినాడు.

1 "మహాబాహో। అని సంబోధించి, రాముని బాహువులందున్న మహత్వము ఇప్పుడుశత్రువధకు తోడ్పడగలదని స్మరింప జేయుచున్నాడు.

2 హనుమంతుడు పంపానదీతీరమున రామ-లక్ష్మణులను దర్శించి వారి రూపురేఖలను ప్రశంసించు సందర్భమున

శ్లో॥ ఆయతాశ్చసువృత్తాశ్చ। బాహవః పరిఘోపమాః॥

ఓరాజకుమారులారా। దీర్ఘములు గుండ్రములైన మీబాహువులు శత్రువులజంపగల పరిఘమను ఆయుధమువలె నున్నవనిరి.

3 దుర్జయుడైన శత్రువును సంహరింప వలసినప్పుడు ఈవిధంగా సంబోధించుట పరిపాటి। గీతలో శ్రీకృష్ణుడు అర్జునని గూడ "జహిశత్రుం మహాబాహో: కామరూపందురాసదం" "ఓమహాబాహో దుర్జయుడగు కాముడను శత్రువును సంహరింపుము అని సంబోధించి యుండెను.

4 రామః నీవు, శత్రువగు రావణునకు ఇరువది బాహువులు, ఉన్నవని చింతింతువా? వలదు. నీరెండు బాహువులలో గల మహత్వము వానికి లేదు. అని ధైర్యము చెప్పెను.

5 రామ। నీభుజములందు సహజమహత్వముండనే యున్నది "మహా ఇత్యాదిత్యః" అనుశ్రుతిని బట్టి మహః అనగా ఆదిత్యుడు గదా। నేను ప్రకృతము ఉపదేశించే ఆదిత్యహృదయమును ధరించుట వలన వాని మహత్వ మినుమడింపగలదు. అని భావము.

6 "మహ ఇతిబ్రహ్మ" అనుశ్రుతి వలన వస్తుతః నీవు బ్రహ్మవే కాన నీయందు గల మహత్వమును స్మరింప జేయుచున్నాను అని భావము.

ఈ సంబోధనతోనే ఆదిత్యహృదయంలోని మంత్రశక్తి ప్రసారం ఆరంభం అవుతుంది ఇటుల సంబోధించి పరమ రహస్యము సనాతనమైన పరమార్థమును నీకనుగ్రహించు చున్నానని అగస్త్యమహర్షి పలుకుతారు.

4

శ్లో॥ ఆదిత్యహృదయం పుణ్యం। సర్వశత్రు వినాశనం।
జయావహం జపేన్నిత్య। మక్షయం పరమం శివం॥

5

శ్లో॥ సర్వమంగళ మాంగళ్యం। సర్వపాప ప్రణాశనం।
చింతా శోక ప్రశమనం। ఆయుర్వర్ధన ముత్తమం॥

అగస్త్యమహర్షి రామునకును తదనంతరము సాక్షులైన మనకును, నాలుగైదు శ్లోకములతో ఈస్తుతి యందు భక్తి శ్రద్ధలు వృద్ధి నందించు చున్నారు.

వివరణ–:

ఈ ఆదిత్యహృదయము పరమపావనము! ఈస్తోత్రం మన లోపల వుండే కామ–క్రోధాదులగు అంతశ్శత్రువులను, వెలుపల అపకారులైన శత్రువులను, మరియు మనచేత ద్వేషింపబడేవారును, మనలను ద్వేషించు వారును అగు సర్వశత్రువులను పూర్తిగ నశింప జేయును శుభంగలుగు తుంది. లభించిన జయము కూడిన శుభము కలకాలం నిలబడతాయి! శత్రు జయంలభించినను ఒకప్పుడు లాభనష్టాలు సమంగానున్నటుల జయము లభింపక పోవచ్చును. ఈస్తోత్ర పారమటుల గాక తప్పక జయమును గలుగ జేయును.

ఈమహామంత్రము సకల పాపాలను పూర్తిగ దొలగించును. చింత – శోకములను పొలగించును (చింత అనగా రాబోవు అనర్ధమును తలంచుకొని కలత చెందుట. శోకమనగా ఇష్టమైనవస్తువు. నష్టమైనప్పుడు గలిగెడీమానసిదుఃఖము) ఈ రెండు విధములైన దుఃఖములను బూర్తిగ తొలగించును.

ఇది విహితాయుస్సున కంటెను అధికాయుస్సును ఇచ్చునదియు జపింప దగిన వానిలో ఉత్తమ మైనదిగావున, దీనికి మించిన స్తోత్ర మేలేదు.

## స్తోత్రప్రాశస్త్యము

ఈస్తోత్రము వాల్మీకి రామాయణం యుద్ధకాండలో నూట యేడవ సర్గ. ఇందులో మొత్తం ముప్పదియొక్క శ్లోకములున్నవి. వీనిలో సర్గ సమాప్తిని సూచించే చివరి శ్లోకాన్ని శాంతి పాఠంగా భావిస్తే ముప్పై శ్లోకాలు మిగులుతాయి. వీనిలో మొదటి తొమ్మిది శ్లోకాలు ఈస్తోత్రానికి పూర్వరంగాన్ని సమకూర్చుతాయి.

చివరి తొమ్మిది ఈ స్తోత్రప్రాశస్త్యం, ఫలశ్రుతి మొదః
వాటితో ముగింపును సూచిస్తాయి.

మధ్యగల పన్నెండు శ్లోకాలు ద్వాదశాదిత్యులకు ప్రాతినిః వహిస్తాయి. సరిగాయీస్తుతికి మధ్యభాగంలో "ద్వాదశాత్మన్నమోఽస్తు" అను నమోవాకం విన వస్తుంది. ఒక విధంగా యీనమోవాకం ఆదిత్యహృ యానికి సంధిస్థలంగా కనిపిస్తుంది.

ఈ పన్నెండు శ్లోకాలకు పూర్వభాగంలో భాస్కరుని ప్రభావ వాలను ప్రకటించే దివ్యనామ సంకీర్తన వినవస్తుంది. ఉత్తరభాగః నమోవాకపురస్సరంగా ఆరాధ్య దేవత కంఠలిః బించుట కాన వస్తుంః

కాబట్టి మొదటి యారుశ్లోకాలు నుతికి జెందినవని భావింపవచ్చు ఈశ్వరారాధనలో నమక -చమకాలవలె ఆదిత్యహృదయంలోనియీరె భాగాలు అందులోని శబ్దాలకు శ్రుతిగౌరవాన్ని సమకూర్చుతాయి.

ఈవిధంగా ఆదిత్యహృదయంలోని మంత్రభాగం యీసర్గమః స్తోత్రహృదయంలో సంపుటీకరింపబడింది. ప్రతిస్తోత్రానికీ అనుష కంగావుండే అంగన్యాస-కరన్యాసాలు గూడ యీమంత్రభాగానికి ముందు ఆరవశ్లోకంలో చేర్చబడినందున యీస్తోత్రము సర్వాంగ సంపూర్ణమ

ఈస్తోత్రము - "తతోయుద్ధపరిశ్రాంతం" అని ప్రారంభ వుతుంది. ఇందులోని మొదటిపదం, సుందరకాండలోని "తతోరావ నీతాయాః" అను వాక్యంలో తతః అను, మొదటిపదం ఒకటిగావః గమనింపదగిన విషయము. సుందరకాండలో ఆదర్శ విద్యార్థియగు అః నానందమని గురుదేవతాభక్తి, సామర్థ్యము, బుద్ధివైభవము, మహిమ వర్ణింప బడితే, ఈస్తోత్రంలో ఆచార్యమూర్తియగు ఆదిత్యదేవుని ప్రభా

వైభవాలు, లోకోపకార శీలతలు వ్యాఖ్యానింపబడ్డాయి. "తత్త్వమసి" "యత్తత్పదం" "తత్పదలక్ష్యార్థా" అను మంత్రములలో కీర్తింపబడిన తత్వార్థమే యీ"తతః" అనేశబ్దంలో స్ఫురిస్తుంది.

## ఆదిత్యహృదయము - నామౌచిత్యము

మహర్షి యీస్తోత్రానికి ఆదిత్యహృదయమని నామకరణము గావించెను. ఈనామములో ఆదిత్య-హృదయము, అని రెండు పదములున్నవి

ఆదిత్యుడంటే సూర్యుడు. సంస్కృత సాహిత్యంలోసూర్యభగవానునకు పర్యాయపదములు విశేషంగావున్నాయి. అవన్నియు ఆదేవతయొక్క విభిన్న గుణములను తెలియ చేయుచున్నవి. అమరకోశమందు వీరికి ముప్పదేడు నామములున్నవి. అవి యకారాది క్రమమున వ్రాయబడుచున్నవి.

అరుణ-అర్క-అర్యమా-అహర్పతి.-అహస్కర-ఆదిత్య-ఉష్ణరశ్మి-గ్రహపతి - చిత్రభాను - తపన - తరణి - త్విషాంపతి - దివాకర - ద్యుమణి-ద్వాదశాత్మా -ప్రభాకర - పూషా - భాను -భాస్కర-భాస్వాన్ - మార్తాండ - మిత్ర - మిహిర - రవి - బ్రధ్న - వికర్తన - విభాకర-విభావసు - విరోచన - వివస్వాన్ - సప్తాశ్వ - సూర - సూర్య - సవితా - సహస్రాంశు - హంస - హరిదశ్వ. అనునవి ॥

పైనామములలో ఈస్తోత్రకర్తయగు ఆదికవికి "ఆదిత్య" అను నామము, రామాయణంలో అయిదవకాండకు "సుందర" అను నామము వలెనే బాగానచ్చింది.

1 సూర్యమహిమను దెలుపు శ్రుతులయందు – "ఆదిత్యోవా
"ఆదిత్యోవై తేజః" ఘృణిస్సూర్య ఆదిత్యః" "అసావాదిత్యోబ్రహ్మ"
పరిస్ఫుటంగా ఆదిత్యనామ మేవినవచ్చుచున్నందున, వీరికి "ఆ
నామము సార్థకము.

2 విష్ణుసహస్రనామంలో ఆదిత్యుడు జ్యోతిరాదిత్యుడై భాసిస్తా
3 వేదమాతయగు గాయత్రిదేవి ఆదిత్య మండలమే స్థానంగా
యున్నదవి

శ్లో॥ ఆదిత్యమండలసానా। పరబ్రహ్మస్వరూపిణి॥
ఛందో మయీచగాయత్రీ। మాంరక్షతుసనాతనీ॥
అనిదేవీభాగవతం చెబుతుంది.

4 ఈచిన్నస్తోత్రంలో "ఆదిత్య, నామము ఆరుపర్యాయములావృ
నందున ఆదిత్యనామము సార్థకము
5 హనుమంతుడు రామవర్ణనగూడ "ఆదిత్యఇవతేజస్వీ" అనియార
చెను ఇంత వరకు "ఆదిత్య" నామములకు గలవిశిష్టతను దెలిసి కొం
ఇక హృదయ మవగానేమో పరిశీలింతము

1 హృదయం హృత్ + అయం = హృదయం అనగా పుత
"పుత్రోహి హృదయం" అనుశ్రుతి హృదయమనగా పుత్రుడని తెలిపి
మరొకచోట "దివస్పుత్రాయ సూర్యాయశగ్ంసత" అని సూర్యు
శానికి పుత్రుడని తెల్పిందిగాన సూర్యుని దెలుపు యీభాగం హృద
అయినది.

2 "హృత్" అను పదము సృష్టిస్థితిలయములకు ఉపలక్షణము. ఈమ
కార్యములు నిర్వర్తించే, త్రిమూర్తులు బ్రహ్మ విష్ణు మహేశ్వర

ఈముగ్గురు సూర్యుడేనని "ఏషబ్రహ్మాచ విష్ణుశ్చశివః" అనియీస్తుతిలో వే తెల్పబడుటచే నిదిహృదయము.

3 హృదయమనగా పూజింప వలసిన దేవతను సర్వాంతర్యామిగను, సర్వాధ్యక్షుడుగను, భావన జేయుట:

"అధయఏషోంతరాదిత్యే హిరణ్మయఃపురుషోదృశ్యతే" ఆదిత్యు నియందు హిరణ్మయ పురుషుడున్నటుల యీశ్రుతి పేర్కొనుటచే సర్వాంతర్యామియనియు

"యోఅస్యాధ్యక్షః పరమేవ్యోమన్" ఈజగత్తునకు సర్వాధ్యక్షుడైన పరమాత్మహృదయాకాశంలో వున్నటుల వర్ణింపబడినందునను నిదిహృద యమైనది.

ఇప్పుడు ఆదిత్య+ హృదయము= ఆదిత్యహృదయము.

1 ఈస్తుతి ఆదిత్యమనః ప్రసాదకమైనందున ఆదిత్యహృదయము.

2 ఆదిత్యహృదయావగాహనమైతే అనంతజ్ఞానంగల్గినట్లే "వేదాహ మేతం పురుషంమహాన్తం। ఆదిత్యవర్ణం తమసస్తుపారే।

3 ఈస్తుతి "తతోయుద్ధపరిశ్రాంతం" అని ప్రారంభింపబడినది. కాని యీస్తోత్రహృదయముమాత్రము "ఆదిత్యస్సవితాసూర్యః" అనుపదియవ శ్లోకంనుండి యారంభమగునుగాన నిది ఆదిత్యహృదయ మని ప్రసిద్ధి నందినది.

ఇంత వరకు ఈస్తోత్రమునకు గల ఆదిత్యహృదయ నామౌచిత్య మును దెలిసికొంటిమి.

శ్లో॥ అమిత్ర దహనంపార్థ। సంగ్రామేజయవర్ధనం।
వర్ధనం ధన పుత్రాణాం। ఆదిత్యహృదయంశృణు॥

అని భవిష్యోత్తర పురాణంలో మరొక ఆదిత్యహృదయ గూడకలదు.

ఇంతటి యమోఘమైన ఆదిత్యోపాసనా సర్వస్వమనదగిన యీస్తు పుణ్యశ్లోకుడైన వాల్మీకిమహర్షి సముద్రమును చిన్నపాత్రలో యిమి నటుల యింత చిన్నస్తోత్రంలోయిమిడ్చి భారతీయుల మగు మనక దించుట మనమహాభాగ్యము. అటువంటి ప్రాతఃస్మరణీయుడైన మహ కృతజ్ఞతతో అనంతానంత నమస్కారములు తెలు కొను చున్నాము.

## విశేషవ్యాఖ్య

4 శ్లో॥ "సర్వశత్రువినాశనం। జయావహం" సర్వశత్రునాశనమ గావించి జయమును గల్గించునది కావున యీలోకసుఖమును బ్రసాదిం చుటయు, "పుణ్యం" అనుటచే పరలోక సుఖమును గల్గించుటయు "అక్షయం పరమంశివం" అనుటచే నాశరహితమైన మంగళము మోక్ష మేగావున, నిష్కామ భక్తులకు మోక్షమును ప్రసాదించుట తెల్పబడినది

"జయావహం జపేన్నిత్యం" అనుటచే దీనిని నిత్యము జపించ వలయుననిరి. ఈజపము వాచికము, ఉపాంశవు, మానసికమునని మూడు విధాలు.

భగవంతుని యొకేనామ మంత్రాన్ని అఖండంగా అనేకావృత్తులు చెప్పడం స్తోత్రపాఠాలు చెప్పడం వాచికజపం. పెదవులనుమాత్రంకదిలిస్తూ జపంచేయటం ఉపాంశు జపం. దేహేంద్రియాలను వేనినీ చలింపజేయక మనస్సునందే జపించుట మానసికజపం అని అంటారు. "యజ్ఞానాంజపయ జ్ఞోస్మి" అని జపమే నేనని భగవంతుడన్నాడు. ఇదిసాత్వికమూ, స్వతంత్రమూ కాబట్టి భగవంతుడు పైరీతిగచెప్పినాడు.

5 శ్లో॥ సమస్తపాపాలను బూర్తిగ నశింపజేసి సమస్తమంగళములను ప్రసాదించుటేగాక చింతాశోకములను బోనడచి విహితమైనఆయుస్సు కంటె అధికాయుస్సు నిచ్చుటచే జపింపదగినవానిలో ఉత్తమమని చెప్పబడినది.

మనకవికోకిల వసంతసమయంలో రామాయణమను కల్పవృక్షము పైగూర్చుండి, ఆదిత్యోపాసనాసర్వస్వమనదగిన యీఆదిత్యహృదయాన్ని పంచమస్వరముతో మధురాతి మధురంగా ఆలపించి, ప్రపంచాన్ని మంత్రముగ్ధము గావించెను.

ఇంతటి మహత్వముగల ఆదిత్యహృదయమును, ఆదికవి ముప్పది యొక్క శ్లోకములలో నిముడ్చుట జూడ మహాసముద్రమును దెచ్చి చిట్టిపిడతలో నింపినాడా! అనిపిస్తుంది.

ఇంతటి ప్రతిభాశాలియు, పరమోపకారియు, పరమ తపస్వియగు ఈకవికోకిలకు మాఅనంతానంత నమస్కారములు.

6

శ్లో॥ రశ్మిమంతం సముద్యన్తం। దేవాసుర నమస్కృతం।
పూజయస్వ వివస్వంతం। భాస్కరం భువనేశ్వరం॥

వివరణ:-

రామ! జపింపదగిన ఆదిత్యస్వరూపమునుగురించి తొలుత సావధానంగా విని పూజింపుమనుచు అగస్త్యమహర్షి తెలుపుచున్నారు

ఈభానుమూర్తి బంగారమువలె తళతళలాడే ప్రశస్తకిరణములతో బాగుగ నుదయించి ఎండ, వానలతో సమస్తలోకాలను నియమిస్తారు. వీరుజ్యోతిస్సులగు సూర్యుడు, చంద్రుడు, అగ్నిమొదలగు వారికి గూడ తేజస్సును ప్రసాదించేవారు కావున వీరిని సాత్వికులైన దేవతలు,

మహర్షులు, రాజసులు, తామసులైన అసురులు, అంజలిఘటించి అర్ఘ్యమునిచ్చి నమస్కారప్రియుడైన భానుమూర్తిని భక్తితో నమస్కరింతురు. కావున ప్రత్యక్షదైవమగు వీరిని, నీవును పూజింప వలసినదని యగస్త్యమహర్షి యాదేశించారు.

ఈయాదేశవాక్యం పైఅరవ శ్లోకంలో ఆరువిభాగాలైంది "పూజయస్వ" అనే ఆదేశవాక్యానికి - రశ్మిమంతం, సముద్యన్తం, దేవాసుర నమస్కృతం, వివస్వంతం భాస్కరం, భువనేశ్వరం" అనే ఆరుపదాలు అంగన్యాస కరన్యాసాలతో షణ్ముఖసంపత్తిని సూచించుచున్నవి. ఆదిత్య హృదయమనే మంత్రానికిది, న్యాసభాగము. ఇదేధ్యానశ్లోకంగూడ.

ఈస్తోత్రమెప్పుడైనను చదవవచ్చు. సూర్యస్తుతిగాబట్టి వారు ప్రకాశించేకాలం మిక్కిలి యనుకూలంగా వుంటుంది.

అగస్త్యమహర్షి అపరాహ్ణకాలంలో వచ్చి యీస్తోత్రాన్ని అనుగ్రహించారు. అయినప్పటికి ప్రాతః కాలంలో ఉదయభాస్కరునే ధ్యానింప వలయును. వివరణపూర్తి.

## గూఢార్థదీపిక

1 రశ్మిమంతం= ప్రశస్తమయిన కిరణములు గలవానిని

2 పరమాంతరంగులైన భక్తులమధ్య ప్రకాశించువారు "రశ్మిగ్ంరశ్మీనాం మధ్యేతపంతం" అనుశ్రుతి యిందుకుప్రమాణము

3 చర్మము, చెవి, ముక్కు, కన్ను, నాలుక, అను అయిదుజ్ఞానేంద్రియముల ద్వారా జ్ఞానరశ్మలను ప్రసరింపజేయువారు గావున వీరు రశ్మిమంతులైరి.

సముద్యన్తం = ప్రాతఃకాలంలో ఉదయపర్వతముపై బాగుగ నుదయించుచున్నవారు. వీరు ఉదయించుట వలన అంత వరకు జగత్తును వ్యాపించిన గాఢాంధకారము తొలగి సర్వప్రాణులు తమ తమ పనులలో ప్రవర్తించుటకు తగిన సమయంవచ్చినందున ఆభగవంతుని దర్శించి ప్రజలందరు ఆనందిస్తారని, శ్రుతి— ఉద్యన్తంవాఏతగ్ం సర్వాః ప్రజాః ప్రతినందంతి॥ అనిపలికింది.

ఈయుదయించే సూర్యుని స్వరూపము ఎంతోచిత్రంగావుందని ఋగ్వేదంలోను, యజుర్వేదంలోను – చిత్రందేవానాముదగాదనీకం" అనుమంత్రం వర్ణించింది.

ఓభానుదేవా! తమయందు రక్తశ్వేతాది వివిధవర్ణములు నిగూఢంగా గలిగి, దీప్తిమంతములై లోకముల ప్రకాశింప జేయు కిరణజాలము మహాసైన్యమువలె చిత్రముగా నుదయించినది. ఇంతవరకు సముద్యన్తం॥ అనుపదమును గూర్చి తెలిసికుంటిమి.

"దేవాసురనమస్కృతం" ఈయాదిత్యుడు దేవతలకు శ్రేయస్సును (మోక్షమును) అసురులకు ప్రేయస్సును (ఇహపర సుఖమును) ఇచ్చువారైనందున వీరిని దేవాసురులు నమస్కరింతురు. వేదమాత మానవులందరు తరించుటకై అధికారి భేదాన్నిదృష్టియందుంచుకొని కర్మ భక్తి జ్ఞానములని, మూడువిభాగాలను ఉపదేశించినది. వీనిలో కర్మను భక్తిని దెలుపుభాగానికి పూర్వకాండ అని పేరు. జ్ఞానమును దెలుపు భాగానికి ఉత్తరకాండ అనిపేరు. పూర్వకాండలో చెప్పబడిన ధర్మజ్ఞానము పుష్పము ఇది అవాంతరఫలమును దెలుపునది. పుష్పితవాక్కు. ఉత్తర కాండలో చెప్పబడిన బ్రహ్మజ్ఞానము ఫలము.

ఇది పరమ ఫలమైన మోక్షమును దెలుపునది గాన ఫలితవాక్కు. సూర్యుడు దేవతలకు శ్రేయస్సునిచ్చున దెటులనగా "సంజ్ఞా," అనునామె

శ్రేయస్సునిచ్చేశక్తి. ఈమె సాత్వికులైన దేవతలకు చేతనను ఒస
చున్నది.

ఈశ్రేయోదాయిని యగు సంజ్ఞాశక్తికి ఊర్ధ్వగామిని యైన సూ తేజస్సుతో అనన్య సంయోగము గలుగుట వలన విద్యా (జ్ఞానమ అను కన్యయుదయించినది. ఈమెను దైవీసంపద యందురు. ఈదైవీ పదయగు విద్యను దేవతలు శ్రద్ధాభక్తులతో ఉపాసించి యమృతమ బొందిరి. ఈసిద్ధిని గూర్చి "విద్యయాఽమృతమశ్నుతే" అనియుపనిష తెల్పింది. అమృతమనగానేమి? దేవతలకదెట్లు లభించిన దన? ఆదిత్యుడు సత్యమనియు వారియందుగల హిరణ్మయ పురుషుడే అమ మనియు – "తద్యత్సత్యమసౌస ఆదిత్యోయఏష ఏతస్మిన్మండలే పురుష అని ఉపనిషత్తు తెలిపి నందున దేవతలు విద్యా (జ్ఞానం) ద్వా ఆహిరణ్మయ తేజస్సును ఉపాసనచేసి తత్స్వరూపమైన అమృతము పానము జేసిరి.

ఇక వీరు అసురులకు ప్రేయస్సును (ఇహపరసుఖమును ప్రసాదించున దెటులనగా – "ఛాయా" అనునామె ప్రేయస్సునిచ్చేశక్తి ఈఛాయకు భూలోకవ్యాపినియైన సూర్యుని తేజస్సుతో అనన్యసంయో మేర్పడినందున "అవిద్యా" (అజ్ఞానము) అను కన్య యుదయించిన (అనగా ఛాయా దేవి అవిద్యకు జనని)

ఈయవిద్యాప్రభావంచేత వేదశాస్త్రముల జదివిన వారికిని కామ కర్మలాచరించుటే జీవిత సర్వస్వమనిపించును. వారు "అక్షయ్యగ్ంహ చాతుర్మాస్యయాజినస్సుకృతంభవతి" చాతుర్మాస్యయాగము నాచరించి వారికి నాశనము లేని పుణ్యం కలుగుచున్నది. "అపామసోమ మమృ అభూమ" సోమపానముచేసితిమిగాన మరణరహితులమైతిమి. ఈమొదల

ఋత్విజుల మనహరింపుచుందురు. వీరిని గూర్చి శ్రీకృష్ణపరమాత్మ ఉద్ధవునితో

శ్లో॥ కామినః కృపణా లుబ్ధాః, పుష్పేషు ఫలబుద్ధయః
అగ్నిముగ్ధా ధూమతాంతాః, స్వలోకం నవిదన్తితే॥
భాగ॥ఏకాదశ స్క 21అ 27 శ్లో

ఉద్ధవా: వీరుకామోపహతులు గాన కృపణులు. కావుననే ఆశాపాశములచే బంధింపబడి అవాంతరఫలములైన స్వర్గాదులయందు పరమఫలమను బుద్ధిగలవారై అగ్నిసాధ్యమైన కర్మయందు దృఢమైన శ్రద్ధగలవారై ధూమమార్గమే చివరదని తలచి యాత్మతత్వము నెఱుగజాలకున్నారు అనిపలికెను

వేదములను కల్పవృక్షమునకు, ఫలించగల మోక్షప్రాప్తి వరకు వేచి యుండజాలక పూలు పూచిన వెంటనే వాసనచూచుటకు మురిసిపోయి యాపూలనే కోసికొని ధరించు వారివలె విషయ భోగాసక్తితో దేవలోకమునకు బోయి యమృతమును త్రావి, రంభాద్యప్సరసలతో గూడి నందనవనంలో విహరించ గలమని తలచెదరు. వీరిని గూర్చియే "యామిమాం పుష్పితాంవాచం: ప్రవదన్త్య-విపశ్చితః॥ ... 'రలు పుష్పిత వాక్యములు పలుకుదురని భగవంతుడు యర్జునునికి గీత 2అ 42. శ్లోకంలో తెలిపిరి. ఋత్విజులు - వీరిని గూర్చి - పరమాత్మతో - భగినియతి భారతీతీర్థ ఉరువ్యాప్తి ప్రయుక్తజడాన్॥ కర్మశ్రద్ధగల మందమతులను గౌణీ-లక్షణా మొదలగు అనేక వృత్తులచేత వీరివారిని మోహింపజేయుచున్నదని తెలిపినవి. ఇట్టివారాచరించిన వైదిక కర్మలకు గూడ ఫలదాత యీసూర్యుడైనందున వీరు దేవాసురులచేత నమస్కరింపబడెదరు.

## భాస్కరః

సూర్య - చంద్ర - అగ్నులకుగూడ తేజస్సునిచ్చే పరమాత్మ భాస్కరుడు. "నతత్ర సూర్యోభాతి నచంద్రతారకం। నేమావిద్యుతో భాంతికుతోఽయమగ్నిః। తమేవభాంత మనుభాతి సర్వం, తస్యభాసా సర్వమిదం విభాతి। అను ముండకోపనిషత్తు ననుసరించి సర్వతేజః పదార్థములకు ఈ ఆదిత్యరూప పరబ్రహ్మవలన తేజస్సు లభించుచున్నవి.

## భువనేశ్వరం

భువనము లనగా లోకములు. ఇవి "భూర్భువస్సువః" అను మూడు లోకములు లేక చతుర్దశ భువనములు అనియు చెప్పబడును. వీనికి ప్రభు వై యుండున వీరిని భువనేశ్వరుడు అనిరి.

శ్లో॥ సఏష తేజసోరాశిః దీప్తిమాన్ సార్వకాలికః
పార్శ్వేనోర్ధ్వమధశ్చైవ। ప్రతపత్యేషసర్వతః॥
(సాంబపురాణం)

సూర్యభగవానుని స్వరూపము తేజోరాశి. వీరు ఎల్లవేళల ప్రకాశించుచు భూర్భువస్సువర్లోకములను తపింప జేయుచున్నారు. ఇక పదునాలుగు లోకముల కధిపతి యెట్లనగా సూర్యతేజస్సు రెండుభాగములు. అందొక భాగము భూరాది సత్యలోకపర్యంతముగల ప్రాణులకు జ్ఞానశక్తిని క్రియాశక్తిని వృద్ధిచేయుచున్నది. ఈతేజస్సును "సంజ్ఞా" అందురు. రెండవభాగము అతలాదిపాతాళాంతలోకములందుగల ప్రాణులకు జ్ఞాన క్రియాశక్తులను వృద్ధిచేయుచున్నది. ఈ తేజస్సును "ఛాయా" అందురు.

త్మలకు — పాపాత్ములకు, జడములకు — చేతనములకు, సమ
వర్తిగా, ప్రేరణ కలుగ జేయుచున్నవి. వాని నానాత్మకత్వభావ
“మహాపారం” “సాధారణ స్సర్వే మానుషాణాం” అని వర్ణిం
మరియు “నూనంజనాస్సూర్యేణ ప్రసూతా అయన్నర్థాని కృణవన్నప
అని సూర్యుడందరకు సమంగా ఉపకరించుచున్నాడు. వర్తింపచుం
ప్రత్యేకపాత్రత, పరాక్రమము, శ్రమ తమ, సామర్థ్యము ననుసరించి
వలన లాభము పొందుచున్నారు అనగా సూర్యుని ప్రేరణవలన వ
లెంతెంత పని చేయగలుగుచున్నారో అంతంత ధనమును గాని వస్తు
గాని పొందగలుగుచున్నారు.

## గూఢార్థదీపిక

అగస్త్య మహర్షి – రామా! ఈసూర్యుడు దేవతలందరకు ఉ.
కారణము గావున వీరు సర్వదేవాత్మకుడని తెల్పితిని.

ఉపాదానకారణ మనగానేమో వినుము. ప్రపంచంలో ...చే
నగలు, వస్త్రములు మొదలైన కార్యములకు ఉపాదానకారణమని
కారణమని కారణములు రెండువిధాలు. కుండ, అనేకార్యానికి
ఉపాదాన కారణము. కుమ్మరి, నిమిత్త కారణము. ఉంగరము, అను కా
బంగారము ఉపాదానకారణము, శిల్పి, నిమిత్త కారణము వస్త
కార్యానికి, నూలు ఉపాదాన కారణము, నేయువాడు – నిమిత్త కార
ఇటుల ఏకార్యానికైనా ఈరెండు కారణాలు వేరువేరుగా వుంటాయి.
జగత్తనే కార్యానికి పరమాత్మ, “మాయ” అను తన ఉపాధిద
ఉపాదాన కారణము, స్వయంగా చైతన్య వృత్తితో నిమిత్తకార
రెండూవారేఅగుచున్నందున వేదాంతులు(అభిన్ననిమిత్తోపాదానకార
రెండుకారణాలు పరమాత్మయేనని). కావున ఈసూర్యుడు సర్వా
కుడంటిని.

"ఏషదేవాసురగణాన్ లోకాన్పాతి గభస్తిభిః॥

ఈసూర్యుడు తనకిరణాలచేత వర్షముగురిపించి మానవులను స్వధ,
ఎ పితృదేవతలను, అమృతము నొసగి దేవతలను రక్షించు
ను.

ఈవిషయం స్పష్టంకావడానికి గీతలో శ్రీకృష్ణభగవానుడు అర్జునునకు
ఒకయితిహాసము తోడ్పడుతుంది పూర్వము ప్రజాపతి ప్రజలను
చి వారి సుఖజీవనమునకై యజ్ఞములను గూడ సృజించి వారితో
జలారా: మీరునూ, దేవతలునూ, ఈయజ్ఞములద్వారా మీమీసంప
వినిమయము (ఎక్స్ఛేంజి) చేసికొని సుఖింపుడు. అందులకీ
ములు కామధేనువువలె సహాయముచేసి సర్వశ్రేయస్సులను గల్గించు
ఆ వినిమయ మెటుల జరుగునో భగవతియగు వేదమాత యీరీతిగ
చుచున్నది. "తస్మాదితః ప్రదానం దేవా ఉపజీవన్తి".

ఈలోకంలోయజ్ఞములాచరించి మంత్రపూతమైన పురోడాశమును
హోమము చేసిన యడల ఆ హవిస్సనే యమృతమును భుజించి
లు జీవింతురు. అటుల అమృత భోజనముచే సంతసించిన దేవతలు
త్రదముతః ప్రదానం మనుష్యా ఉపజీవన్తి. "పైలోకంలో సూర్యునిచే
ంబడియున్న జలమును భూమిపైవర్షింపజేసి నందున భూలోకవాసులు
ములు పండించుకొని భుజించి సుఖింతురు. పై లోకంలో సూర్యునిచే
ధరింప బడినదని "సూర్యేణవాఅముష్మిన్‌లోకే వృష్టిర్ధృతా। సపవాస్మై
ంనియచ్ఛతి" అని శ్రుతి తెలిపింది.

అగ్నౌప్రాస్తాహుతి స్సమ్యగాదిత్య ముపతిష్ఠతే।
ఆదిత్యా జ్జాయతేవృష్టిః। వృష్టేరన్నంతతః ప్రజాః॥
అని యీ ప్రక్రియనంతయు మనువు బోధించెను।

8

శ్లో॥ ఏషబ్రహ్మాచ విష్ణుశ్చ। శివఃస్కందః ప్రజాపతిః।
మహేంద్రోధనదఃకాలో। యమస్సోమోహ్యపాంపతిః॥

వివరణ:-

ఈలోక బాంధవుడు తనకిరణజాలంతో సమస్త లోకాలను సృష్టించి పోషించి లయింప జేస్తాడు కావున త్రిమూర్తులైన, బ్రహ్మ విష్ణు మహేశ్వరులు సూర్యకాంతిలో వున్నారు. బ్రాహ్మణం."ఏకామూర్తిస్త్రయోదేవా బ్రహ్మవిష్ణుమహేశ్వరాః" అనితెలిపింది. సూర్యభగవానుడు త్రిమూర్తి స్వరూపం.

శ్లో॥ ఉదయే బ్రహ్మణోరూపం। మధ్యాహ్నేతు మహేశ్వరః।
సాయంకాలేస్వయంవిష్ణుః। త్రిమూర్తిశ్చదివాకరః॥

అని భవిష్యపురాణమందలి ఆదిత్యహృదయము పేర్కొన్నది. శివుని ముద్దులపట్టియైన స్కందుడు గూడ అతడేనట, మహేంద్రుడు, కుబేరుడు, కాలుడు, యముడు, సోముడు, వరుణుడుగూడ భాస్కరునికి ప్రతి రూపాలే.

గూఢార్థదీపిక

ఏషః = ఇతడే। "అథయఏషోంతరాదిత్యే హిరణ్మయః పురుషో దృశ్యతే" అను శ్రుతివిబట్టి యోగిజనసాక్షాత్కారముగుచున్నందున మహర్షి మాటి మాటికి - ఏషః = ఇతడే అని నిర్దేశించుచున్నారు

1 ఇతడు – బ్రహ్మ = చతుర్ముఖశరీరుడు

2 సాటిలేని యైశ్వర్యమును విద్యను సృజించువాడు. విష్ణుః = విష్ణువు

1 ఫాల్గుణ మాసాధిపతియగు సూర్యునకు విష్ణువని పేరు

2 రక్షకుడు – ఒకధర్మనిష్ఠగల వ్యక్తివలె వారు స్వధర్మమును తత్పరతతో పాలన జేయుచు విష్ణువను నామమును సార్థకము జేయుచున్నారు

3 పరాశర మహర్షివచనమునుబట్టి విష్ణువనగా (1) విశ్వవ్యాపకుడు (2) అంతట ప్రవేశించువాడు

శ్లో॥ యస్మాద్విష్ట మిదం విశ్వం। తస్యశక్త్యా మహాత్మనః।
తస్మాత్సప్రోచ్యతేవిష్ణుః। విశేర్ధాతోః ప్రవేశనాత్॥

1 ఈవిశ్వమంతయు పరమాత్మశక్తిచేతనే వ్యాపింపబడినందున వారు విష్ణువని పిలవబడిరి.

2 ఈఫాల్గుణమాసంలో ప్రవేశించిన సూర్యుడు శక్తిసంపన్నుడై చలికి విచలితమైన ప్రకృతిలో శక్తిసంచారము చేయగల సమర్థుడగును. వారి యుత్పాదనాసామర్థ్యమీమాసంలో అభివృద్ధియగును. అగ్నియొక్క తేజస్సుగూడ వారిలో ప్రత్యక్షమగును 3 ఉపేంద్రావతారము

1 శివః = శివుడు ఇతడే

శ్లో॥ ఆదిత్యంచ శివంవిద్యా। చ్ఛివమాదిత్యరూపిణం।
ఉభయోరంతరంనాస్తి। హ్యాదిత్యస్య శివస్యచ॥

ఆని శివుడాదిత్యుడేయని శివపురాణం చెప్పింది.

2 "యోసావాదిత్యః పరమపురుష స్సఏష రుద్రోదేవతా।
ఆదిత్యరూప పరమపురుషడీరుద్రుడేయని లఘున్యాసం తెలిపింది.

3 నమకంగూడ ఈఆదిత్యుడు శివుడేనంటూ

"అసౌయో౽వసర్పతినీలగ్రీవో విలోహితః" అని వర్ణించింది

మహర్షి మాటి మాటికి – ఏషః = ఇతడే అని నిర్దేశించు చున్నారు బ్రిహ్మే

1 చతుర్ముఖశరీరుడు 2 సాటిలేని యైశ్వర్యము, విద్యలను సృజించువాడు విష్ణుః

1 ఫాల్గుణమాసాధిపతియైన సూర్యునకు విష్ణువని పేరు. పరాశరమహర్షి వచనాను సారము విష్ణువనగా 1 రక్షకుడు 2 విశ్వవ్యాపకుడు 3 అంతట ప్రవేశించువాడు

1 ఒకధర్మనిష్ఠగల వ్యక్తి వలె వారుస్వధర్మమును తత్పరతతో పాలన జేయుచు విష్ణువను నామమును సార్థకము జేయుచున్నారు

యః అసౌ = మనచేత చూడబడుచు ఆదిత్యరూపంలో మన్నవాడు పరమశివుడే।

అవసర్పతి ≡ ఉదయపర్వతమునుండి యస్తమయ పర్వతమును గూర్చి వెళ్లుచు ఆదిత్యరూపంలో ఉదయించెను (సూర్యగమనము వైదిక సిద్ధాంతము) ఆ శివస్వరూపమెట్టిదనగా?" నీలగ్రీవో విలోహితః" కాలకూటవిషమును ధరించుట వలన కంఠమునందు నలుపు రంగు గలవాడు

విలోహితః ≡ విశేషేణలోహితవర్ణః। అక్కడదప్పశరీరమంతటు ఎఱ్ఱ వర్ణముగలవాడు, అశివుడే ఆదిత్యుడైతే, ఆదిత్యునకీ విశేషణము లెట్లుసరిపోవుననగా? సాయంకాలసూర్యుని గూర్చి శృతి "నీలగ్రీవోవిలోహితః" అనివర్ణించింది (వ్యా)

గ్రీవ నిఉదకమితిగ్రీవాః = రశ్మయః। నీలాఃగ్రీవాః రశ్మయః యస్యాసౌ నీలగ్రీవః। సాయంకాలమందలి సూర్యుడు ఉదయాదిగ భూమి యందలి నీటిని తనకిరణములచేత ఆవిరి రూపములో స్వీకరించుటచేత ఆయన కిరణాలన్నీ సాయంకాలము నీటితో నిండియుండును. సూర్యుడస్తమయానికభి ముఖుడైనందున అవి నీల వర్ణము గలగియుంటవి. అలాంటి కిరణాలు గలవాడు।

"ఉతైనంగోపా అదృశన్నదృశన్నుదహార్యః। ఏనం= ఈయాదిత్యరూపంలో వున్న పరమ శివుని. గోపాః = వేదశాస్త్రములు దెలియని గోపాలురు అదృశన్ = చూచెదరు. ఆవిధంగా గోపాలురకు దర్శనమిస్తున్నారట. వారుమాత్రమేగాదు, "అదృశన్ను దహార్యః" ఉదకంతెచ్చే స్త్రీలు గూడ చూచెదరు। ఎందుకు చూచెదరనగా, కైలాసవాసి యగు పరమశివునిగాని, హృదయాకాశమందుగల పరమాత్మనుగాని సాక్షాత్కరించుకునే విషయమున వేదశాస్త్రానభిజ్ఞత్వము స్త్రీలకును సమానమే అట్టివారిని కూడ తరింప జేయుటకు పరమశివుడే ఆదిత్య రూపంలో దర్శనమిస్తున్నారు. వారిని దర్శించి వాళ్లు తరిస్తారు. అలా ఆదిత్యుని దర్శించుచే వారికి పరమాత్మోపాసన. అందుచేత "దిదృక్షేణ్యోదర్శనీయోభవతి" అని శ్రుతివర్ణించింది. ఇటుల వారు మాత్రమేగాక అందరూ చూచెదరు. "ఉతైనం విశ్వాభూతాని సదృష్టో మృడయాతినః" ఈపాటికి సూర్యాస్తమనమైనది గోవులను యజమానులయిండ్లకు తోలుకొని పోవలయునని ఆదుర్దాతో గోపాలురూ, నాల్గు ఘడియల పొద్దుండగా నీళ్లతెచ్చు కోవాలి. రాత్రులందు నీరుతెచ్చుట పనికిరానందున ఆదుర్దాతో స్త్రీలుకూడ అస్తమించే ఆదిత్యుని చూచెదరు. అర్ఘాస్తమనంవేళ సంధ్యావందనముకొరకు విప్రులు, వాహ్యాళికై క్షత్రియులు కొట్లుకట్టుటకై వైశ్యులు, పనులు మానుటకు కూలినాలీలు, గ్రామ్యపశువులు ఇలాఅందరూ చూచెదరు అటువంటి సూర్యుని చూడగూడదనిధర్మశాస్త్రము

శ్లో॥ నేక్షేతోద్యన్తమాదిత్యం। నాస్తం యాంతంకదాచన॥

అని యుదయాస్తమయసమయములలో ఆదిత్యుని చూడరాదు. ఆటుల శాసనజూమట "అయువడచు" అని చెప్పబడినందున వారిని దర్శించుట పనికిరాదని తెలియకయే చూచిన పాపమును బోగొట్టి మమ్ము లను సుఖింప జేయును గాక।

2 శివుడనగా మంగళాన్ని యిచ్చేవాడు అపరిమిత మంగళ పుణ్యస్వరూ వంగల యీసూర్యుడే శివుడు.

3 మృగము (జింక) పరశువు (గండ్రిగొడ్డలి) మొదలైన చిహ్నము లతో గూడిన మహాదేవుడు సూర్యుడే।

స్కందుడు

1 షణ్ముఖ శరీరాన్ని ధరించిన పరమాత్మ "సేనానీనా మహంస్కందః" అని కృష్ణుడు గీతలో సెలవిచ్చిరి.

2 సర్వశతృవులను శోషింప జేయువాడు.

3 జీవజ్యోతి ద్వారా సర్వేంద్రియముల ప్రవర్తింపజేయువాడు.

4 సంసారదుఃఖమును జారిపోవునటుల జేయువాడు.

5 మయూర వాహనుడు.

"ప్రజాపతిః"

1 లోకంలో జనించే ప్రాణులు ప్రజలు వారికి స్వామి కాన ప్రజాపతి.

2 ప్రజాపతులు తొమ్మిది మంది "ప్రజాపతీనాందక్షోహం" ప్రజా పతులలో దక్షుడను నేను అని శ్రీకృష్ణపరమాత్మ ఉద్ధవునకు దెలిపెను. (జాత్యేకవచనము)

3 "ఆశ్రావయ- అస్తుశ్రౌషట్ - యజ- యే యజామహే, వషట్"
అను మంత్రపంచకమునకు పదునేడక్షరములు సప్తదశాక్షర సమ్మిత
మగు నీమంత్ర పంచకము ఛందస్సారముగాన ఛందస్యము
ప్రజాపతి రూపము

"ఏషవై సప్తదశః ప్రజాపతిః" ఏషవై ఛందస్యః ప్రజాపతిః" అని శ్రుతి వివరించింది.

మహాభారతము గూడ నీ మంత్రపంచకముచే యజ్ఞములందు విష్ణువు హూయమాను డగు చుండును.

శ్లో॥ చతుర్భిశ్చ, చతుర్భిశ్చ, ద్వాభ్యాం పంచభి రేవచ।
హూయతేచ పునర్ద్వాభ్యాం సమేవిష్ణుః ప్రసీదతు॥

అనుచుదెలిపింది। మరియు దశేంద్రియ - పంచప్రాణ- మనో బుద్ధులతో విల్లసిల్లెడి సూక్ష్మ శరీరమునకును సప్తదశకమని పేరు.

శ్లో॥ పంచప్రాణ మనోబుద్ధి దశేంద్రియ సమన్వితం।
అపంచీ కృత భూతోత్థం సూక్ష్మాంగం భోగసాధనం॥
(ఆత్మబోధ)

ప్రాణశక్తితో గూడుకొనిన యీసూక్ష్మ శరీరమే, భోగసాధన మగుచు స్థూలశరీర యాత్రానిర్వాహకము గాన నత్యంత ప్రధానము. అట్లే సప్తదశాక్షరోపేతమై ఛందస్సారమై ప్రజాపతి రూపమై యొప్పు నీమంత్రపంచకము యజ్ఞశరీర నిష్పాదకమై యజ్ఞనిర్వాహకము। అట్టి ప్రజాపతి సూర్యుడు.

మహేంద్రః

1 స్వరూపము చేతను మహిమచేతను ప్రమాణముల కందనివాడు

ఇంద్రుడు వృత్రవధ గావించిన దిట్ట, వారి యాపరాక్రమమునకు సంతసించినవారై యింద్రునకు మహాన్ = అని బిరుదము నిచ్చిరి మహాన్ + ఇంద్ర = మహేంద్ర అని నాడు మొదలు మహేంద్రు డనిపేరు గాంచిరి "ఇంద్రోవృత్రమహ స్తందేవా అబ్రువన్మహాన్వా ఆయమ భూద్యోవృత్రమవధీదితి తన్మహేంద్రస్య మహేంద్రత్వం అనితైత్తిరీయసంహిత వర్ణించింది। మహేంద్రుడే సూర్యుడని ఋగ్వేదం- చిత్రందేవానాముదగాదనీకం "సూర్యమండలమనేకము లైనందున చిత్రముగానున్నదియును పూర్వము వృత్రాసురుని శరీరమే చీకటిగా నేర్పడినందున యాజీకటిని బోగొట్టుటకు దేవతలకు సైన్యముగానున్న సూర్యమండలముదయించినది.

2 వజ్రహస్తాది చిహ్నములుగలవాడు.

ధనదః

1 ధనమునిచ్చు కుబేరస్వరూపుడు "విత్తేశోయక్ష రక్షసాం" సత్రాజిత్తు నకు "స్యమంతక మణిని, ధర్మరాజునకు అక్షయ పాత్రను అను గ్రహించిన దితడే"

2 'అన్నాదోవసుదానః" అనుప్రమాణముచే ధనదుడనగా సర్వ కరత్రే ఫలప్రదుడగు నారాయణమూర్తియే వీరు.

3 ధనమనగా చైతన్యము- అందరకు చైతన్యమునిచ్చు పరమాత్మయే ధనదుడు.

కాలః

సూర్యుడు కాలస్వరూపంగా చెప్పబడెను। ఈకాలపురుష డేమరి పాటు లేక ప్రపంచవ్యవహారముల నన్నిటిని నిమిషాలూ గంటలూ, రోజులూ నెలలూ సంవత్సరాలంటూ కొలిచి వేస్తున్నాడు. లెక్కప్రకారం

కొలత వేయుటలో కాలానికి మించిన శక్తి లేదు। జగత్తంతయు కాలానికి వశము. కాల పురుషునిద్వారానే సృష్టి, స్థితి, సంహారాలు జరుగుతున్నాయి. కాలాన్ని కాదనే వాడెవ్వడు లేడు। "కాలఃకలయతామహం" ఈకాలము నాస్వరూపమని భగవంతుడన్నాడు. సూర్యరధగమనము చేతనే యీకాలమేర్పడు చున్నటుల "సప్తయుంజన్తిరధమేకచక్రం। ఏకో అశ్వో వహతి సప్తనామా। త్రినాభిచక్రమనర మజర్వం। యేనేమా విశ్వాభువ నానితస్థుః।

కాలాత్మకమైన సూర్యరధము బహువిలక్షణమట। అది రంహాణ (గమన) గమన శీలము గలది కావున దానివి రధమందురు అది నిరంత రము ప్రయాణము చేయుచుండును. ఆరధమునకు సంవత్సరము పేరుగల ఒకే చక్రమున్నది। రాత్రింబవళ్లను వారములేడును ఏర్పడుటకై దానికేడు గుఱ్ఱములు గట్టబడినవి

శ్లో॥ రధస్యైకంచక్రం భుజగయమితా స్సప్తతురుగాః

ఆరధమున కొకేచక్రమట, పాములచే గట్టబడిన యేడుగుఱ్ఱము లారధమును లాగుచుండును. ఆచక్రమునకు భూతభవిష్యద్వర్తమానము లని మూడు నాభులున్నవి.

అది మిక్కిలి దృఢమైనది గావున అవినాశియందురు. ఒకనది ప్రవహించునప్పుడు దానిలో చిన్న చిన్న ఏరులు వాగులు వచ్చికలసి నందున మహానది యైనటుల

శ్లో॥ ఏవంనానా సముత్థానాః। కాలాస్సంవత్సరగ్గ్రశితాః।
అణుశ్చ మహాశ్చ। సర్వేసమవ యంత్రితం॥
(అరుణికీఱ్రశి)

క్షణము ముహూర్తము మొదలగు కాలావయవములును దివస పక్షరూపములైన మహాకాలములును, సంవత్సరము నాశ్రయించి మహా కాలమని చెప్పబడింది ఈవ్యవహారరూప కాలస్వరూపము కంటె మరొక పారమార్థిక కాలమున్నదని దానిని తెలియవలెనని యారుణికీశ్రుతి తెలిపింది.

అణుభిశ్చ మహద్భిశ్చ। సమారూఢః ప్రదృశ్యతే। సంవత్సరః పరిత్యక్షేణ। నాధిసత్వః పరిదృశ్యతే। క్షణము మొదలగు స్వల్పకాలము చేతను దినము మొదలగు మహాకాలము చేతను ఏర్పడిన ప్రభవాది సంవత్సరరూప కాలము జ్ఞానంలేని పిల్లలుగూడ తెలిసికొను చున్నారు. దీనికంటె అతీంద్రియమైన పరమాత్మ స్వరూపమగు కాలము శాస్త్రాభ్యాసములేనివారికి తెలియబడదు। ఈకాలమును గూర్చి "అనాదిర్భగవాన్ కాలః" అని పరాశర మహర్షి తెలిపిరి.

పరమాత్మ కాలానికి కాలము.

కాలము మూడువిధాలు। ఒకటి సమయవాచక కాలము। రెండు ప్రకృతి రూపమైన కాలము. ఇది మహాప్రళయం తర్వాతగూడ ప్రకృతి యొక్క సామ్యావస్థ వుండేవరకు వుంటుంది. జగత్సంహారకుడైన కాలుడు "కాలాయమహాగ్రాసాయవై నమః" అనిశ్రుతి "అత్తాచరాచరగ్రహణాత్" అనిబ్రహ్మ సూత్రమువున్నందున సమస్త ప్రపంచమును నశింపజేయువాడు. మూడవది అక్షయకాలము. ఇతడేపరమాత్మయైన సూర్యభగవానుడు. (1)వకాలము ప్రకృతిలో ఒక భాగము। ఇదిమహా ప్రళయంలో అయమౌతుంది। పరమాత్మయే శాశ్వత కాలము।

ఇటువంటి భాస్కరుని రథమందుండగా దర్శించిన వారికి

శ్లో॥ రథస్థం భాస్కరం దృష్ట్వా పునర్జన్మ నవిద్యతే॥

ముక్తివచ్చును. యమః = యముడు

యమయతి శిక్షయతీతి యమః। శిక్షించి నిగ్రహించే వారిలో యమునకు యముడేదీటు. పక్షపాతం లేకుండా సమవర్తియై న్యాయాన్ని నిర్ణయించడంలో యముడు శ్రేష్ఠాధికారి.

సూర్యుడే పుత్రుడైన యముడుగా నుండి శిక్షించును

సర్వాంతర్యామి

శ్లో॥ యమోవైవస్వతోరాజా। యస్తవైషహృదిస్థితః।
తేనచేదవివాదస్తే। మాగంగాం మాకురూన్గమః॥

అని మనువు చెప్పినందున యీఅంతర్యామి యగు యముడు సూర్యుడే।

సోమః

1 సూతే అమృతమితి సోమః। అమృతమనగా మోక్షము। ఈమోక్షము నొసగు వాడు గాన సూర్యుడు సోముడు.

2 ఉ = అనునక్షరమునకు అర్థములేదు. మా = ప్రభా। (ఉ) ఎల్లప్పుడు ప్రభతో గూడిన వాడుగాన సోముడు. ఇతడే ఆదిత్యుడు। సూర్యుడు సదాప్రభతో గూడి యుండుటను గూర్చి సీతా,రాములు తమదాంపత్యము అటువంటిదే యని చెరియొక సందర్భంలో దెలిపిరి.

సీత–రావణునితో–అనన్యారాఘవేణాహం భాస్కరేణ ప్రభాయథా॥

రామా 5కాం 21స 15శ్లో

రాముడు–అగ్నిహోత్రునితో "అనన్యా హిమయా సీతా భాస్కరేణ ప్రభా" (6కాం 12.స 19శ్లో) అని చెప్పిరి.

ఈసూర్యుడు స్వస్వరూపంతోను, చంద్రరూపంగాను పుండి లోకోపకారము చేయుచుందురని శ్రుతి తెలిపింది. పూర్వాపరం చరతో మాయమైతౌ। శిశూక్రీడంతౌ పరియాతో అధ్వరం। విశ్వాన్యన్యోభువనాభి చష్టే। ఋతూనన్యో విదధ జ్జాయతేప్నః॥

సూర్యుడు ముందునడచుచుండును. చంద్రుడు వెనకభాగమున వారి ననుసరించుచుండును. పరమాత్మతేజస్సుతో ప్రకాశించువాడు సూర్య భగవానుడు. ఆసూర్యతేజస్సుచేత ప్రకాశించువాడు చంద్రుడు. చంద్రునిపై సూర్యకిరణములు ప్రసరించుటచేత యుజ్జ్వలమై చల్లగా చంద్ర కాంతి ప్రకాశిస్తుంది। ఎటులనగా ఇంటిద్వారం వద్ద ఉంచబడిన అద్దముపై సూర్యకిరణాలు పడుటచేత గృహముయొక్క లోపలి భాగము ప్రకాశించు నట్లే తమపర్జ్ఞానంతో సూర్య-చంద్రులు అంతరిక్షంలో ముందు వెనుకల యిరువురు శిశుప్రలరీతిగ విహరించుచున్నారు. వారిరువురిలో ఆదిత్యుడు సకల లోకములను జూచుచున్నాడు. చంద్రుడు ఋతువులను నిర్మిస్తూ, మాటి మాటికి ప్రాదుర్భవించుచున్నాడు. సూర్యునికి క్షయ వృద్ధులు లేనందున నిజంగా వారికి ప్రాదుర్భావము లేదు చంద్రునకు కళావృద్ధి-క్షయములు, (కళలు తగ్గుట. యెక్కుట) జరుగు చున్నందున పునర్జన్మ వారికి చెప్పుట యుక్తమే। శ్రుతి "సూర్యఏకాకీ చరితి చంద్రమా జాయతేప్నః అని, "నవోనవో భవతి జాయమానో హ్నాం కేతురుషసామేత్యగ్రే। భాగం దేవేభ్యో విదధాత్యాయ ప్ప్రచంద్ర మాస్తిరతిదీర్ఘమాయుః అను తైత్తిరీయ సంహిత పుష్టిని గర్జించుచున్నది

3 ఉమయా సహితః సోమః, ఉమా = బ్రహ్మవిద్య, ఆమెతో గూడిన పరమాత్మ। ఇతడే సోముడు.

4 ఉమా = పార్వతీదేవి। ఆమెను సగము శరీరమందు ధరించి నందున అర్ధనారీశ్వరుడు గూడ సోముడే।

అపాంపతిః = వరుణుడు

1 ఆషాఢమాసానికధిపతియగు సూర్యునకు వరుణుడని పేరు. అనగా జలములకు స్వామి: గీతలో "వరుణోయాదసామహం" అని శ్రీకృష్ణుడు తనను వరుణునిగా బేర్కొనెను.

ఆషాఢమాసము వర్షఋతువునకు తొలిమాసము. సూర్యుడు సముద్రమునుండి జలాన్ని గ్రహించి వరుణరూపంలో యీమాసంలోనే దానిని ప్రజాహితమునకై మరల యిచ్చుచుండును. సత్పురుషుల ధన సంపాదనము మేఘమువలె త్యాగము చేయుటకే గదా।

శ్లో॥ ఆదానంహి విసర్గాయ। సతాంవారిముచామివ॥

అను కాళిదాసమహాకవి సూక్తిని యీ వరుణడను సూర్యుడు సార్థకము గావించు చున్నాడు.

అపాంపతి = సముద్రుడు "రత్నాకరోజలనిధి ర్యాదసాంపతిరప్పతిః" అనియమరకోశము ఇతడు నదుల కన్నిటికి ఉత్పత్తి, లయములకు స్థానము. మరియు భూమికాధారమై భూమిని చుట్టివున్నాడు। రత్నములకు ఉత్పత్తి స్థానము. "సరసామస్మిసాగరః" స్థిరమైన జలాశయములలో సముద్రము నేనని భగవంతుడు గీతలో సెలవిచ్చి యున్నారు.

9

శ్లో॥ పితరో వసవ స్సాధ్యా। హ్యశ్వినౌ మరుతోమనుః।
వాయుర్వహ్నిః ప్రజాప్రాణ। ఋతుకర్తా ప్రభాకరః॥

వివరణ :-

సూర్యుని సర్వదేవాత్మకత్వం అంతటితో ఆగలేదు। వంశవృద్ధి కరులగు పితరులు, ఎల్లప్పుడుండే వసువులు ఆధివ్యాధులను బోగొట్టే

అశ్వినీదేవతలు, ప్రజలకు ప్రాణాలు పోసే ప్రజాపతి, సాధ్యులు పన్నెండు మంది, ఆలోచనలిచ్చె మనువు వారే। వాయువు, అగ్ని ఋతువులూ అన్నీ ఆయన సహాయంతోనే ప్రవర్తించు చున్నవి।

గూఢార్థ దీపిక

1 వైశాఖమాసాధిపతి యగు సూర్యునకు అర్యముడని పేరు, కవ్య వాహ, అనల, సోమ, యమ, అర్యమా, అగ్నిష్వాత్త, బర్హిషద అను వారేడుగురు పితృ దేవతలు। వారిలో అర్యముడు శ్రేష్ఠుడై నందున భగవంతుడు "పితౄణామర్యమాచాస్మి "అని తన విభూతిగా అర్యముని పేర్కొన్నాడు:

2 పాంతీతి పితరః = రక్షించేవారు గాన పితరులు, వీరియందు పితరు లందరి సమీకరణమున్నది. అందుచేత పిండదానము తర్పణము మొదలైన పితృకర్మలు సూర్యుని ద్వారా పితరులకు చెందు చున్నవి. ఇందులకు ప్రత్యక్షనిదర్శన మేమనగా - సూర్యుని దర్శనము లేనికాలమున పితృకర్మలు జేయరాదు. అపరాహ్ణ మందే పిండదానాదులు చేయవలయును: శ్రాద్ధమందు పిండ పూజాదులు సూర్యాస్తమయమునకు ముందే జరుపవలయును. సూర్యోదయానికి పూర్వము గూడ జరుపరాదు. "నచనక్తగ్గ్ శ్రాద్ధంకుర్వీత" రాత్రిలందు శ్రాద్ధము జేయరాదను నిషేధము ధర్మశాస్త్రమందున్నది।

అయ్యును "అన్యత్రరాహుదర్శనాత్" గ్రహణకాలములందు తప్ప అనికూడ యున్నందున గ్రహణమున మాత్రము రాత్రి శ్రాద్ధము చేయవచ్చును అనియున్నది.

ఇటుల పితరులకును సూర్యునకును అవినాభావ సంబంధ మున్నందున పితరులస్వరూపుడు సూర్యుడు.

3 "తాసాంబ్రహ్మ మహద్యోని రహంబీజప్రదః పితా" అను గీతా వచనమును బట్టి, ప్రాణులందరకు బీజప్రదుడు కావున ఆదినారాయణమూర్తి పితరుల స్వరూపము।

వసవః

1 ఆదిత్యుడు నక్షత్రములు మొదలగు ఏడుగురు పురుషుల సహాయం గలవాడని "అథాదిత్యస్యాష్ట పురుషస్య। అని శ్రుతి వర్ణించింది.

2 "అగ్నిశ్చపృధివీచ। వాయుశ్చాంతరిక్షంచ। ఆదిత్యశ్చద్యౌశ్చ చంద్రమా నక్షత్రాణి। అను వారెనిమిది వసువులని శ్రుతి వర్ణించింది.

3 సదావసన్తీతి వసవః = ఎల్లప్పుడు ఉండేవారు గాన వసువులు. వీరెనిమిది మంది. వీరిపేర్లు క్రమంగా - ధ్రువుడు, ధరుడు, సోముడు,ఆపుడు, వైశ్వానరుడు, అనిలుడు, ప్రత్యూషుడు,ప్రభాసుడు అనువారు. సూర్యుడు వీరికందరకు అంతరాత్మగావున వసువుల స్వరూపుడీతడే।

సాధ్యులు

1 యోగిజన సాధ్యుడైనందున ఆదిత్యమండలాంతర్వర్తియైన నారాయణమూర్తి సాధ్యులని చెప్పబడిరి. సాధనీయాః = అస్మాభిః పూజనీయాః సాధ్యాః। కేతే సాధ్యాః? ఆదిత్యాఏవ సాధ్యాః। సాధనీయులనగా మనచేత పూజింపదగినవారు. గాన సాధ్యులు. ఆసాధ్యులెవరనగా? ఆదిత్యులే।

2 సిద్ధిగలవారు గాన సాధ్యులు। వీరు పన్నెండు మంది। వీరుబ్రహ్మగారి ముఖమునుండి సృజింపబడినారు. మంత్రశరీరకులు. వీరుక్రమంగా-

మనువు, మంతుర్ుడు, ప్రాణదుడు, చేతయానుడు, వీర్యవంతుడు, విత్తి, జయుడు, నయుడు హంసుడు, నారాయణుడు, ప్రభువు.విదువు అని వాయు పురాణం తెలిపింది.

అశ్వినౌ = అశ్వినీ దేవతలు - వీరును సూర్యుని స్వరూపులే. వీరియుత్పత్తిని గూర్చి పురాణములందిట్లు గలదు. సూర్యుడు, అదితి కుమారుడుగ అవతరించి, దేవశత్రువులైన రాక్షసులను సంహారించెను. వారికి త్వష్ట ప్రజాపతి తన కుమార్తెయైన సంజ్ఞాదేవినిచ్చి వివాహము గావించెను. ఆమెకు వైవస్వతమనువు, యముడు, అనుకుమారులు "యమునా" అనుకుమార్తెయుగల్గిరి సంజ్ఞాదేవి ఆదిత్య తేజస్సును సహింప జాలక పోయినందున "ఛాయా" అను నామెను నిర్మించి తన స్థానంలో వుంచి తాను "అశ్విని రూపము ధరించి మేరు పర్వతప్రాంత మునకు (హర్యానా) జనెను. ఆమెవెళ్లేటప్పుడు ఛాయాదేవితో యీ రహస్యము సూర్యునకు చెప్పవద్దనెను. అందులకా " ఛాయాదేవి, "భర్త నన్ను వెండ్రుకలు పట్టుకొని యడుగు నంత వరకు చెప్పననెను. ఈరహస్యం చాలకాలము తెలియలేదు. సూర్యుడు ఛాయాదేవియే తన భార్యయని తలచు చుండెను. రూపము, గుణము, ప్రవర్తనలందు ఛాయా దేవి సంజ్ఞా దేవితో సమానమైనదిగా నుండెను. అందు వలన ఆమెను "సవర్ణా" అనికూడ పిలచెదరు.

ఆఛాయాదేవికి-సావర్ణి మనువు, శనైశ్చరుడు, విష్టి అను ముగ్గురు కుమారులు "తపతీ" అనుకుమార్తెయు గలిగిరి. ఛాయాదేవి తనసంతాన మును యెక్కువగా ప్రేమించుచూ తనసవతి సంతానమును తిరస్కరించు చుండెను. వైవస్వతమనువు ఛాయయొక్క యీవిషమ భావమును సహింపక సూర్యునితో "తండ్రీ. మాతల్లిమమ్ములను శని మొదలగు వారిని భేద భావంతో చూచుచున్నదని చెప్పెను. సూర్యుడు ఛాయను

అందులకు కారణమడుగ ఆమె సరియగు ప్రత్యుత్తర మీయలేదు. అందులకు సూర్యుడాగ్రహించి యామె వెండ్రుకలను బట్టుకొని యధార్ధము దెలుపుమని నిర్బంధించెను. అంతఛాయ తన పూర్వ ప్రతిజ్ఞాను సారముగ సంజ్ఞా దేవికి సంబంధించిన రహస్యమును ఈవిధముగ వెలువరించెను. సంజ్ఞాదేవి తమతేజస్సును సహింప జాలక తన స్ధానంలోనన్నుంచి తాను అశ్వనియై (ఆడగుఱ్ఱము) వెడలినదని చెప్పెను.

ఈ రహస్యమును విన్న సూర్యుడు తానును అశ్వరూపుడై సంజ్ఞా దేవిని వెదకుచూవెళ్ళి హర్యానా ప్రాంతమున ఆమెను కనుగొని ఆమెతో సమాగమము జరిపెను. ఆయశ్వరూప దంపతులకు కవలలుగ అశ్వినీ కుమారులు జన్మించిరి. వీరికి "నాసత్య" "దస్ర" అనిపేర్లు.వీరు సమస్త ప్రాణులకు ఆధివ్యాధులను తొలగించు దేవవైద్యులైరి। వీరియుపకారం స్వభావమును "సహస్రివృదియం భూమిః। పరంవ్యోమ సహస్రివృత్। అశ్వినాభుజ్యానాసత్యా। విశ్వస్యజగతస్పతీ॥

తా॥ ఈభూమ్యాకాశములు అనేకులగు మానవుల చేతను దేవతలచేతను వరింపబడినది. కాబట్టి యాభూమ్యాకాశములు రెండునూ రోగాలను బోగొట్టి భోగాల నిచ్చువారును సమస్త జగత్తునకు పోషకులైన అశ్వినీ దేవతల వల్లనే సమస్త ప్రాణులకు ఉపకారముచేయు చున్నవి. అనిభావము

ఈ పురాణ కధకు వైజ్ఞానిక విశ్లేషణము

సకల ప్రాణులకు చేష్ట (సంజ్ఞా) సూర్యుని వల్లనే గల్గుచున్నదను విషయము। సూర్యమండలమే సృష్టికంతటికి ప్రాణరూపంలో ఉదయించినదని "ప్రాణః ప్రజానాముదయ త్యేషసూర్యః" అని శ్రుతి వర్ణించింది. కావున "సంజ్ఞాశక్తి" సూర్యునకు సహచారిణియైనది.

మనకు ఛాయ (నీడ) కనపడే చోట గూడ వుండేది సూర్య కాంతియే। అయితే అక్కడ సూర్యకిరణాలు గోడ మొదలగునవి యడ్డమగుట చేత సరాసరి ప్రసరింప జాలక వెనుకకు మరలును గాన సంజ్ఞాస్థానంలో ఛాయ వున్నటుల చెప్పబడింది। మేరు పర్వతప్రాంతంలో ప్రసరించే సూర్యకిరణాలను ప్రాణరూపమగు అశ్వమనిరి.

"సంజ్ఞాదేవి బడబా (ఆడగుఱ్ఱము) రూపంలో వెళ్ళినందున అచట అశ్వమునకును అశ్వినికిని సమాగమము గలిగి దాని పరిణామముగ అశ్వినీకుమారులు జన్మించినారనుటచేత" హర్యానాప్రాంత భూమిపై ప్రసరించే సూర్యకాంతి మరొకలావుంటుంది. అశ్వినీనక్షత్రకాంతితో సూర్యకిరణ సమావేశమైనందున అవాతావరణము ఆరోగ్యకారి యగు చున్నదని భావము.

మరుతః

1 "మ్రియన్తేనకదాచిదితి మరుతః" ఎన్నడూ మరణించనివారై నందున మరుత్తులు. వీరు శుక్రజ్యోతి మొదలగు నలభైతొమ్మిది మందని వాయుపురాణం చెప్పింది.

2 మరుత్తులేడుగురు

శ్లో॥ ఆవహః ప్రవహశ్చైవ। సంవహశ్చోద్వహస్తథా।
వివహాఖ్యః పరివహః। పరావహ ఇతిక్రమాత్
సప్తైతే మారుతస్కంధాః। మహర్షిభిరుదాహృతాః

1) ఆవహము 2) ప్రవహము 3) సంవహము 4) ఉద్వహము 5) వివహము 6) పరివహము 7) పరావహము అను మారుతస్కంధముల స్వరూపుడు సూర్యుడే.

మనుః

1 మనువు ఆచరింపదగిన ధర్మమును నిర్ణయించుటలోదిట్ట. శ్రుతి "యద్వైకించమనురవదత్తద్భేషజం" అని వీరి గొప్పతనమును చాటినది. కావుననే శ్రీకృష్ణుడు ఉద్ధవునితో "రాజర్షీణా మహం మనుః" అని సెలవిచ్చిరి.

2 మనువు= మననము జేయువాడు "నాన్యోఽతోఽస్తిమంతా" అను శ్రుతి ప్రమాణం చేత పరమాత్మయే।

వాయుః

1 వాయువు దూషిత వాతావరణాన్ని పవిత్రం చేస్తుంది। కాబట్టి వాయువును గూర్చి— పవనః పవతామస్మి" అతడు నా విభూతియని గీతలో భగవంతుడు సెలవిచ్చెను। భూమిని జలాన్ని వాయువు పరువెత్తుతూ పవిత్రం చేస్తుంది। పవతాః = వేగముగా చలించువానిలో అనియర్థం. భూమిగాని జలముగాని తమ తమ పరిధిలో తాముండి యశుద్ధ వస్తువులను పరిశుద్ధంచేస్తాయి। వాయువు అట్లాకాదు। అంతటా పరువెత్తుతూ పరిశుద్ధంచేస్తుంది। వాయువు శక్తినీవేగాన్నియెదుర్కొనే శక్తియెవ్వరికీ లేదు.

2 వాయువు జ్ఞానము, జ్ఞాపకము జేయుట, "వాగతి,గంధనయోః" పై రెండు సూర్యభగవానుడే।

3 అ) పంచభూతముల నొకటియైన వాయువు.

ఇ) శరీరమందుండే ప్రాణ అపాన వ్యాన ఉదాన సమానముల రూపముగ ఉండేవాయువు. (ప్రాణశక్తి).

ఉ) అంతరిక్షమునందంతట వెలయు వాయుదేవత (మాధ్యమికదేవత)

ఋ) సూత్రాత్మ = సమష్టిప్రాణ స్వరూపుడు సర్వదేవతాత్మయునగు హిరణ్యగర్భుడు

ౠ) ప్రణవ ప్రతిపాద్యము "నమస్తేవాయో। త్వమేవప్రత్యక్షం బ్రహ్మాసి" అను శ్రుతినిబట్టి వేదాంత ప్రసిద్ధము ప్రాణమునకు ప్రాణమగు బ్రహ్మతత్వము। వాయుపదసామర్థ్య మట్టిది. ఈవాయువె సూర్యుడు.

వహ్ని = అగ్ని

వహతిహవ్యమితి వహ్నిః" అగ్నిరూపంతో హవిస్సును మోయువాడు

ప్రజాప్రాణః = సూర్యుడు.

ప్రజానాంప్రాణసహేతుః = ప్రాణులు జీవించుటకు గారణమైన వాడు "కోహ్యేవాన్యాత్కః ప్రాణ్యాత్‌। యదేష ఆకాశ ఆనందో నస్యాత్" ఈయానందరూప పరమాత్మ మన హృదయాకాశంలో లేకపోయినచో యేప్రాణి జీవింపగలదు?

2 ప్రజాః-ప్రాణః అని రెండుపదములుగ గూడ చెప్పవచ్చును.

అ) ప్రజాయంత ఇతిప్రజాః = ప్రకృష్టమైన జననము గలవిగాన ప్రజలు। విభూతి యంతయు ప్రజలని వ్యవహరింప బడును. దేవతలు గూడ ప్రజలే. వారందరు పరమాత్మ శరీర భూతులే।

ఇ) ప్రాణః = ప్రాణము

ప్రాణయతీతి ప్రాణః = జీవింపజేయువాడు పరమాత్మ। ప్రాణమే మనలను జీవింపజేయును. ఈప్రాణవాయువు ఎవరియందాశ్రితమై

యున్నదో వారివల్లనే సర్వము జీవించు చున్నది. గాని యీప్రాణ-అపాన వాయువులచేత జీవించుట లేదని "నప్రాణేన నాపానేన మర్త్యోజీవతి కశ్చన, ఇతరేణ జీవన్తియస్మిన్నేతా ఉపాశ్రితాః,, అని యుపనిషత్తు చెప్పింది. కాన సర్వప్రాణులకు ప్రాణయాత్రా ప్రవర్తకుడు సూర్య భగవానుడే। ఋతుకర్తా = వసంతాదిఋతువులను గల్పించు వాడు సూర్యుడే "సాకం జానాగ్ం సప్తధమాహూరేకజం। షడద్యమా ఋషయో దేవజా ఇతి। తేషా మిష్టాని విహితాని ధామశః। స్థాత్రేరేజన్తే వికృతాని రూపశః। అని సూర్యుడే ఋతుకర్తయని అరుణికీ శ్రుతి వర్ణించింది।

తా॥ కూడ బుట్టిన సూర్యకిరణములలో "సప్తధ" మను యేడవకిరణము ప్రత్యేకముగా బుట్టినదనిరి మిగిలిన యారు కిరణములు కాంతి గలవగుట చేత ఋషులతో సమానములై ఉత్పత్తి చేయలవలెనున్నవి. బ్రహ్మదేవుడు ప్రపంచస్థితి కొరకు వసంతాది ఋతురూపంలో ఆయారు కిరణములకు అభిమత స్థానముల గల్పించి ప్రవర్తింపజేసెను. అనిభావము.

2 ఋతుః- కర్తా; అని రెండు పదములుగా విభజింపవచ్చును।

అ) ఋతువు = అర్యత ఇతి ఋతుః = "ఋగతా" జ్ఞానము. దా। మూలకారణము పరమాత్మయే. ఋతుస్సుదర్శనఃకాలః" అని సహ నామము

ఇ) కర్తా = సకల కర్మలు చేయువాడు. తేనవినా తృణాగ్రమపినచః తీతికృత్వా సర్వభూతాంతః ప్రవేశేన సకలకర్మ కర్తా; వాడులేనిచో గడ్డిపోచయైనను కదలదని తలచి సమస్త ప్రాణులకు లోపల ప్రవేశించుట చేత సకల కర్మలు జేయువారు। "అంతః ప్రవిష్టం కర్తారమేతం" అని అధర్వణ రర్ధయోగాః పధస్పృజతే; సహికర్తా అను శ్రుతులవలన ఆదిత్యుడే సర్వకర్త।

1 ప్రభాకరః = కాంతి నిచ్చువాడు। లేక కాంతి స్వరూపుడు "ప్రభాసూర్యేందుతారాణాం" అనిభాగవతం. భగవంతుని విభూతిగ ప్రభను గూర్చి పేర్కొనెను.

2 ప్రభా = భగవత్ప్రాప్తికి సాధనమైన జ్ఞానము, దానినిచ్చువాడు

శ్లో॥ తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతిపూర్వకం।
దదామి బుద్ధియోగంతం। యేనమాముపయాంతితే॥
అని గీత.

ఏషబ్రహ్మాచ విష్ణుశ్చ। రుద్రఏవహి భాస్కరః।
త్రిమూర్త్యాత్మా త్రిదేవాత్మా। సర్వదేవమయోరవిః।
(సూర్యతాపిన్యుపనిషత్తు)

సూర్యభగవానుడు సర్వదేవమయుడుగా నిరూపించినందున వారిని ఉపాసించుటవలన సమస్త దేవతోపాసనా ఫలము సిద్ధించునని అగస్త్య మహర్షి సెలవిచ్చిరి.

10

శ్లో॥ ఆదిత్య స్సవితా సూర్యః। ఖగః పూషా గభస్తిమాన్
సువర్ణసదృశోభాను। హిరణ్య రేతా దివాకరః॥

వివరణ:-

ఈశ్లోకమునుండి "ఆదిత్యహృదయ స్తోత్రము ప్రారంభము. ఓ స్వామి! నీవాది దేవుడవు గాన నిన్నాదిత్యుడందురు; జగత్తునందు గల ప్రాణులను వారివారి కర్మలందు ప్రవర్తింప జేయుచున్నందున తమను సవితా అందురు। మీకిరణాలు ఎవ్వరు చొరరాని చోట్లకు

చొచ్చుకొనిపోవుచున్నందున మీరు సూర్యుడని ప్రసిద్ధినందితిరి। ఆకాశ మార్గంలో పయనించేవారు గావున ఖగ, నామము మీపట్ల. సార్ధకము ప్రాణులను పోషించే వారు గావున తమను పూషా, అందుకు కిరణాల చేత ప్రకాశించెదరు గాన గభస్తిమంతుడని పిలతురు. బంగారువలె వెలిగెదరుగాన "హిరణ్యరేతా" అనియు పగటిని జేయుదురు గావున దివాకరుడనియు నందురు.

## గూడార్ధ దీపిక.

ఆదిత్యుడు.

1 ఆదితి, కశ్యపులకు, కుమారుడై యవతరించి నందున ఆదిత్యుడు

2 లోకాలను ప్రకాశింప జేయువాడైనందున ఆదిత్యుడందురు "అదిత్యేన వావ సర్వేలోకా మహీయంతే" అని శ్రుతివచనము

3 సమస్త విషయాలను తనవిగాజేసికొని యనుభవించువాడై నందున ఆదిత్యుడని "యస్మాత్సర్వ మాదత్తే తస్మాదాదిత్యః" శ్రుతి చెప్పినది

4 అఖండితమైన భూమి అదితి. ఆమెకు పతియైనందున ఆదిత్యుడు.

5 ప్రాణులకు జీవనహేతువైన ఆయుస్సును: ఆదానము (గ్రహించువాడు) చేయువాడుగావున ఆదిత్యుడందురు. "యోసౌతపన్నుదేతి। ససర్వేషాంభూతానాం ప్రాణానాదాయోదేతి" ఈసూర్యుడుదయించు నప్పుడు సకల భూతములయొక్క ప్రాణాలను గ్రహించుచు ఉదయించుచున్నాడు.

"అసౌయోఽస్తమేతి। ససర్వేషాంభూతానాం ప్రాణానాదాయాస్తమేతి ఇతడు అస్తమించే సమయంలో గూడ సర్వభూతముల ప్రాణములను స్వీకరించి యస్తమించు చున్నాడు। అని యారణ్యకశ్రుతి తెలిపింది.

ఈఆదిత్యుని స్వభావమును| అధ్వర్యు బ్రాహ్మణం, ఇంకను

స్పష్టంగాచెప్పింది. "అష్టౌపుత్రాసో అదితేః। యేజాతాస్తన్వఃపరి। దేవాన్ ఉపప్రైత్సప్తభిః ఉపప్రైత్పూర్వ్యంయుగం। ప్రజాయైమృత్యవేతత్। పునర్మార్తాండమాభరత్। (ఋగ్వేదం 10-12-8-9.) పై మంత్రమే యజురారణ్యకంలో చివరివాక్యంమాత్రం" పరామార్తాండభరత్" అని కొంచెం మార్పుగలిగి యున్నది.

తా॥ అదితికి ఎనిమిదిమంది కుమారులుగలరట। వారుక్రమంగా మిత్రుడు, ధాత, అర్యముడు, అంశువు, భగుడు, వివస్వంతుడు, ఆదిత్యుడు అనువారు. ఈఆదిత్యునకు మార్తాండుడను పేరు గూడవున్నది. అదితి ఈయెనిమిదవ పుత్రుని యాకాశానికి విసరి వేసినదట। వారుమరల ప్రాణుల జననమరణముల నిమిత్తము క్రిందికి తీసికొనిరాబడిరట। ఈమంత్రమును బట్టి ప్రాణుల జననమరణములు సూర్యోదయాస్తమయముల కధీనములై యున్నటుల తెలియు చున్నది।

సవితా

1 రశ్మిభిః పర్జన్యాది ప్రవృత్యా తత్తదన్నాది స్రష్టా। సకల ప్రాణుల దుఃఖాన్ని తొలగించే వర్షమును గురిపించి ఆయాప్రాణులకవసరమైన యన్నాదులను సృషించుటచేత సవిత।

2 సూతే సకలశ్రేయాంసి ధ్యాతౄణా మసౌసవితా ధ్యానించు వారి సకల శ్రేయస్సులనిచ్చెవారైనందున సవితా।

"ఉద్యన్తమస్తం యంత మాదిత్య మభిధ్యాయన్కుర్వన్బ్రాహ్మణ్ విద్వాన్సకలం భద్రమశ్నుతేః అనుమంత్రము సకలశ్రేయస్సుల నిచ్చువాడు సవిత, అని వర్ణించినది.

3 సూతే జగదితి సవితా = జగత్తును ప్రసవించువాడు.

శ్లో॥ సవితా సర్వభావానాం। సర్వభావాంశ్చసూయతే।
సవనాత్ప్రేరణాచ్చైవ। సవితా తేనచోచ్యతే॥
(బృహదారణ్య యాజ్ఞవల్క్యము)

4 సమస్త బుద్ధివృత్తులను ధర్మకార్యముల యందు ప్రవర్తింప జేయువాడైనందున "సవితా" అందురు

శ్లో॥ యోదేవస్సవితాస్మాకం ధియోధర్మాదిగోచరాః।
ప్రేరయేత్తస్య యద్భర్గ స్తద్వరేణ్య ముపాస్మహే॥
ఈసవితను మేము ప్రార్థించువ దేమనగ?
"విశ్వానిదేవ సవితర్దురితాని పరాసువ యద్భద్రంతన్న ఆసువ॥

సృష్టిస్థితి సంహారకుడైన ఓసవితృదేవ! తాము మాయొక్క ఆధ్యాత్మిక-ఆదిభౌతిక- ఆధి దైవికములైన దురితములను (పాపములను) మానుండి చాలదూరము తరిమి వేయుము. నలువైపులనుండి శ్రేయస్సులను కల్యాణములను దెచ్చియిమ్ము

"సవితా పశ్చాతాత్సవితొతా పురస్తాత్సవితోత్తరాత్తా త్సవితాధరాత్తాత్। సవితానస్సువతు సర్వతాతిం సవితానో రాసతాందీర్ఘమాయుః
(మహాసౌరం)

సవితృదేవత మాకు ముందు వెనుకల, పైన, క్రింద, అన్నిచోట్ల నుండి అన్నిసుఖములను ఆయుర్దాయమును ఇచ్చుగాక అని ప్రార్థించుచున్నాము"

1 సూర్యః = సూర్యుడు. సువతి = ప్రేరయతి జనాన్ కర్మణీతి సూర్యః సమస్త ప్రజలను తమతమకర్మలందు ప్రవర్తింప జేయువాడు

గావున సూర్యుడు "అంతః ప్రవిష్టశ్శాస్తా జనానాగ్ం సర్వాత్మా" జగత్తునకంతర్యామిగానుండి యెల్లరను నియమించుచున్నాడు

2 సరతి = గచ్ఛతి ఆకాశే ఇతి సూర్యః। ఆకాశంలో ప్రయాణం చేయువాడైనందున సూర్యుడు

3 రశ్మిభిః ప్రాణానాం రసానాంచ స్వీకరణా త్సూర్యః రశ్మిలచే ప్రాణములను జలమును గూడ స్వీకరించు వాడైనందున సూర్యుడు

శ్లో॥ సూర్యాత్ప్రసూయతే సర్వం। తత్రైవ ప్రలీయతే।
భావాభావౌహి భావానాం। ఆదిత్యాన్నిస్సృతౌ పురా॥
(సాంబపురాణం)

4 శౌనకమహర్షి – బృహద్దేవతలో

శ్లో॥ సూర్యాద్భవన్తి భూతాని। సూర్యేణపాలితానితు
సూర్యేలయం ప్రాప్నువన్తి। యస్సూర్యస్సోహ మేవచ॥

భావం:– సమస్త ప్రాణులు సూర్యుని నుండియే సృష్టింపబడుచున్నవి. వారిచేతనే పాలింపబడుచున్నవి. వారియందే లయించుచున్నవి ఆసూర్యుడే నేనని సెలవిచ్చిరి. ఋగ్వేద ప్రతిపాద్యమగు సూర్యస్వరూపమును తెలిసికొందము "చిత్రం దేవానా ముదగా దనీకం చక్షుర్మిత్రస్యవరుణస్యాగ్నేః ఆప్రాద్యావాపృథివీ అంతరిక్షం సూర్యఆత్మాజగతస్తస్థుషశ్చ॥

"దేవానా మనీకం చిత్రముదగాత్" తమయందు రక్తశ్వేతాది వివిధవర్ణములు నిగూఢముగా గలిగి దీప్తిమంతములై లోకముల ప్రకాశింపజేయు కిరణ సమూహము మహాసైన్యమువలె చిత్రముగా నుదయించినదని మండల పరమైన యర్థము.

సూర్యుని (పరమాత్మ) నుండి వివిధశక్తి సంపన్నమై లోకయాత్రానిర్వహణ సామర్థ్యముగల దేవతానీకము (దేవసేన) చిత్రముగా నుదయించిందని పరమాత్మ పరమగు అర్థము.

"మిత్రస్య, వరుణస్య, ఆగ్నేః, చక్షుః ఆప్రాద్యావాపృథివీ అంతరిక్షం" ఈ సూర్యుడు మిత్ర—వరుణ—అగ్నులకు చక్షువని చెప్పబడినాడు ఈ "మిత్రావరుణాగ్ని" పదములు, ద్యావా పృథివీ అంతరిక్షగత దేవతాపరములు। ఆముగ్గురు దేవతలకు సూర్యుడు చక్షువు. అనగా తదుపలక్షితమైన మూడులోకములకు చక్షువు ప్రకాశకుడు. లేక ప్రకాశకమగు చక్షురింద్రియస్థానీయుడు. అని భావము। అగ్నివాయు సూర్యులు పృథివి అంతరిక్ష ద్యులోకపాలకులగుట ఋగ్వేదమున ప్రసిద్ధము సూర్యోనో దివస్పాతువాతో అంతరిక్షాత్।అగ్నిర్నఃపార్థివేభ్యః॥

"ఆప్రాద్యావాపృథివీ అంతరిక్షం సూర్యఆత్మాజగతస్తస్థుషశ్చ। తనతేజస్సుతో ముల్లోకములను వ్యాపించి అంతర్యామియై సర్వ ప్రేరకుడగుచు స్థావర జంగమాత్మకమగు జగత్తున కాత్మయై, స్వరూపభూతుడై పరమాత్మయై, మండలాంతర్గత పురుషుడు విరాజిల్లుచున్నాడు.

కావున సూర్యుడనగా:

1 సూర్యమండలము 2 మండలాభిమానియగు సూర్యదేవత। (ద్యుస్థానదేవత) 3 మండలాంతర్గతుడగు ఆదిత్యుడు (ఈశ్వరుడు) 4 శరీరపురుషాంతర్గతుడు, అశరీరుడు, నగు ప్రజ్ఞాత్మ (జీవుడు) 5 జీవేశ్వరాత్మకమగు ఒకేతత్త్వము. సూర్యపదసామర్థ్యమట్టిది.

ఇటుల ఆదిత్యః—సవితా—సూర్యః అనుమూడుపదముల విశిష్టతను దెలిసి కుంటిమి। పై మూడునామముల సమీకరణమీ సూర్యసిద్ధాంత శ్లోకమున గలదు.

శ్లో॥ ఆదిత్యోహ్యాదిభూతత్వాl ప్రసూత్యాసూర్య ఉచ్యతే।
పరంజ్యోతిస్తమఃపారే। సూర్యోయంసవితోచ్యతే॥

భావం॥ సూర్యుడు జగత్తున కాదికారణముగాన ఆదిత్యుడనిరి. జగత్తును ప్రసవించే సూర్యుడు తమోమండలము దాటి వెలిగే పరమజ్యోతిస్సై నందున సవితా అనబడిరి। ఇటుల "ఆదిత్యస్సవితా సూర్యః" అను పదముల ప్రయోజనమును తెలిసికుంటిమి।

ఖగః = ఖేగచ్ఛతీతిఖగః

లోకోపకారామునకై ఆకాశంలోసంచరించేవాడుగాన ఖగుడనిపేరు ప్రపంచమనే యుద్యానవనానికి సూర్యభగవానుడు తోటమాలి. వీరుసముద్ర జలమును తన కిరణాలతో ఆకాశమునకుజేచి. దానిని కావలసిన చోట్లకాయన సరఫరాచేయుదురు. లోకమున కింతటి యుపకారము జేయుచున్నను అతడెన్నడు గర్వించడు. విశ్రాంతి ననలేకోరడు ఎంతపని చేసినను వారికది బరువుగాదు వారిది సహజకర్మ. వారు నియమముననుసరించి బయలుదేరి తనయాస్తి పాస్తులతో లోకమునకు ఆహారమును ఆరోగ్యమును ఆనందమును యిచ్చుచున్నాడు.

2 ఖం= పరమాకాశం: గచ్ఛతి= ఆధ్యాస్తేఇతిఖగః।

పరమాకాశమనగా హృదయాకాశము। "యోఅస్యాధ్యక్షః- పరమే వ్యోమన్" ఆహృదయాకాశంలో వుండేపరమాత్మ అనియీశ్రుతితెలిపింది

పూషా

పుష్ణాతి జగదితి పూషా। జగత్తును పోషించువాడుగాన యితనిని "పూషా" అందురు.

ఆశ్వయుజమాసాధిపతికి "పూషా" అనిపేరు. పూషా = అనగా పోషకుడు. ఈమాసంలో సూర్యుడు సస్యమును పోషించును గావున పూషుడయినాడు. లేక లెక్కించువాడు

వీరాకాశంలో అందరకు కనపడుచు సంచరింతురు। వారి యీ ప్రత్యేకతను నీతిశతకం "సదాపాంథః పూషా గగనపరిమాణం కలయతి" అని పేర్కొన్నది.

గభస్తిమాన్ =

గాంభాస్తి = ప్రకాశయతీతి గభస్తిః తద్వాన్।
భూమిని ప్రకాశింప జేయువాడైనందున గభస్తి। అదికలవాడనితాత్పర్యము గభస్తిమాన్.

గాం= దిశం, వ్యాప్య, భా స్తి=ప్రకాశయతీతిగభస్తిః। తథాచ. గభస్తిః= సర్వవ్యాపినీలక్ష్మీః। తద్వాన్ = లక్ష్మీనిత్యయుక్త ఇత్యర్థః. లక్ష్మ్యాస్సర్వ వ్యాపిత్వం ప్రతి–

శ్లో॥ యథాసర్వగతో విష్ణుః తథైవేయంద్విజోత్తమ॥

ఇతి పరాశరస్మరణాత్ సిద్ధం।

గభస్తి = సర్వవ్యాపినియైనలక్ష్మీ. ఆమెతో నిత్యసంబంధముగలవాడు, గభస్తిమంతుడు. శ్రీమహా విష్ణువు: విష్ణుమూర్తి వలెనే లక్ష్మీదేవికూడ సర్వవ్యాపినియని పరాశరమహర్షిపలికిరి. దిక్కులను వెలిగింపజేసెడి కాంతియనెడి లక్ష్మీగలవాడు సూర్యుడైనందున వారిని గభస్తిమాన్ అనిరి.
సువర్ణసదృశః = బంగారముతో సమానమైన వాడు

శ్లో॥ ధ్యేయస్సదా సవితృమండల మధ్యవర్తీ
నారాయణ స్సరసి జాసన సన్నివిష్టః
కేయూరవాన్మ కరకుండలవాన్ కిరీటీ
హారీ। హిరణ్మయవపుః ధృత శంఖ చక్రః॥

భవిష్యపురాణం। ఆదిత్యహృదయం 173 శ్లో

ఈశ్లోకంలో హిరణ్మయవపుః అనిసూర్యనారాయాణమూర్తి బంగారు శరీరముగలవాడుగ తెలుపబడిరి కావున సువర్ణసదృశులని చెప్పబడిరి.

2 "ఆత్మలాభాన్నపరంవిద్యతే" మానవునకు ఆత్మలాభమునకంటే మరొకగొప్పలాభం లేదని యుపనిషద్వాక్యమున్నందున పరమాత్మను బొందినవాడు సువర్ణనిధిని పొందినట్లు సంతసించునుగావున పరమాత్మ సువర్ణసదృశుడు;

"సుపర్ణసదృశః" అనిపాఠాంతరమున్నందున

సుపర్ణసదృశః

1 సుపర్ణం విప్రాఃకవయో వచోభిరేకం సంతం బహుధాకల్పయన్తి
ఋ॥ 10.114-5

మేధావులగు కవులు వివిధస్తుతి లక్షణములగు వాక్కులతో ఒకేపరమాత్మను బహుప్రకారముల గల్పించుచున్నారు అని యర్థము.

2 ద్వాసుపర్ణాసయుజాసఖాయా, సమానంవృక్షం పరిషస్వజాతే; అనుశ్రుతి.ఈశ్వరపక్షి, జీవ పక్షులను వానిలో పరమాత్మను ఈశ్వరపక్షిగా వర్ణించింది.

3 శోభనౌ, పర్ణౌ = క్షౌయస్యసః సుపర్ణః గరుత్మంతుడు. ఈసుపర్ణుడు వేదరాశి.

"సుపర్ణోసి గరుత్మాన్ త్రివృత్తే శిరోగాయత్రం చక్షుః, స్తోమ ఆత్మా, సామతేతనూ ర్వామదేవ్యం బృహద్రథంతరేపక్షౌ, యజ్ఞా యజ్ఞయం పుచ్ఛం, ఛందాగ్ంస్యంగాని, ధిష్ణియాఃశఫా, యజూగ్ంషి సామ, సుపర్ణోసి గరుత్మాన్ దివంగచ్ఛసువఃపీత తై. సం. 4-1-105

ఈశ్రుతివాక్యములు అగ్నిని ఛందోమయుడగు సుపర్ణునిగ కీర్తించుచున్నవి. ఈగరుడుడు వేదరాశియని హరివంశముగూడ నిట్లు చెప్పుచున్నది: తతస్సఖగవాంస్తార్క్ష్యో వేదరాశిరితిస్మృతః" (హరివంశము 76-2) ఈగరుత్మంతుడు తానేనని కృష్ణపరమాత్మ", సుపర్ణోహంపతత్రిణాం (భాగ. 16అ.) "వైనతేయశ్చ పక్షిణాం" గీత 10అ. 30 శ్లో. కాన సూర్యుడు సుపర్ణసదృశుడు. భానుః = భాతీతి భానుః ప్రకాశించేవాడైనందున భానుమూర్తి. హిరణ్యరేతాః = ఈనాల్గవపాదం తొమ్మిదక్షరములు. ఋషి ప్రోక్తముగాన సాధువు.

1 హిరణ్యం రేతః యస్యసః హిరణ్యరేతాః

శ్లో॥ అపఏవససర్జాదౌ। తాసువీర్యముపాసృజత్
తదండ మభవద్ధైమం సహస్రాంశుసమప్రభం॥
అనిమనువు.

పరమాత్మ, తొల్త జలములను సృజించి వానిలో బంగారమువంటి రేతస్సును విసర్జింపగా అది సూర్యుని వలెప్రకాశించె బంగారుగుడ్డుగ అయ్యెను; కాన స్వర్ణమయమైన రేతస్సుగలపరమాత్మ సూర్యుడు.

2 హిరణ్మయము = తేజః పరిజ్ఞానరూపము। అదే జగదుత్పత్తికి మూలము అది కలవాడు గాన హిరణ్యరేతాః అని పేరు.

దివాకరః

పగటిని జేయువాడు: సూర్యునియొక్క ప్రకాశము అగ్నియొక్క ఉష్ణము పరస్పరము గలియుటచేత రాత్రింబవళ్లేర్పడు చున్నవని

శ్లో॥ ప్రకాశ్యంచ తథౌష్ణ్యంచ। సూర్యాగ్నోర్న్యచతేజసి
పరస్పరాను ప్రవేశాత్। అఖేయేతే దివానిశం॥

(సాంబపురాణం) తెలుపుచున్నది.

జగత్తునకు రాత్రింబవళ్లేర్పడే విధానము

అగ్నియొక్క ఉష్ణతయందు సూర్యతేజస్సు ప్రవేశించుటచేత రాత్రియగు చున్నది. "దినాంతేనిహితం తేజస్సవిత్రేవహుతాశనః" అని కాళిదాస మహాకవి_ రఘు మహారాజు తనతండ్రియైన దిలీపమహారాజు తనకిచ్చిన రాజ్యమునలంకరించి, సాయంకాలము సూర్యునిచే నుంచబడిన తేజస్సును బొందినయగ్నివలె మిక్కిలి ప్రకాశించెను, అనివర్ణించెను.

విష్ణుపురాణం గూడ

శ్లో॥ ప్రభావివస్వతొ రాత్రౌ। వస్తంగచ్ఛతి భాస్కరే।
విశత్యగ్నిమతో రాత్రౌ। వహ్నిర్దూరాత్ప్రకాశతే॥

(వి పు.2-8-24)

సూర్యుడస్తమించేటప్పుడు వారిప్రభ అగ్నిలో ప్రవేశించు చున్నందున రాత్రులందు అగ్ని దూరంనుండే కనబడును.

"అగ్నింవావాదిత్య స్సాయంప్రవిశతి। తస్మాదగ్నిర్దూరాన్న క్తందదృశే। ఉభేహితేజసీ సంపద్యేతే। తై.బ్రా. 2అ.1. ప్ర

సాయంత్రం ఆయినంతనే ఆదిత్యుడు అగ్నియందు ప్రవేశించుట

చేత అగ్నిరాత్రులందు బహుదూరము కనపడును. ఇటుల ఉభయ తేజస్సులు పరస్పరము గలియుచున్నవని భావం।

ఇక పగలేర్పడు విధానము— సూర్యతేజస్సుతో అగ్నియొక్క ఉష్ణముగలియుటచేత పగలేర్పడు చున్నది

ఉద్యన్తంవావాదిత్యమగ్నిరను సమారోహతి। తస్మాద్ధూమ ఏవాగ్నేర్దివాదదృశే। అందుచేత పగలు పొగమాత్రమే కనపడుచున్నది అని భావము. ఇటుల దివాకరుడను నామము సార్ధకము॥

11

శ్లో॥ హరిదశ్వస్సహస్రార్చిః స్సప్తసప్తిర్మరీచిమాన్।
తిమిరోన్మధనశ్శంభుః। త్వష్టా మార్తాండ అంశుమాన్॥

వివరణ:—

ఆకుపచ్చని గుఱ్ఱాలపై వేవెలుగులదొర రాజరవితో విహరిస్తాడట. ఆయన గుఱ్ఱములకు సప్తి అనిపేరు ఏడుగుఱ్ఱాలపై విహరిస్తాడు గావున సప్తసప్తియైనాడు. సూర్యకాంతిలో ఏడువన్నెలిమిడి యున్నాయి। భూర్భువస్సువరాది సప్త లోకాలలో సూర్యకాంతి ప్రసరిస్తుంది। మాఘశుద్ధ సప్తమి సూర్యుడవతరించినరోజు. నేడు సూర్యకాంతి సర్వలోక పర్వంగా ప్రజ్వలిస్తుంది. నేడు సూర్యభగవానుడు లోకరక్షణకై రథము నెక్కినందున రథసప్తమియైనది. ఈపర్వం సూర్యగ్రహణముతో సమానమని.

శ్లో॥ సూర్యగ్రహణతుల్యాతు శుక్లామాఘస్యసప్తమీ।
అరుణోదయవేళాయాం। తత్రస్నానం మహాఫలం॥

(స్మృతిచంద్రిక)

మరీచులనగా చక్రము మొదలగు ఆయుధములు అవి కలిగి యున్నందున నీతడు మరీచి మంతుడైనాడు.

సూర్యునిపేరు వింటే చీకటి ఛిన్నాభిన్నాలై పోతుందట। సూర్య భక్తుడొకడు వారిని అష్టోత్తరశతనామములతో బూజించుచు "తిమిరార యేననమః" అని యొకనామమును బలికెనట: అదివినిన సూర్యభగవానుడు -ఔర। ఇతడు నన్ను చీకటికి శత్రువనుచు పూజించినాడే। ఆచీకటియను శత్రువు ఎట్లుండునో ఎక్కడ నుండునో ఒకసారి చూచియుండుట మంచిదని రథమెక్కి-ప్రయాణం సాగించినాడు కాని నేటికిని వారికా శత్రువు కానరాలేదట। ఇటుల చీకటిని జిలికి వెలుతురునిచ్చి సుఖింప జేయువాడైనందున మహర్షి వారిని "శంభువు" అనిరి. సూర్యుడు త్వష్టః (అనగా శిల్పి) వడ్రంగి కొయ్యను దెచ్చి చెక్కి తన కల్పనా చాతుర్యము వలన అందముగ మలచినటుల యీతడును ప్రాణుల కవసరమైన లావణ్యాన్ని చేకూరుస్తాడు. ఇంతేగాదు దేశకాలాలను నియమించి రాత్రింబవళ్లను, తిధి-నక్షత్రములను, మాస, ఋతు, అయన సంవత్సరములను కల్పించే శిల్పికాన సూర్యుడు నిజమైనత్వష్ట। బ్రహ్మాండము లయమైన మరల సృష్టిప్రారంభకాలంలో బ్రహ్మచే సృష్టింప బడినందున మార్తాండు డందురు. వేడికిరణములు గలవాడైనందున అంశుమంతుడనిరి.

## గూఢార్ధ దీపిక

హరిదశ్వుడు

1 ఆకుపచ్చనిరంగు గుఱ్ఱాలు గలవాడు

2 హరిత్ = అనగా దిక్కు। హరితః. అశ్నోతి = వ్యాప్నోతి ఇతి హరిదశ్వః = దిక్కులను వ్యాపించువాడు।

సహస్రార్చిః

1 సహస్రార్చిః = వేయికిరణాలు గలవాడు. (లేక)

2 సహస్రము= అనంతము. అర్చ్యత ఇత్యర్చిః = పూజ్యములైన మంగళ గుణములు గలవాడు। (అనంతకల్యాణగుణములు గలవాడు)

3 సహస్రాణ్యనంతాని, అర్చీంషి = జ్ఞానాని యస్యసః = సహస్రార్చిః అనంతములైన జ్ఞానములు గలవాడు

సప్తసప్తిః

1 ఏడు గుఱ్ఱములు గలవాడు

శ్లో॥ జయోఽజయశ్చవిజయో। జితప్రాణో జితశ్రమః
మనోజవో జితక్రోధో। వాజిన, స్సప్తకీర్తితాః॥
(ఆదిత్యహృదయము, భవిష్యపురాణం)

జయము, అజయము, విజయము, జితప్రాణము, జితశ్రమము, మనోజవము, జితక్రోధము, అనివాని పేర్లు. త్రియీమయుడైన సూర్యభగవానుడు వైదికములైన సప్త ఛందస్సులను రథము గావించుకొని యీ ఛందోరథ పీఠముపై సరసిజాసనమున గూర్చుండి సమస్త లోకాలను బాలింతురట।

భక్తుల అనుసంధానం నిమిత్తం భగవతియగు వేదమాత యీఛందో రథమును రూపకాలంకరముతో తెలిపియుండుట చిత్తగింపుడు

"సో౽బ్రవీత్ప్రజాపతిః। ఛదాగ్ంసి రథోమేభవత। యుష్మాభి రహమేత ముధ్వానమను సంచరాణీతి। తస్యగాయత్రీచ – జగతీచ, పక్షావభవతాం। ఉష్ణిక్చ. త్రిష్టుప్చపత్రిష్టౌ। అనుష్టుప్చ, పంక్తిశ్చధుర్యౌ।

బృహత్యేవోద్ధిరభవత్। సఏతంఛందోరథమాస్థాయ। ఏతమధ్వానమను సమచరత్॥

తా॥ సూర్యరూప ప్రజాపతి యాకాశమార్గమున ప్రయాణము చేయ దలచినవారై గాయత్రి మొదలగు సప్తఛందస్సులను గాంచి యిటుల పలికెను - "ఓ ఛందస్సులారా। మీరు నానిమిత్తమై రథరూపమును ధరింపుడు। దానిపై నేనీయాకాశ మార్గమున నిత్యము సంచరింపగలను అనిరి. అదివిని గాయత్రీ - జగతీ - ఛందస్సులు రెండును రథచక్రము లైనవి. ఉష్ణిక్కు - త్రిష్టుప్పు ఛందస్సులు రెండును పాదమైన కఱ్ఱలైనవి. అనుష్టుప్పు - పంక్తి ఛందస్సులు రెండును అశ్వములైనవి బృహతీ — ఛందస్సు రథమధ్యలో కూర్చునే పీఠమయ్యెను సూర్యుడా ఛందోరథముపై నిత్యము గగన మార్గంలో సంచరించు చున్నారు।

సప్తసప్తి = ఏడు ముఖ్యములైన కిరణములు గలవాడు।

2 అవి సుషుమ్నా, సురాదనా, ఉదన్వసు- సంయద్వసు, విశ్వకర్మా, ఉదావసు - విశ్వవ్యచా, అస్వరాట్, హరికేశ అనునవి

అ) "సుషుమ్నా" అనుకిరణము వేయికిరణములతో సమానమైన కాంతి గలది. ఇది కృష్ణపక్షంలో చంద్రకళలపై నియంత్రణ గలిగి యుండును. శుక్లపక్షంలో చంద్రికళలనుగావించుచూ చంద్రుని రూప సంపన్నునిగ జేయును।

ఈ రహస్యమును "నిరుక్తమను గ్రంథమున" యాస్కమహర్షి యిటుల తెలిపియున్నారు

"సుషుమ్న స్సూర్యరశ్మిశ్చంద్రమా గంధర్వ ఇత్యపినిగమో భవతి। సోఽపిగౌరుచ్యతే। సర్వేఽపిరశ్మయోగావఉచ్యన్తే॥

భావము_ "సుషుమ్నా" అను పేరుగల సూర్యకిరణము చంద్రుని రూపసంపన్నునిగ జేయుచున్నదనిరి.

సూర్యుని యాకిరణంచేత రూపసంపన్నుడైన చంద్రుడు లోకమునకు అమృతమునిచ్చును. ఆపూర్ణచంద్రుడొసగిన యమృతముచే ప్రాణులు సుఖింతురు।

ఇ) "సురాదనా" ఈకిరణమునుండి చంద్రుడావిర్భవించెను. చంద్రుని శీతకిరణములుగూడ సూర్యరశ్మలే। వీటిచేత చంద్రుడమృతాన్ని రక్షిస్తాడు

ఉ) "ఉదన్వసు" అనుకిరణము నుండి "కుజ" గ్రహమావిర్భవించెను ఈకుజుడు ప్రాణులందరిలో రక్తప్రసారమును గలుగ జేయును: ఈ సూర్యరశ్మి ప్రాణులను రక్తదోషములనుండి రక్షించి వారికి ఆరోగ్యము, తేజస్సు, ఐశ్వర్యములను వృద్ధిజేయును.

ఋ) "విశ్వకర్మా" అనుకిరణము, బుధగ్రహాన్ని నిర్మిస్తుంది. ఈతడు ప్రాణిమాత్రునకు శుభమునిచ్చును। ఈరశ్మి మానవుల మానసికాందోళనను దొలగించి శాంతిని ప్రసాదించును.

ౠ) "ఉదావసు" ఈరశ్మి బృహస్పతి గ్రహాన్ని నిర్మించింది. ఈ గ్రహము ప్రాణిమాత్రునకు భోగ_మోక్షములు ప్రసాదించును। గురువుయొక్క ఆనుకూల - ప్రతికూలాలనుబట్టి మానవుని యుత్థానపతనములు జరుగుచున్నవి. ఈరశ్మిని సేవించుటచేత ప్రతికూల వాతావరణము దొలగి యానుకూల్యము లభించును.

ఎ) "విశ్వవ్యచా" అనుకిరణమునుండి శుక్ర - శనులు ఆవిర్భవించిరి వీరిలో శుక్రగ్రహము వీర్యమునకధిష్ఠానము. మానవుని జీవనము

శుక్రుని వల్లనే యేర్పడును శనిగ్రహము మృత్యువున కధిష్ఠానము. మానవుని జీవనము-మరణము ఈరశ్మివల్లనే జరుగు చుండును కాన ఈరశ్మిని సేవించుటచేత పూర్ణాయువుగల్గును.

ఐ) "హరికేశ" అను రశ్మివలన నక్షత్రము లావిర్భవించినవి। ఈ నక్షత్రములు, ప్రాణులశరీరములనుండి బలము, వీర్యము, తేజస్సు క్షరణము (స్రవించుట) గాకుండ రక్షించుచున్నందున నక్షత్రములైనవి (సాంబపురాణం)

4 సప్తసప్తి = ఏడుగురు భృత్యులు గలవాడు

"అథపురుషస్సప్తపురుషః" అరుణం సూర్యుడను పురుషునకు ఏడుగురు భృత్యులు గలరు। వారు - నక్షత్రములు, మాసములు, అర్ధమాసములు, ఋతువులు, సంవత్సరము, పగలు, రాత్రి అనువారలు భృత్యులు గలవారు గాన సూర్యుడు సప్తసప్తి"

5 సప్తసప్తి

సప్తప్రాణానాం= ఇంద్రియాణాం ప్రవృత్తిః యస్మాత్సః సప్తసప్తిః "సప్తశీర్షణ్యాః ప్రాణాః" అను శ్రుత్యనుసారము మనశిరస్సునందు గల ప్రాణములు (అనగా ఇంద్రియములు) ఏడు। అవి రెండు నేత్రములు నాసికలు రెండు కర్ణములు రెండు ముఖము ఒక్కటి అను యేడింద్రియములే సప్తప్రాణములు। వీనికి ప్రవృత్తిని గలిగించు సూర్యభగవానుడు సప్తసప్తి.

6 సప్తసప్తిః

సప్తనామాసప్తిః= అశ్వః= వాహనం యస్యసః సప్తసప్తిః సప్త అను పేరు గల గుఱ్ఱము వాహనముగా గలవాడు గావున సప్తసప్తిః

"ఏకోఅశ్వోవహతి సప్తనామా" అను శ్రుతియిందులకు ప్రమాణము.

ఈ నామము కలియుగాంతమున గుఱ్ఱము నెక్కి విహరింపగల కల్క్యవతారమును తెలుపు చున్నది.

7 సప్తసప్తి

సూర్యకాంతిలో ఏడువన్నెలిమిడివున్నాయని వివరణలో తెలిసి కొని యుంటిమి. "చిత్రందేవానాముదగాదనీకం" అను మంత్రము "దేవానామనీకం చిత్రముదగాత్" తమయందు రక్తశ్వేతాది వివిధ వర్ణములు నిగూఢముగా గలిగి దీప్తిమంతములై లోకముల బ్రకాశింప జేయు కిరణసముదాయము మహాసైన్యమువలె నొక్కమారుగ చిత్రముగ నుదయించినది అని వర్ణించింది.

అవి. ఎఱుపు, నీలము, పసుపుపచ్చ, ఆకుపచ్చ, నారింజ, తెలుపు, గులాబీ అనునవి. ఈసప్తవర్ణములే సూర్యుని సప్తాశ్వములు. కాన వారిని "సప్తసప్తి" యందురు. ఈయేడు వన్నెలు వర్షాకాలంలో మేఘములందు మనకు గన్పించును. అరంగులనే మనము ఇంద్ర ధనస్సు అనుచున్నాము. దానికా పేరు యెటుల వచ్చినది. అరుణికీ శ్రుతి యిటుల వర్ణించింది.

"దివ్యస్యైకాధనురార్త్నిః। పృథివ్యామపరాశ్రితా। తస్యేం ద్రోవ క్రిమిరూపేణ। ధనుర్జ్యా మచ్ఛినత్స్వయం। తదింద్ర ధనురిత్యజ్యం। అభ్రవర్ణేషు చక్షతే॥

భావము_ "అరుణకేతుకము" అను అగ్నియొక్క ధనస్సు పైభాగము ఆకాశంలోను, క్రింది భాగము భూమిమీద నుండుటచేత దానిని జూచి భయమందిన యింద్రుడు చెదపురుగు రూపమును ధరించి యా

వింటినారిని స్వయముగ ఛేదించెను. ఆధనస్సే వర్షాకాలంలో మేఘములందు ప్రత్యక్షంగా కనపడుచున్నది. దానిని యింద్రధనస్సందురు అని తెలిపింది.

ప్రాతఃకాలమున స్నానముజేసి సూర్యభగవానున కర్ఘ్యమివ్వ వలయునని విధియున్నందున మనమేదైన జలాశయంలో స్నానము జేసి సూర్యునికెదురుగ నిలబడి యర్ఘ్యమిచ్చెదము. అప్పుడా జలధార మీదుగ ప్రసరించే సూర్యకిరణముల ప్రభావము మనశరీరముపై ప్రసరించుచున్నది.

అందువలన శరీరంలోని రోగకరములైన క్రిములు నశించుచున్నవి మనశరీరము ప్రాణశక్తి సంపన్నమగును ఈలాభమునుగురించి.

శ్లో॥ అర్ఘ్యదాన మిదంపుణ్యం పుసామారోగ్యవర్ధనం॥

అనుశ్లోకము తెలియజేయుచున్నది సూర్యునియందు నిగూఢంగా వుండే వివిధ వర్ణములు సమస్తరోగహరములని, వేదవిజ్ఞానమును బట్టి తెలియుచున్నది। మంత్రం" "అను సూర్యముదయతాం హృద్ద్యోతో హరిమాచతే।గోరోహితస్యవర్ణేన తేనత్వాపరిదధ్మసి॥ ( అధర్వణం 1-22
భావార్థము:_ తేహరిమా = నీయొక్క పచ్చదనము (పాండువు_కామిలా) అటులనే హృద్ద్యోతః = గుండెమంట ( హృదభురోగము ) సూర్యమను = సూర్యుని యానుకూల్యము వలన (సేవనవలన) ఉదయతాం = ఉత్ + అయతాం = ఉదయతాం ≡ ఎగిరిపోవలయును।, గోః = కిరణములయొక్క, వర్ణేన = రంగుచేత, త్వా = నిన్ను. పరిదధ్మసి= అంతట ధారణచేయుచున్నాము

భావము_ పాండురోగము హృదయరోగము కలిగినప్పుడు సూర్యోదయ కాలమందు వారియెఱ్ఱనికిరణ కాంతిని సేవించుట వలన ఆరోగ్యము గల్గుచున్నది.

శ్లో॥ యారోహిణీర్దేవత్యా గావోయా ఉతరోహిణీః।
రూపంరూపం వయోవయ స్తాభిష్ట్వాపరిదధ్మసి॥
(ఆధర్వణం)

భావం— ఎఱుపురంగుగల సూర్యకిరణాలను సేవించుచు ఎఱ్ఱని యావు పాలు ద్రావుచుండిన యెడల ఆయుష్యము, రూపము, ఆరోగ్యములభిం చును ఎఱుపురంగు సూర్యునికి సహజము. గావున రక్తవర్ణం, రక్తగంధం, రక్తపుష్పం, రక్తమాల్యాంబరధరః" అని సూర్యగ్రహారాధనలో తెలుపబడినది.

హరిదశ్వః, అని యీశ్లోకము ప్రారంభము

ఆకుపచ్చని గుఱ్ఱములు గలవాడు సూర్యుడని భావము. ఈరంగు రోగమును దొలగించు చున్నదని "తృచ" అను సూర్యనమస్కార మంత్రము తెలుపు చున్నది. మంత్రం, "హృద్రోగంమమసూర్య। హరిమాణంచనాశయ। శుకేషుమేహరిమాణం। రోపణాకాసుదధ్మసి। అధోహారిద్రవేషుమే। హరిమాణం నిదధ్మసి॥

భావము— ఓసూర్యదేవా। మాహృదయరోగమును, ఆకుపచ్చగానుండు టను, మాశరీరమునుండి తొలగించి అదేరంగుగల చిలకలయందును శారికలను. పక్షులందును, (ఆడచిలకలయందును) మరియు హరి తాలములను వృక్షములయందును ఉంచెదముగాక। ఇటులచేయుట వలన మాకు రోగనివృత్తియగును, చిలకలకు, హరితాళవృక్షములకు అందము పెరుగగలదని తాత్పర్యము.

గాయత్రీధ్యానము – దానిలాభము

మనము నిత్యము త్రికాలములందు చేయదగిన సంధ్యావందన

ములో సూర్యునకర్ఘ్యమిచ్చిన తరువాత, ఆదిత్యమండలమందు పరబ్రహ్మ స్వరూపిణి సనాతని వేదమయిమైన గాయత్రీదేవియుండి తననుజపించే భక్తులను రక్షించును గావున ఆగాయత్రీజపము చేయవలయునని శాస్త్రవిధి యున్నది.

శ్లో॥ ఆదిత్యమండలస్థానా। పరబ్రహ్మ స్వరూపిణీ।
ఛందోమయీచగాయత్రీ। మాంరక్షతు సనాతనీ॥

అని (దేవీభాగవతం 12వ స్కంధం 3వ అధ్యాయం)

ఈ జపారంభమున ఆమెపంచముఖములను-

శ్లో॥ ముక్తా, విద్రుమ, హేమ, నీల, ధవళ, చ్ఛాయైః॥

ముత్యము, పవడము, బంగారము, నీలము, తెలుపు అను అయిదు రంగులు గలిగియున్నటుల ధ్యానింపవలయును. ఆఅయిదురంగులు సూర్యకిరణములందుండెడివే। ఈవర్ణపంచకముతో గూడిన గాయత్రిని ధ్యానించుట, జపించుట వలన మనబుద్ధివృత్తులు ధర్మమున కభిముఖములగుచున్నవి

శ్లో॥ యోదేవస్సవితాస్మాకం। ధియోధర్మాదిగోచరాః।
ప్రేరయేత్తస్యయద్భర్గ। స్తద్వరేణ్యముపాస్మహే॥

ఈశ్లోకంలో గాయత్రిమంత్రంతో తెలియబడె సవితృదేవత (సూర్యుడు) మనబుద్ధులను మంచి కార్యము లందు ప్రేరణచేయుట, తెలుపబడింది. ఇటుల యీవర్ణములను సేవించుట, మంచిదను విషయము వేదశాస్త్రములను, పర్వతములందు బుట్టి ప్రజాసాగరమును ప్రవేశించి వారికారోగ్యమును ప్రసాదించుట తెలియజేయబడినది।

## వర్ణచికిత్స - దానిలాభములు

సూర్యునియందుగల ఏడువన్నెలను ఒకక్రమపద్ధతిలో సేవించు పద్ధతిని "క్రోమోపతి" యందురు

లోకులు ఆరోగ్యలాభమునందుటకై తొలుత దానిలాభములు అనంతరము దానివిధి సంగ్రహముగ తెలుపబడుచున్నది.

ఈచికిత్సవలన కొన్ని విశేషరోగము లేనా? లేక అన్ని రోగములు నివారణకాగలవా? అనువిషయమై వర్ణచికిత్సానిపుణులైనవైద్యుడు తెలిపిన విషయము వ్రాయబడుచున్నది.

ఈ చికిత్సలో _ నీలిరంగును ఉపయోగించుటవలన "జ్వరము జిగటవిరేచనములు, అతిసారము, సంగ్రహణి, కాస_శ్వాసలు, శిరోరోగము, ప్రమేహము, మూత్రరోగము, విస్ఫోటకము, శ్లీపద (ఏనుగుకాలు) మొదలగు వ్యాధులు నివారణ అగుచున్నవి

రంగుల వరుసలో చివరిదగు గులాబీరంగునందు మనకు కనపడకుండ "అల్ట్రావైలెట్" అనుకిణరములుండును. అవి మనపై ప్రసరించినప్పుడు చర్మము మధ్యనగల పదార్థము "డి" విటమినను ఉత్పత్తి చేసికొనును.

ఆ'డి, విటమిను మనశరీరమున కవసరమైన "క్యాలిషియం, ఫాస్పరసు" అను వానిని తయారు చేయును వీనిద్వారా ఎముకలు దంతములు పుష్టిని పొంది శరీరక్రియలు సపన్నములగు చున్నవి.

"క్రోమోపతి" చికిత్సవలన "హెర్నియా" నివారణ జరిగినందున ఆఅనుభవవిషయము పాఠకులకు ఉదాహరణనిమిత్తం యీక్రిందపొందుపరచుచున్నాము

గుమ్మలూరు,
19-8-79

సంకిస రవీంద్రకుమార్, గుమ్ములూరు.

ఖండవల్లి రాజారావుగారు, వీరిది ఖండవల్లిస్వగ్రామం. వీరు రాజమండ్రిలో దానవాయి పేటలో వుండగా వెళ్లేవాడిని. వారునాకు హెర్నియాకు మందు యిచ్చినారు. వారుయిచ్చేమందు రంగుసీసాలలో సూర్యరశ్మిప్రసరింపజేసి రెండు మూడు రంగుసీసాలలోది కలిపి 15రోజులకు ఒకపర్యాయము ఇచ్చేవారు. ఒకసంవత్సరం చాలపథ్యంగా శ్రద్ధగా వాడితే తగ్గిపోతుందన్నారు. మూడుమాసములకు గాని మీకు అట్టే గుణం కన్పించదు. ఆతర్వాతనుంచి బాగాపని చేస్తుందన్నారు

అలాగా 3 మాసముల నాటికి నాకు బాగుగాగుణం యిచ్చింది సంవత్సరం మానకుండా తీసికున్నాను నాకు పూర్తిగా తగ్గిపోయినది. ఇప్పుడు నాకు ఏబాధలేదు నేనుమందువాడి 15సం॥లు సుమారు అయినది. ఆయన అప్పటికే ముసలివారు యీపాటికికాలంచేసివుంటారు

(సం) సంకిస రవీంద్రకుమార్

ఎఱుపు రంగుచేత సమస్తవ్యాధులు, పసుపుపచ్చరంగువలన ఉదర రోగములు ఆకుపచ్చ రంగుచేత హృద్రోగము, చర్మరోగము లన్నియు తొలగును.

సూర్యుని కిరణములందు రక్తశ్వేతాది వివిధ వర్ణములు నిగూఢంగా నున్నటుల తెలిసికొని యుంటిమి.

ప్రత్యేక రంగునందు ప్రత్యేకగుణంవుంది.

మనశరీరమందును ప్రత్యేక అవయవమునందు ప్రత్యేక రంగుగలదు. ఎట్లనగా- చర్మమువందు గోధుమరంగు, వెండ్రుకలందు నలుపురంగు నేత్రగోళములు దంతములు చీనియందు తెలుపురంగు ఇటులనే మిగిలిన యవయవములందు మిగిలిన రంగులు గలవు. ఈవర్ణచికిత్సా సిద్ధాంతానుసారము మనశరీరమందలి రంగులు తగ్గుటవలన మనకనారోగ్యము గలుగుచున్నది.

దృష్టాంతం- ముఖము కాంతిహీనమగుటకు గారణము రక్తాల్పతః పిలిమరంగుచేత మిక్కిలియారోగ్యము ఎఱుపురంగుచేత ఉత్తేజము గల్గుచున్నది.

రోగమునను సరించి చెప్పబడిన రంగులను మనశరీరంలో మరల పూర్తిగావించుటకు భిన్నభిన్న వర్ణములలోగల సీసాలలో స్వచ్ఛమైన నీరుపోసి సూర్యుని యందుగల వర్ణములను యాసీసాలగుండా ఆజలము లోనికాకర్షించి వానిని ఔషధరూపంలో రోగులకు ఉపయోగించిన యెడల కొలదిరోజులలో వారిశరీరములలో తగ్గినరంగులు పూర్తిగావింపబడి యారోగ్యవంతులయ్యెదరు

సూర్యరశ్మిలనుండి తైలమును, జలమును తయారుచేయవచ్చును అనుకూలమైన కాలము- చైత్రము మొదలు జ్యేష్ఠమువరకు సూర్య కిరణాలు యథేష్టంగా లభించుచున్నందున ఆకాలంలో తైలమును జలమును సిద్ధము చేసికొనవచ్చును.

1 తైలవిధి

శిరోరోగములు నివారించుటకు నీలంరంగు సీసాలో శుద్ధమైన నువ్వులనూనెగాని కొంకాయనూనెగాని బాదామినూనెగాని, రెండంగుళముల

తక్కువగాపోసి కార్కుమగాని దూదివిగాని మూతపెట్టి ఎండలో బెట్టవలయును. దూదిమూత పెట్టినయెడల నిత్యము మార్చు చుండవలయును. తైలము తొంభై రోజులకు సిద్ధమగును తయారైన తర్వాత అత్తరు వేయవచ్చును. రంగుమాత్రం కలపరాదు. ఇది తైలవిధి।

౭ జలవిధి

రోగమునమసరించి భిన్నభిన్నవర్ణములుగల సీసాలలో శుభ్రమైన జలమును రెండంగుళములు తక్కువగానుండునట్లు నింపి ఆదేరంగుగల మూతను గట్టిగా పెట్టవలయును, తైలమునుగాని జలమును గాని నేలపై మంచక కొయ్యపై నుంచి ఎండ బాగాతగిలేచోట ఉదయం పదిగంటలనుండి సాయంత్రిం అయిదు గంటల వరకు పుంచవలయును. ఈలోపుగ వానిపైనీడపడరాదు। పొరపాటుగ సూర్యుడస్తమించే వరకు అట్లే యుంచిన యెడల చంద్రికాంతి గాని నక్షత్రకాంతిగాని వానిపై ప్రసరించి యీజలము చెడిపోవును. అప్పుడా నీటిని పారబోసి యా సీసాను శుభ్రంగా కడిగి మరల జలమును తయారు చేసికోవలయును.

వివిధ వర్ణములుగల సీసాలు ఒకసారే యెండబెట్టినప్పుడుగాని ఒకే బీరువాలో జాగ్రత్తపరచ వలసినప్పుడు గాని అవియొకటికొకటి కలిసికొనకుండ వానికి అదే రంగుగల కాగితమును జుట్టి ఒకదాని నీడ మరొక దానిపై బడకుండ చూడవలయును.

ఒకసీసాలో సిద్ధమైన జలమును అందులోనే మూడురోజులు పైన యుంచరాదు. వెంటనే తెల్లసీసాలోకి మార్చవలయును.

ఒకసారి సిద్ధమైన జలము మూడు దినములు మాత్రము పనికి వచ్చును. మరల వేరుగ తయారు చేసికోవలయును. సూర్యరశ్మినుండి తెల్లసీసాలో తయారైన జలమును వాడుట మిక్కిలిలాభకరము. ఇది యపాయము లేని యుపాయము.

ఆజలమును దినం 1కి రెండు పర్యాయములు ఉపయోగింప వచ్చును ఇదివర్ణచికిత్సాసంగ్రహము। ఈసప్తసప్తిని, ఆరోగ్యంకొరకు భక్తిపురస్సరముగా నమస్కరింతము.

శ్లో॥ నమస్సూర్యాయ శాంతాయ। సర్వరోగనివారిణే।
ఆయురారోగ్యమైశ్వర్యం। దేహి, దేవ। జగత్పతే॥

తా॥ జగత్పాలకుడవై సర్వరోగముల బోగొట్టు శాంతమూర్తివగు ఓ సూర్యదేవా। నీకు నమస్కరించు చున్నాము. నీభక్తులమైన మాకు ఆయురారోగ్యైశ్వర్యముల నొసగుము॥.

మరీచిమాన్=

మ్రియన్తే శత్రవోఽనేనేతి మరీచిః తద్వా = మరీచిమాన్। దీనిచేత శత్రువులు మరణింతురుగావున సుదర్శన చక్రమును "మరీచి" యందురు. అదికలవాడు మరీచిమంతుడు। ఈపదము ముగిలిన శంఖము మొదలగు ఆయుధములకు ఉపలక్షణము। వీరు శంఖ చక్ర గదా ధారియని భవిష్యపురాణం ఆదిత్యహృదయంలో-

శ్లో॥ ధ్యేయస్సదా సవితృమండల మధ్యవర్తీ
నారాయణ స్సరసి జాసన సన్నివిష్టః।
కేయూరవా న్మకరకుండల వాన్కిరీటీ
హారీ, హిరణ్మయ వపుర్ధృత శంఖ చక్రః॥

అని చెప్పబడింది. గాన వీరే సూర్యనారాయణమూర్తి।

"తిమిరోన్మథనః"

చీకటిని బెకలించువాడు -ఓతేజోరాశే। ఈవిశ్వకల్యాణ వ్యవస్థలో

మేము భాగస్వాములము గాజాలకపోతిమి. దీనికి గారణమేమనగా మా మానసికములందు పాతుకొని యున్న తమస్సే। ఓతిమిరోన్మథనా। శాము మమ్ములను యీగాథ తమస్సునుండి లేవనెత్తి తేజస్సునకభి ముఖులగు నటుల జేయుము।

"తమసోమా జ్యోతిర్గమయ" అని ప్రార్థించుచున్నాము.

2 జ్ఞాన ప్రీతి బంధకములను దొలగించువాడుగాన వీరు తిమిరోన్మ థనులైరి.

శ్లో॥ హృద్యన్తస్థోహ్యభద్రాణి। విధునోతి సుహృత్సతాం॥
అని (భాగవతం)

శంభుః

1 శం సుఖం భవత్యస్మాదితి శంభుః: వీరి వలన విశ్వమునకు సుఖము గలుగు చున్నందున వీరిని శంభువందురు "విశ్వాక్షం విశ్వశంభువం" అనిశ్రుతి

2 ఇహ-పరసుఖములనేగాక మోక్షసుఖమును గూడ గల్గించును.

త్వష్టా

1 త్వష్ట= అనగా శిల్పి

"విశ్వకర్మా మనుస్త్వష్టా" అని విష్ణుసహస్రినామము.

2 "త్వష్టావై రూపాణామీశే॥ అను శ్రుతివిబట్టి వీరురూపములకు స్వామి. త్వష్టావైపశూనాం మిధునానాగ్ం రూపకృద్రూపమేవ పశుషుదధాతి। అనశ్రుత్యంతరమును బట్టి వీరు స్త్రీపురుషుల కవసరమైన రూపము నిచ్చువారుగాన "త్వష్ట" అనిరి.

3 మాఘమాసమునకధిపతియైన సూర్యునకు గూడ త్వష్ట అనిపేరు వీరు ప్రకృతి పై పరీత్యముచేత శిధిలావస్థను బొందిన మూలద్రవ్యాలను చక్కజేసి వానికి నూతనరూపమును ప్రసాదించుటచేత వారికి "త్వష్ట" అనునామము సార్ధకము।

4 దేవశిల్పికి "త్వష్ట" అనిపేరు వీరు "సంజ్ఞా" అను తనకుమార్తెను సూర్యునకిచ్చి వివాహముగావించిరి. ఈమెకు మనువు, యముడు అనుకుమారులు "యమునా" అనుకుమార్తెయు గల్గిరి. తదనంతరమును సూర్యునితాపమును సహింపజాలక సంజ్ఞాదేవి తనస్థానంలో ఛాయా, అనునామెను బెట్టి తాను తండ్రిగారింటికి వెళ్లెను. త్వష్టవలన యీసమాచారమును విన్న సూర్యుడు తన తేజస్సును తగ్గింపు మని కోరెను.

విశ్వకర్మ వారియాజ్ఞమేరకు శాకద్వీపంలో ఒకసానపై వారినుంచి తిరివెణబెట్టుచుండెను. సమస్త జగత్తునకు నాభివంటివాడైన సూర్యుడా సానపై దిరుగుచుండెను. అప్పుడు సముద్రములు,వనములు, పర్వతములతో గూడిన భూమి పై భాగమునకు బోయెను. గ్రహములు, నక్షత్రములు తారలతో గూడిన యాకాశము క్రిందికి వచ్చినందున పర్వతములు బగిలినవి. సముద్రజలము ప్రవహింప జొచ్చెను. భూమ్యాకాశములు యిటుల తలక్రిందైనందున, త్వష్టయు, బ్రహ్మాదిదేవతలును సూర్యుని స్తుతి చేసిరి.

సూర్యతేజస్సునందు పదిహేను భాగములు తగ్గించబడినందున వారి శరీర కాంతితో సుందరముగానుండెను.దానిని మరల మండలమందుంచిరి. వారి మనోహర రూపమును జూచి సంజ్ఞ మరల భర్తను జేరి సుఖంగా వుండెను,

చెక్కివేయబడిన సూర్యతేజస్సుతో విష్ణుమూర్తికి సుదర్శన చక్రమును, ఈశ్వరునకు త్రిశూలము, యమునకు దండమును, కుమార స్వామికి శక్త్యాయుధమును, మిగిలిన దేవతలయొక్క ప్రభావ సంపన్న మైన ఆయాయస్త్రములను నిర్మించి యిచ్చెను. త్వష్ట యీసూర్యుని చక్కజేసి సౌందర్యమూర్తిని గావించుటచేత శిల్పియను నామము సార్థకము.

5 త్వష్ట

త్వక్ష్ణోతి తనూకరోతి క్షిన్నప్తకృత్వః సక్షత్రియాంభూమి మితిత్వష్టాః

ఇరువదొక్కమారు దుష్టక్షత్రియులను వెదకి సంహరించి ప్రజలను గాపాడినందున త్వష్ట.

పరశురామావతారము సూచితమైనది.

6 త్వష్ట

త్వక్షతి తనూకరోతి భక్తానాముత్పత్తిప్రళయరూప అనర్థ ప్రవాహదుఃఖమితి త్వష్టా

భక్తులకు మరల మరల పుట్టుట చచ్చుట అను ప్రవాహరూప సంసార దుఃఖమును దొలగించి "మాతుః పయోధర రసం నపునః పిబంతి" తల్లివద్దమరల పాలుద్రావే యవసరంలేకుండ జేసి మోక్షము నిచ్చువాడైనందున త్వష్ట అనిరి.

మార్తాండః

1 ఈమార్తాండుని యవతారకథ మార్కండేయ పురాణంలో యిటుల గలదు.

దేవతలకు, రాక్షసులకును ఒకప్పుడు జరిగిన యుద్ధంలో దేవతలోడిపోయిరి. అందులకు దేవమాతయైన అదితి దుఃఖించి వారి క్షేమం కొరకు సూర్యారాధన గావించినది.

సూర్యుడామె యారాధనకు మెచ్చి ప్రత్యక్షమై యామెతో నిటుల పలికెను।

ఓ దేవమాతా। నేను నా సహస్రాంశముతో నీగర్భమందు ప్రవేశించి నీకుమారుడుగ అవతరించి దేవతల నోడించిన యసురులను సంహరింపగలనని వరము నొసగి యంతర్ధానమయ్యెను.

శ్లో॥ సహస్రాంశేన తేగర్భే। సంభూయాహమశేషతః।
త్వత్పుత్ర శత్రూన్నదితే। నాశయామ్యాశునిర్వృతః)
(మా. పురాణం॥

అనంతరము వేయికిరణములకు సమమైన "సుషుమ్నా" అను తన కిరణమును అదితి గర్భమున ప్రవేశపెట్టెను။ ఆమెయటుల దివ్యగర్భమును ధరించి కృచ్ఛ్ర - చాంద్రాయణ వ్రతములు సలుపుచుండెను। ఆకఠోర వ్రతములగాంచి భర్తయగు కశ్యపమహర్షి యాగ్రహముతో "దేవిః నీవునిత్యము నిరాహారవై యీదివ్యగర్భమును మరణించునట్లు చేయుచున్నావని తీవ్రముగ మందలించెను.

అందులకామె నాథా: నేనీగర్భమును నష్టముజేయుట లేదు. మరేమనగా ఇది శత్రువులను నశింపజేయగలదని పలికి క్రోధముతో, దేవతలను రక్షింపగల యాదివ్యతేజస్సును తన గర్భమునుండి విడిచి వేసెను. ఆతేజఃపుంజము పద్మపలాశమువంటి రూపముతో నుండెను.

ఆ అదిత్యమూర్తిని కశ్యప ప్రజాపతి ఋగ్వేదసూక్తముల స్తుతి గావించెను। తదనంతరము ఆకాశవాణి మేఘగంభీరముగా ఓమహర్షే నాపలుకులాలకింపుము—

శ్లో॥ మారితంతే యతః ప్రోక్తం। ఏతదండంత్వయామునే।
తస్మాన్మునే సుతస్తేఽయం। మార్తాండాఖ్యో భవిష్యతి॥
సూర్యాధికారంచవిభుః। జగత్యేష కరిష్యతి।
హనిష్యత్య సురాంశ్చాయం। యజ్ఞభాగహరానరీన్॥
(మార్కం.పు-105స॥ 19, 20 శ్లో॥

తా॥ ఓమునీ। నీవదితిని గాంచి మారితం, అండం, గర్భాండమును రణింప జేసితివని పలికితివిగాన యీబాలకుడు మారిత + అండ= "ర్తాండ" అనుపేరుతో వ్యవహరింపబడును అనిపలికెను.

మార్తాండః

మృతే అండే జాతో మార్తాండః

జగత్తెల్ల సంహరింపబడిన ప్రళయంకూడ పూర్తియై మరల సృష్టి యారంభం అయ్యేటప్పుడు బ్రహ్మగారిచే కల్పాది యందు సృష్టింబడినవాడు.

"సూర్యాచంద్రమసౌ ధాతాయథా పూర్వ మకల్పయత్, బ్రహ్మ వేదముల సహాయంతో యీశ్వేతవరాహకల్పాది యందు జగత్తును సృష్టించునప్పుడు పూర్వకల్పములో వలెనే సూర్యచంద్రుల నిరువురను సృష్టించిరని శ్రుతి చెప్పింది. అందుచేతగూడ వీరు "మార్తాండ" నామముచే పిలువ బడుచున్నారు.

3 మార్తాండః

"మృతం అచేతనం అండంజీవయతీతి మార్తాండః। అచేతనంగా పడియుండే అండమునందు చేతనస్వరూపుడైన పరమాత్మ తానుప్రవేశించి దానిని జీవింపజేసినందున గూడ మార్తాండుడందురు.

4 రాత్రి సమయమెల్ల మృతప్రాయంగావుండే జగత్తునకు తన యుదయముచేత చైతన్యమును ప్రసాదించువాడైనందున యీసూర్యుడు మార్తాండుడు।

అంశుమాన్

అంశుమంతుడు_మార్గశిర మాసాధిపతి యగు సూర్యునకు అంశుమంతుడనిపేరు అంశువనగ = రశ్మి మరియు వేడి, యని యర్థములు గలవు,

సూర్యుడు తన వేడి రశ్ములతో మార్గశిర మాసమందలి యెక్కువైన చలిని పోగొట్టువాడు.

12

శ్లో॥ హిరణ్యగర్భశ్శిశిర స్తపనోఽహస్కరోరవిః।
అగ్నిగర్భోఽదితేః పుత్రః। శంఖశ్శిశిరనాశనః॥

వివరణ:_

ఈశ్లోకంలో తపనోఽహస్కరో" అనుచోట "భాస్కర" నామమున్నను, 6వ శ్లోకంలో భాస్కరనామము వచ్చియున్నందున ఇచట అహస్కర" అను పాఠమే గ్రహింపబడింది.।

సృష్టికి మూలాధారమీహిరణ్యమే। ఇది సూర్యగర్భంలో పుష్కలంగా వుందిగాన హిరణ్యగర్భుడైనాడు.

కాళరాత్రి యెంత విరాళగా గడిచిననూ సూర్యుడుదయించి వంతనే ఆశాలతలు చిగురిస్తాయి. ప్రకృతి యెల్ల పసిడికాంతితో పరిఢవిల్లుతుంది. శిశిరంలో వున్న చల్లదనము, మెత్తదనము, సూర్యువి వల్లనే లభిస్తాయి। ఆసూర్యుడే మండు వేసవిలో తపనుడై తపిస్తాడు!

ఒకప్పుడు తేజస్సునిచ్చే అహస్కరుడు మరొకప్పుడు చైతన్యాన్ని ప్రసాదించి యంతస్తేజస్సును వెలయించే రవి యౌతాడు. ఆతని కడుపులో బంగారమున్నట్లే అగ్నికూడవుంది. ఆదితికి అల్లారుముద్దుబిడ్డగాన ఆతడు పోయిన స్థలమంతా పవిత్రం అవుతుంది. ఆకాశానికి పావనత్వాన్ని ప్రసాదించే శంభుడీతడే। మంచునుహరించి మంచిని పెంచే మహాపీయుడీసూర్యుడే।

## గూఢార్ధదీపిక

1 "భగవతే హిరణ్యగర్భాయనమః" అను ద్వాదశాక్షరీ మహామంత్రము ఆదిత్యహృదయరహస్యమని పెద్దలు సెలవిచ్చిరి.

2 హిరణ్యం = హిరణ్మయాండం। వీరు దానికి గర్భమందుండు వారు (అనగా బ్రహ్మాండోదరవర్తి యనితాత్పర్యము "తదండమభవద్ధైమం సహస్రాంశుసమప్రభం" అని మనువు చెప్పెను-

3 హిరణ్యగర్భుడు

హిరణ్యం హితరమణీయం, గర్భః = అంతఃకరణం, యస్యసః హిరణ్యగర్భః హితము, రమణీయము నగునది కాన హిరణ్యము। అటువంటి యంతఃకరణముగల వాడైనందున హిరణ్యగర్భుడు — అనగా సర్వజగమునకు హితమును గలిగించు రమణీయమైన మనస్సు గలవాడు.

4 హిరణ్యం = జగదుత్పాదక సమష్టి జీవజాతం। తద్గర్భే యస్యసః హిరణ్యగర్భః।

సకల జగదుత్పాదకమగు సమష్టి జీవసమూహము ఎవని గర్భమందుండునో ఆతడు హిరణ్యగర్భుడు "హిరణ్యగర్భ స్సమవర్తతాగ్రే" అనుశ్రుతి "హిరణ్యగర్భోభూగర్భః" అనువిష్ణు సహస్రనామము ఇందులకు ప్రమాణము.

శిశిరః

1 శితిః = సుఖస్వభావముగలవాడు

2 తాపత్రయ తప్తానాం. విశ్రమ స్థానత్వాచ్ఛిశిరః
తాపత్రియములు =అనగా మూడు తాపములు

1) అధ్యాత్మికము 2) అధిభౌతికము 3) అధిదైవికము।

1 అధ్యాత్మిక తాపమనగా మనలోపల ఆధివ్యాధులవలన గలిగేతాపము,

2 ఆధిభౌతిక తాపమనగా మనకంటె యితరులైన దారాపుత్రాదులు ఇరుగు పొరుగువారు, కుక్కలు దొంగలు మొదలగు వారివలన గలుగునది.

3 అధిదైవికతాపమనగా భూమిమొదలగు పంచ భూత ప్రకోపము చేతను పిడుగు మొదలగు వానిచేత సంభవించేది.

ఈతాపత్రియము చేత తపించు వారికి యాతాపములు తొలగించే విశ్రాంతి స్థానమైనవాడు.

తపనః

1 తపసంతాపే, అనుధాతువును బట్టి వేడినిచ్చువాడని యర్థము. తన ఆశ్రిత విరోధులకు తాపముగలిగించు వాడని. తాత్పర్యము.

2 ఈశ ఐశ్వర్యే అను ధాతువు వలన లోకమును నియమింపగల యైశ్వర్యముగలవాడు.

అహస్కరః = పగటిని జేయువాడు

రవిః

1 రూయతే = స్తూయతే సర్వైరితి రవిః; స్తుతింపబడువాడుగాన రవి యందురు.

2 రవిఃరౌతి = ఉపదిశతి వేదానితివా రవిః

"యోబ్రహ్మాణం విదధాతి పూర్వంయో వై వేదాంశ్చ ప్రహిణోతి తస్మై" అను ఉపనిషద్వాక్యము ననుసరించి, బ్రహ్మగారికి వేదములను ఉపదేశించినవారును, యాజ్ఞవల్క్యమహర్షికి శుక్లయజుశ్శాఖను ఉపదేశించిన యాచార్యపురుషుడీ రవియే।

అగ్నిగర్భః

అగ్ని గర్భమందు గలవాడు, "కాలాగ్నిరుద్రః గర్భే యస్యసః అగ్నిగర్భః కాలాగ్నిరుద్రుడు గర్భమందుగలవాడుగాన సూర్యనారాయణమూర్తి అగ్నిగర్భుడైనాడు" నారాయణాద్రుద్రో జాయతే" అనినారాయణోపనిషత్తు పలికింది. గాన యితడు అగ్నిగర్భుడు.

అదితేః పుత్రః = ఆదిత్యుడు

1 అదితేః = అదితియొక్క పుం = సంతానమైన యింద్రుని త్రాయతే= రక్షించేవాడుగాన, అదితేః పుత్రః అనెదరు.

2 దితి = నాశనము। అదిలేనిదిగాన అదితి। అనగా బ్రహ్మ విద్య తస్యాః పుత్రః తల్లభ్యత్వాత్॥ పరమాత్మ బ్రహ్మవిద్య చేత లభించువాడై నందున అదితేః ఆమెపుత్రుడని చెప్పడం జరిగింది.

3 అదితికి విష్ణుమూర్తి చిన్నకుమారుడుగ అవతరించి నందున ఇంద్రునకు తమ్ముడయ్యెను. వీరిని ఉపేంద్రుడందురు. వీరు ఇంద్రుని త్రైలోక్యరాజ్యమును బలిచక్రవర్తి బలవంతంగా అపహరించినందున దానినాతని వద్దనుండి యాచించి దానముగగొని మరల యింద్రునికిచ్చెను. ఈనామము వామనావతారమును సూచన చేయుచున్నది.

శంఖః

1 శామ్యతి స్వయమేవ సాయంకాలే ఇతిశంఖః॥ సాయంకాలము కాగానే తనంతటతానే శమించేవారు (తగ్గిపోవుట) గాన శంఖః।

2 శం సుఖం। ఖే = హృదయాకాశే। యస్యసః శంఖః హృదయాకాశమందు సుఖము (ఆనందము) గలవాడుగాన శంఖుడు

శిశిరనాశనః

1 శిశిరం = హిమంనాశయతీతి శిశిరనాశనః। మంచును బోగొట్టువాడు

2 శిశిరం = జాడ్యం = మందబుద్ధిని, నాశనః, నశింప జేయువాడుగాన శిశిర నాశనుడు

13

శ్లో॥ వ్యోమనాథస్తమోభేదీ। ఋగ్యజుస్సామపారగః॥
ఘనవృష్టి రపాంమిత్రో। వింధ్యవీధీప్లవంగమః॥

వివరణ:—

ఆకాశానికి నాథుడైన సూర్యుడు ఋగ్యజుస్సామముల యంతమును జూచి చీకటిని భేదించుకొని నీటితో చెలిమిజేసి గొప్పగా వర్షింతురు దక్షిణాయనంలో వేగంగా ప్రయాణము గావింతురు

## గూఢార్థ దీపిక

1 ఆకాశనాథుడైన సూర్యుడు తమోభేది= చీకటిని భేదించువాడు

2 తమోభేదీ। తమః = రాహుః। తంభేత్తుం శీలం అస్యాస్తీతి తమోభేదీ। "తమస్తురాహుః స్వర్భానుః" అని యమరకోశమును బట్టి "తమః" అనగా రాహువని యర్థము। రాహువు సూర్యుని అచ్ఛాదించి నప్పుడు (గ్రహణంపట్టినప్పుడు) వానిని భేదింపగల సామర్థ్యము గలవాడై నందున వారికి తమోభేదీ" అను నామముగల్గినది. ఈనామముచే సూర్యగ్రహణ విషయం సూచింపబడినందున, గ్రహణ విషయమై జడ చేతన వాదములున్నందున ఆవాదములనుగూర్చి పరిశీలింతము.

మం॥ యత్వాసూర్య స్వర్భాను స్తమసావిధ్యదాసురః।
అక్షేత్ర విద్యథాముగ్ధో భువనాన్యదీధయుః॥

(మహాసౌరం)

తా॥ ఓసూర్యదేవ। రాహువను అసురుడు తమను ఆక్రమించి చీకటితో గప్పివేసెను. అందువలన మానవులు తమస్వరూపమును (మండలమును) బాగుగవర్ణింపజాలక తమతమ కర్తవ్యనిర్వహణలో అసమర్థులగుచున్నారు।

ఈమంత్రంలో రాహువను అసురుడు సూర్యుని గప్పివేయుచున్న టుల స్పష్టంగా వర్ణింపబడింది.

భౌతికశాస్త్రజ్ఞులు

సూర్యచంద్రులు భూమి మొదలగునవి కేవలము జడములను చున్నారు. ఇటులనే సూర్యునాచ్ఛాదించు చంద్రఛాయయు, చంద్రుని గప్పివేయు భూచ్ఛాయగూడ జడము అందురు.

గ్రిహణ విషయమై, సనాతనులైన వేదశాస్త్రజ్ఞులకు భౌతిక శాస్త్రజ్ఞులకును చేతన- వాదము, జడ-వాదము, అనిరెండు వాదములు జరుగుచున్నవి. అందలిసామంజస్యమును దెలిసికొని వానికి సమన్వయము గలదేమోపరిశీలింతము. సనాతన శాస్త్రిజ్ఞులు సూర్యాది పిండములు కేవలం జడములుగావు వానినభిమానించు చేతనములు గూడ నున్నటుల ఘంటాఘోషముజేసిరి। ఈవాదమును సిద్ధాంత శిరోమణియను జ్యోతిష గ్రింధము

శ్లో॥ దిగ్దేశకాలావరణాది భేదాన్నచ్ఛాదకో రాహురితిబ్రువన్తి
యన్మానః కేవల గోలవిద్యాం। తత్సంహితావేద
పురాణబాహ్యం।

భావం: దిక్కుల యొక్కయు దేశకాలముల యొక్కయు ఆవరణ తారతమ్యమును బట్టియు ఆవరణ తారతమ్యము చేత గ్రిహణము గలుగు చున్నది. రాహువు సూర్యచంద్రులను మ్రింగునను మాట కల్పనాచాతుర్యమేనని ఖగోళశాస్త్రిజ్ఞులు పలుకుట వేదపురాణ గ్రంధములకు సంహితా గ్రింధములకును విరుద్ధమే అనితోసిపుచ్చినది. గ్రహణ విషయమై పురాణపరిశీలనము

శ్లో॥ దేవలింగ ప్రితిచ్ఛన్నః స్వర్భాను ర్దేవసంసది
ప్రవిష్ట స్సోమ మపిబత్। చంద్రార్కా భ్యాంచసూచితః

శ్లో॥ చక్రేణక్షుర ధారేణ। జహారపిబతశ్శిరః।
హరిస్తస్య కబంధస్తు। సుధయాఽఽప్లావితోఽభవత్।

శ్లో॥ శిరస్త్వ మరతాం నీతం। అజోగ్రహమచీకౢపత్।
యస్తుపర్వణి చంద్రార్కావభి ధావతి వైరధీః॥
(భాగవతం 8స్కం 9అ. 24-25-26.శ్లో)

భావం: విష్ణుమూర్తి మోహిని యవతారము దేవతలకు అమృతమును బంచుచుండగా రాహువు దేవరూపంలో వెళ్లి వారిపంక్తిలో గూర్చొనెను అప్పుడు సూర్యచంద్రులు తమమధ్యలో రాహువున్నాడని మోహినికి సూచించిరి. అంతవిష్ణువు తనసుదర్శనాయుధమును స్మరించి దానితో రాహుశిరస్సును ఖండించెను.

అమృతము ద్రావిన శిరస్సు రాహువుగను అమృతముతో దడపబడిన మొండెము కేతువుగను అయ్యెను. ఆతడీ వైరముతో పూర్ణిమా తిధినాడు చంద్రుని అమావాస్యాతిధినాడు సూర్యుని మ్రింగు చుండును అనియున్నది.

ఈ రాహు-కేతువులు నవగ్రహములలో లెక్కింపబడి ఛాయా గ్రహములని వ్యవహరింపబడుచున్నారు.

"సిద్ధాంతశిరోమణి" గ్రంధంలో

శ్లో॥ భూభావిధుం, విధురినం, గ్రహణే పిధత్తే॥

భూచ్ఛాయ చంద్రుని యాచ్ఛాదించి నప్పుడు చంద్రగ్రహణము చంద్రచ్ఛాయ సూర్యుని గప్పివేసినప్పుడు సూర్యగ్రహణము గల్గునని భాస్కరాచార్యులవారు స్పష్టము గావించిరి.

భూచ్ఛాయకు "తమః" అని సూర్యసిద్ధాంతము చంద్రగ్రహణా ధికారంలో పేర్కొనబడినందున భాస్కరాచార్యులు తన సిద్ధాంత శిరోమణిలో

శ్లో॥ రాహుః కుభామండలగః శశాంకం।
శశాంక గశ్ఛాదయ తీవబింబం।
తమోమయః శంభు వరప్రసాదాత్।
సర్వాగమానామ విరుద్ధమేతత్॥ అని తెల్పిరి.

**భావము:** వాస్తవమేమనగా రాహువనే చేతనుడైన యసురుడు భూమి యొక్కజడచ్ఛాయలో ప్రవేశించి చంద్రుని మ్రింగుచున్నాడు. అటులనే చంద్రుని యొక్క జడచ్ఛాయలో ప్రవేశించి సూర్యుని మ్రింగుచున్నాడు. ఇంతటి సామర్థ్యమాతనికి శంకర భగవానుని కృపచే గల్గినది।

శ్లో॥ ఉద్ధృత్య పృథివీ చ్ఛాయాం। నిర్మితోమండలాకృతిః
స్వర్భానోస్తు బృహత్స్థానం।తృతీయంయత్తమోమయం॥
(కూర్మపురాణం 41అధ్యాయం)

భూచ్ఛాయ వలన అంధకారమయమైన రాహుమండల మేర్పడు చున్నదని గలదు. ఈసిద్ధాంతము సర్వశాస్త్రిసమ్మతము.

ఋగ్యజుస్సామ పారగః

1 ఋగ్వేదము యజుర్వేదము సామవేదముల అంతము నెరిగినవాడుగాన ప్రాతః కాలమందు ఋగ్వేదము మధ్యాహ్నమున యజుర్వేదము సాయంకాలమున సామవేదము సూర్యభగవానుని స్తుతించినట। మంత్రం "ఋగ్భిః పూర్వాహ్ణేదివి దేవ ఈయతే। యజుర్వేదేతిష్ఠతి మధ్యేఅహ్నః। సామవేదేనాస్తమయే మహీయతే। వేదైరశూన్యస్త్రిభిరేతి సూర్యః అని తై॥ కారక శ్రుతి ప్రతిపాదించినది.

సూర్యసిద్ధాంత కారుడు – ఋక్కులే సూర్యమండల మనియు యజుస్సాములు వారి మూర్తులైనందున వారిని త్రియీమయులనియు కాలకర్త, కాలాత్మ అనియు దెలిపిరి.

శ్లో॥ ఋచోఽస్యమండలం సామాన్యస్య మూర్తిర్యజూంషిచ
త్రయీమయోఽయంభగవాన్। కాలాత్మాకాలకృద్విభుః

3 ఋగ్యజుస్సామములకు త్రియీ అనిపేరు। ఈవేదత్రయముచే ప్రతిపాదింపబడేవారుగాన త్రయీమయులనియు వీరినందురు.

శ్లో॥ నమస్సవిత్రే జగదేక చక్షుషే।
జగత్ప్రసూతి స్థితినాశ హేతవే
త్రయీమయాయ త్రిగుణాత్మధారిణే
విరించి నారాయణ శంకరాత్మనే॥

(ఆదిత్యహృదయం–భవిష్యపురాణం)

తా॥ సత్వరజస్తమోగుణముల సాయముతో సృష్టిస్థితిలయములు గావించు బ్రహ్మవిష్ణుమహేశ్వరులు ఈసవితృ దేవతయే జగత్తుకు నేత్రములుగూడ వీరే॥

4 సూర్యమండలము త్రయీమయమని నారాయణోపనిషత్తు తెలిపింది మం॥ ఆదిత్యోవాఏష ఏతన్మండలం తపతి తత్రతాఋచస్తదృచా మండలగ్ం సఋచాంలోకః అథయ ఏష తస్మిన్మండలే ఽర్చి ర్దీప్యతే, తాని సామాని సహామ్నాంలోకః

అథయ ఏష ఏతస్మిన్మండలే ర్చిషి పురుషస్తాని యజూగ్ంషి సయజుషా మండలగ్ం సయజుషాంలోకః సైషాత్రయ్యేవ విద్యా తపతి యఏషోంతరాదిత్యే హిరణ్మయః పురుషః। అని కలదు.

ఘనవృష్టిః

1 గొప్పగా వర్షించువాడు। "వృష్టి" పైలోకంలో సూర్యునిచే ధరింపబడుననియు అతడే వర్షమునిచ్చుచున్నాడనియు తై. బ్రాహ్మణం "సూర్యేణవా అముష్మిన్ లోకే వృష్టిర్ధృతా। సఏవాస్మైవృష్టిం నియచ్ఛతి అని వర్ణించింది. సూర్యుని యీస్వభావమును ఆరుణికి శ్రుతి కూడ బలపరచినది.

ఆదిత్యానాం నిబోధత। సంవత్సరీణం కర్మఫలం। వర్షాభిర్దద తాగ్ంసహ॥

ద్వాదశాదిత్యులు సకాలంలో వర్షమును గలుగ జేయుటవలన సర్వసస్యములు ఫలించి యందువలన సర్వప్రాణులు సుఖింతురని తెలియ జేసింది.

2 ఘనవృష్టిః

సర్వకర్మలకు ఫలమునిచ్చువారు "ఫలమత ఉపపత్తేః" అను బ్రహ్మసూత్రము సమస్తకర్మలకు ఫలదాత పరమాత్మ అని యున్నందున సూర్యభగవానుడు సర్వకర్మఫలదాత।

అపాంమిత్రః

జలములకు స్నేహితుడు— "అసౌవై తపన్నపామాయతనం" ఈ ప్రకాశించే సూర్యుడు ఉదకములకు స్థానముగదా। అనితాత్పర్యం 2 అప్పులనగా సాత్వికులు వారికి జ్ఞానమునొసగుచు మిత్రునివలె యుపకరించు వాడని తాత్పర్యము

3 మహార్ణవశాయియైన నారాయణమూర్తి

వింధ్యవీధీ ప్లవంగమః

1 దక్షిణాయనంలో వింధ్య పర్వతమార్గంలో తెప్పవలె వేగంగాసాగే వాడుగాన వింధ్యవీధీ ప్లవంగముడు అనిపేరు

2 వింధ్యవీధీప్లవంగమః

మనశరీరంలో డెబ్బది రెండువేల నాడులున్నవని యోగశాస్త్రం

"ఉండు దనువున డెబ్బది రెండువేల నాడు లొకటియు నూరుగణ్యంబు లందు" (కళాపూర్ణోదయం)

"శతం చైకాచహృదయస్యనాడ్యః। తాసాంమూర్ధానమభిని స్సృతైకా।
తయోర్ధ్వమాయన్నమృత త్వమేతి విష్వఙ్ఙన్యా ఉత్క్రమణే భవన్తి॥
అని యుపనిషత్తు. మనహృదయమునకు నూటఒక్క నాడులుగలవు. వానిలో ఒకటి శిరోభాగమువైపు ప్రసరించి యున్నది. దానిని "సుషుమ్నా, లేక బ్రహ్మనాడి" యని యందురు. ఆనాడీద్వారా జీవుడు ప్రాణములు విడిచెనేని మోక్షమును బొందును. మిగిలిన నూరు నాడులద్వారా ప్రాణములవిడిచిన యగల మరల పుట్టుచుందురు. అని తెలిపింది.

మనశరీరంలో వుండే చెడుగాలిని వెలుపలికి వదలి వెలుపలవుండే మంచి గాలి ఒకక్రమంలో లోపలికి తీసికొనుటకు ప్రాణాయామమని పేరు వాయువును లోపలికి పీల్చుకొనకయు వెలుపలికి వదలకయు మధ్య స్థితి యందులంచుటకు కుంభకప్రాణాయామమని పేరు. ఈయుచ్ఛ్వాస-నిశ్వాసలు పింగళానాడి-ఇడానాడి యను కుడి, యెడమ, రంధ్రముల ద్వారా జరుపుచుందుము. పింగళానాడి యనగా సూర్యనాడి, ఇడానాడి యనగా చంద్రనాడి. ఈసూర్యనాడి మనశ్వాసను సుషుమ్నానాడీ మార్గంలో ప్రవేశింపజేయును గాన వింధ్యవీథీ ప్లవంగమః
కావుననే

శ్లో॥ ద్వావిమౌపురుషౌలోకే సూర్యమండలభేదినౌ
పరివ్రాడ్యోగ యుక్తశ్చ। రణేచాభిముఖోహతః॥
(భార. విదురనీతి)

లోకంలో యోగియైన యతియు రణంలో ధైర్యంగా పోరి శత్రువుచే సంహరింపబడి దేహత్యాగము జేసినవాడును మోక్షము నొందుదురు.

14

శ్లో॥ ఆతపీ మండలీ మృత్యుః। పింగళస్సర్వ తాపనః
కవిర్విశ్వోమహాతేజాః రక్తస్సర్వ భవోద్భవః॥

వివరణం:-

ఈసూర్యుడు కోపం వస్తే కాలాగ్నివలె మండి పడతాడు. సూర్య మండలాని కాతడే ప్రభువు. పింగళవర్ణంలో ప్రజలకు ప్రాణాలు పోసేవాడు సూర్యుడు. అవసరమని తోచినప్పుడు ప్రాణులను బాగాతపింప జేసి కర్మచేత జీర్ణములైన వారి శరీరములకు మృత్యువును ప్రసాదించి విశ్రాన్తి నిస్తాడు. ఆతని దివ్యతేజస్సుతో రంజిల్లని భూభాగముండదు. అన్నిభావాలకు భవములకు ఉద్భవమాతడే॥

గూఢార్థ దీపిక

1 ఆతపీ, ఆతపః ఆస్యాస్తీత్యాతపీ, ఎండగలవాడు

2 అసమంతాత్ జగన్నిర్మాణసంకల్పః ఆస్యాస్తీత్యాతపీ।

ఈసూర్యుడు "యస్యజ్ఞానమయంతపః అను శ్రుతిననుసరించి పరిపూర్ణంగా జగన్నిర్మాణము చేయు సంకల్పముగలవాడై నందున ఆతపీ జగన్నిర్మాణమునకు పరమేశ్వరుడు చేయుసంకల్పమునకు తపస్సని పేరు అటువంటి తపస్సు పూర్తిగ కలవారైనందున ఆతపీ

1 మండలీ- వృత్తాకారమైన బింబము గలవాడు

2 మండలం _ మండ్యతే అనేనేతి మండలం=ఆభరణము. కౌస్తు భాద్యాభరణములు ధరించినవాడు.

3 మండలము = కిరణముల సమూహము. ఆకిరణముల సమూహం గలవారైనందున మండలీ అను నామము సూర్యునకు సార్ధకము

మృత్యుః

సర్వమును హరించువారైనందున సూర్యభగవానుని మృత్యు వందురు "మృత్యు సర్వహరశ్చాహం" అని గీతావచనము

సూర్యుడు సర్వలోక రక్షకుడు గదా। వారు సర్వమును హరించు వారెట్లగుదురు? అను విషయము మిక్కిలి యాశ్చర్యకరము వారు మృత్యువెటులగునను విషయము వేదమాత సహాయముతో విచారింతము.

మృత్యుః

1 సర్వాన్ని హరించేవాడు "మృత్యుస్సర్వహరశ్చాహం" అని గీతా వచనము. ఆమృత్యువీసూర్యుదేనట।

ఒకముని మృత్యువు నాల్గువిధములని విని యా మృత్యుస్వరూపమును సవివరముగ దెలిసికొనదలచి మరొక మహర్షిని గూర్చి-"పృచ్ఛామిత్వా పరం మృత్యుం" అవమం మధ్యమం చతుం। ఓగురుదేవా। మృత్యువు ఉత్తమము మధ్యమము అధమము అధమాధమము అని నాల్గువిభాగములు గలదని విని యుంటిని, దానిస్వరూపమును నాకు దయతోదెలుపు మని ప్రార్థించెను. వారు ఆమృత్యుస్వరూపమును ఈవిధంగా తెలిపిరి.

శ్లో॥ "అముమాహుః పరంమృత్యుం పవమానంతు మధ్యమం।
అగ్నిరేవావమోమృత్యుః। చంద్రమాశ్చతురుచ్యతే॥

1 "అముమాహుః పరంమృత్యుం" ఈప్రత్యక్షముగా కనబడే సూర్యుడే ఉత్తమమైన మృత్యువు (అనగా ప్రబలమైన మృత్యువు) ఎటులననగా "శతాయుః పురుషః" అని శ్రుతి దెలిపినందున పురుషాయుః ప్రమాణము నూరు సంవత్సరములు. సూర్యభగవానుడు క్రీడసలుపుచు ఆయుస్సును అపహరించునుగావున ఉత్తమ మృత్యువుగ దెల్పిరి.

2 "పవమానంతు మధ్యమం" వాయువైతే మధ్యమ మృత్యువు. పై మంత్రమునందున్న తు అనుశబ్దము సూర్యునికిని యితర మృత్యువులకును గలభేదమును దెలుపుచున్నది. వాయువు మధ్యమ మృత్యువెట్లైనదనగా ప్రతిమానవుడు నేటి సూర్యోదయము నుండి రేపటి సూర్యోదయ పర్యన్తము ఇరువది యొక్కవేల ఆరువందల పర్యాయములు శ్వాసలు జరిపెదరు.

దుఃఖము మొదలగు కొన్ని సమయాలలో ఈశ్వాసల వేగము ఎక్కువగు చున్నది. ఈయంశము సుందరకాండలో హనుమంతుడు సీతను రామపత్నియేయని నిశ్చయించు సందర్భమున "రోదనాదతి నిశ్వాసాత్" అని తెలిపియుండెను. ఇట్టిసందర్భములలో త్వరత్వరగా శ్వాసలు జరుగు చున్నందున ఆయుః ప్రమాణకాలము తగ్గగలదు. యోగాభ్యాసకులు తమప్రాణాయామ సాధన వలన శ్వాసలను పదిల పరచుకొని ఆయ ప్రమాణం జీవింప గలరు గావున వాయువు మధ్యమ మృత్యువనిరి।

"అగ్నిరేవావమో మృత్యుః।

అగ్నియే అధమ మృత్యువు. ఈఅగ్నియెవరనగా మన యుద మందుండే జఠరాగ్నియే। వీరిని గూర్చి "అహంవైశ్వానరోభూత్వా అని శ్రీకృష్ణుడు గీతలో సెలవిచ్చిరి. వీరుమనము భుజించిన యాహ రమును పచనము జేయుదురు. కాని యొక్కొక్కప్పడు కాలమునః

క్రమించి భుజించుట చేతను హితముగాని యాహారమును మితము దప్పి భుజించుటచేతను, దేశకాలవైపరీత్యము వల్లను జీర్ణశక్తి కొరవడి నందువ అజీర్ణవ్యాధి గలిగి క్రమంగా మృత్యుద్వారమును సమీపించును. అది సమయంలో ఔషధసేవ చేయుటచే నివారించుకోవచ్చునుగాన అగ్ని యధమ మృత్యువు. లేక మూడవ విధమైన మృత్యువు।

చంద్రిమాశ్చతుర్థుచ్యతే।

చంద్రుడు నాలవవిధమగు మృత్యువు। ఎటులనగా "సోమోవా ఓషధీనాగ్ం రాజా" అనుశ్రుతి వచనమునను సరించి అతడు ఓషధీ శుడై నందుననే భగవంతుడును గీతలో "పృష్ణామిచౌషధీస్సర్వాః। సోమో భూత్వారసాత్మకః" జలస్వరూపుడైన చంద్రుడనై ఓషధులను బెంచు చున్నాననిరి. ప్రకృతి వైపరీత్యము లేర్పడినప్పుడు సరియైన పంటలు పండనితో తగినంత యాహారము లేక ప్రజలు మృతి నందుదురు.

కావున చంద్రుడు నాలవమృత్యువు- అని యామహర్షి జిజ్ఞాసువై మృత్యు స్వరూపమును నాకు తెలుపుమని ప్రశ్నించినమహర్షికి ప్రత్యుత్తర మిచ్చెను. ఇందుచే సూర్యుడే ప్రబలమృత్యుస్వరూపుడు

పింగళః

1 సూర్యుడు ఉదయకాలమున మధువు వలె (తేనె) పచ్చని వర్ణముతో బ్రకాశించుటచేత పింగళుడు

2 పింగళానాడి యనగా సూర్యనాడి, అనాడి స్వరూపం లోవుండి కర్మ మార్గమున ప్రవర్తింప జేయువాడై నందున వీరిని పింగళుదనిరి.

3 పింగతి = మిళతీతి పింగళః॥ సౌశీల్యము గలవాడు సౌశీల్యమనగా "మహతో మందైస్సహనీరంధ్రేణ సంశ్లేష స్సౌశీల్యం"

మహాత్ములైనవారు తమగొప్పతనమును బాగుగ తగ్గించుకొని తమకంటే తక్కువ వారితో అరమరిక లేక కలిసి యుండుట. ఇటు వంటి సౌశీల్యముగలవాడైనందున పింగళుదనిరి.

సర్వతాపనః

1 మధ్యాహ్న సమయమున ఎల్లరను తపింప జేయువాడు

2 సమస్త బ్రహ్మాండములను ఒకేసారి సంహరింప జాలినవాడు.

కవిః = "సకల వేదపారంగతుడు"

1 వ్యాకరణాది సర్వశాస్త్ర ప్రవర్తకుడగు పండితుడు.

ఈసూర్యభగవానుడు ఆచార్యమూర్తి. వీరి వలన యాజ్ఞవల్క్య మహర్షి శుక్లయజుర్వేదము నంతయును బృహదారణ్యకోపనిషత్తును అధ్యయనము జేసెను.

ఆంజనేయుడు వీరివలన వేదవేదాంగములు వ్యాకరణాది సర్వ శాస్త్రములను గ్రహించిరి. ఈవాయు నందనుని యధ్యయన విధానము ను గురించి వాల్మీకి మహర్షి

శ్లో॥ అసౌపునర్వ్యాకరణం గ్రహిష్యన్
సూర్యోన్ముఖః ప్రష్టుమనాః కపీంద్రః
ఉద్యద్గిరేరస్త గిరిం జగామ
గ్రంథం మహద్ధారయదప్రమేయః॥

తా॥ అప్రమేయుడగు అంజనా సూనుడు వ్యాకరణ శాస్త్రము నభ్య సించునప్పుడు సూర్య భగవానుని ప్రశ్నించుచు మహాగ్రంధమును నేర్చు కొనుచు ఉదయ పర్వతము నుండి యస్తమయ పర్వతము వరకు వెళ్లుచుండిరి.

శో॥ ససూత్రవృత్త్యర్థపదం మహార్థం
ససంగ్రహం సిద్ధ్యతివై కపీంద్రః
నహ్యస్య కశ్చిత్సదృశోఽస్తి శాస్త్రే
వైశారదే ఛందగతౌ తథైవ॥
సర్వాసు విద్యాసు తపోవిధానే
ప్రస్పర్ధతేఽయం హిగురుం సురాణాం॥
సోయం నవవ్యాకరణార్థవేత్తా
బ్రహ్మా భవిష్యత్యపితే ప్రసాదాత్॥

అని (వాల్మీకిరా 7కాం 36స 45-46-47శ్లో)

ఇంతటి నవవ్యాకరణ పండితునికాచార్యమూర్తి సూర్యభగవానుడు.

కవిః = జ్ఞానదాత

వీరు తనపుత్రుడగు వైవస్వతమనువునకు గీత యందు జెప్పబడిన నిష్కామ కర్మయోగము నుపదేశించినజ్ఞాని.

ఈయంశమును గీతాచార్యుడు నాలవ అధ్యాయంలో

శ్లో॥ ఇమం వివస్వతేయోగం। ప్రోక్తవానహమవ్యయం
వివస్వాన్మనవేప్రాహ। మనురిక్ష్వాకవేఽబ్రవీత్॥

అర్జునునకు దెలిపిరి వీరుజ్ఞానదాతయని—

మం॥ కేతుంకృణ్వన్న కేతవేపే శోమర్యా అపేశసే
సముషద్భిరజా యథాః॥

ఓమానవులారా। సూర్యరూపుడైన యింద్రుడు అజ్ఞానులకు జ్ఞానము, రూపరహితులకు రూపమును ప్రసాదించుచూ తన కిరణముల ద్వారా ప్రకాశించు చున్నాడు.

3 సర్వజ్ఞ పరమాత్మ "యస్సర్వజ్ఞ స్సర్వవిత్" అని శ్రుతి. వీరేకవి.

శ్లో॥ స్తోతుం ప్రవృత్తా శ్రుతిరీశ్వరం హి
న శాబ్దికం ప్రాహ న తార్కికం వా।
బ్రూతే తు తావత్క విరిత్య భీక్షణం
కాష్ఠాపరాసా కవితా తతోనః॥

(శివలీలార్ణవం)

శ్రుతి పరమాత్మను కవియని పేర్కొనినది.

1 గణానాంత్వా గణపతిగ్ం హవామహే కవింకవీనాం॥ యజు

2 అనంత మవ్యయంకవిం॥ తై. ఆ

3 కవిర్మనీషీ పరిభూస్స్వయంభూ॥ ఈ. ఉ.

4 వేదో వేదవిదవ్యంగో వేదాంగో వేదవిత్కవిః॥ (విష్ణుసహస్ర నామము)

5 కవింపురాణమనుశాసితారం. (భగవద్గీత)

6 పురాణస్య కవేస్తస్య॥ (రఘు 10–36. కుమారసం. 2–17)

విశ్వుడు

విశ్వమే తన స్వరూపంగా గలవాడు "విశ్వమేవేదం పురుషః" అనుశ్రుతి విశ్వం విష్ణుర్వషట్కారః" అని సహస్రనామప్రారంభ నామమే: సూర్యనారాయణమూర్తి విశ్వుడు.

మహాతేజాః

గొప్ప పరాక్రమశాలి. "జ్యోతిషాం రవిరంశుమాన్" అని గీతా వచనము

రక్తః

1 రక్తవర్ణము గలవాడు. "రక్తవర్ణం రక్తగంధం రక్తపుష్పం రక్త మాల్యాంబరధరం" అని సూర్యధ్యానము

2 అందరి యందనురాగము గలవాడు.

సర్వభవోద్భవః

1 సమస్తకార్యజాతమునకు ఉత్పత్తి కారణము

2 జీవులందరకు జననమరణ రూపమగు సంసారమును గలిగించువాడు

15

శ్లో॥ నక్షత్రగ్రహతారాణామధిపో విశ్వభావనః।
తేజసామపి తేజస్వీ, ద్వాదశాత్మన్నమోఽస్తుతే॥

వివరణ:—

ఆకాశములో కనపడే నక్షత్రములు గ్రహములు తారలు అన్నీ సూర్యకుటుంబమునకు జెందినవే।

మన సూర్యునిలాంటి సూర్యులనేకులు బ్రహ్మాండంలో వున్నారట; శ్రుతులు, వైజ్ఞానికులు, ముక్తకంఠముతో దెలుపుచున్నారు
శ్రు॥ ఏతద్వై వావృతా సహస్రసూర్యతాయా ఇతి వైశంపాయనః।
వైశంపాయనమహర్షి సెలవిచ్చు చున్నారు

ఎక్కడెక్కడ వసంతాది ఋతువులు, తత్తద్ధర్మములు గలవో ఆకడకక్కడ వానిని కలుగ జేయు సూర్యులుండవలయును అను (వ్యాప్తి) న్యాయమును బట్టియు.

మం॥ నానాలింగత్వా దృతూనాం, నానా సూర్యత్వం॥

వసంతాది ఋతువులు నానాలింగములు గలిగియున్నందున అనేకులగు సూర్యులున్నారనియు శ్రుతి గూడ తెలుపుచున్నది.

ఒకే సూర్యుడుండేయెడల వసంతాది ఋతువుల వలన గలుగు చుండు ఉష్ణము-శీతము-నానావిధ సుఖదుఃఖములు అనుభవానికి రాజాలవు। అప్పుడు సంవత్సరమెల్ల ఒకే ఋతువుగావుండి దాని ప్రభావము అనుభవానికి వచ్చును. కారణ భేదం లేనియెడల కార్యభేదం అనుభవానికి రానందున ఋతుధర్మ వైలక్షణ్యమును బట్టియే దానికి గారణమైన అసంఖ్యాక సూర్యులుందురు. ఇది మా భావమే గాదు భగవతియైన వేద మాత మతము గూడ యిదే।

"యద్ద్యావ ఇంద్రతే శతగ్ంశతం భూమీః। ఉతస్యుః। సత్వావజ్రిన్త్సహస్రగ్ం సూర్యాః। అనున జాతమష్ట రోదసీ ఇతి। (అరుణం)

భావము: ఓ ఇంద్రా। మీరొకవేళ శత, శత, స్వర్గముల నిర్మింపగలిగి నమా, అటులనే వందలకొలది భూలోకముల సృష్టించిననూ ఆకాశమందు వేలకొలదిగల సూర్యుల కాంతిని సంపూర్ణముగా తాముగాని, తమచేత నిర్మింపబడిన స్వర్గాది లోకములన్నీకలసి గూడ స్వీకరింప జాలవు.

ఈమంత్రంలో సహస్రసూర్యులుండుట స్పష్టంగా వర్ణింప బడినది. ఆసూర్యులందరకు ఆదిసూర్యుడాదిత్యుడు. అలాంటి ఆదిత్యులు పన్నెండు మంది. వారిలో విష్ణువు ప్రధానుడు.

ఈద్వాదశాదిత్యులలో వెలిగే ద్వాదశాత్మ అందరకు వంద నీయుడు। ఈద్వాదశాత్మ సంస్మరణతో ఆదిత్యహృదయంలోనిపూర్వార్ధం, అంటే స్తుతి భాగం ముగిసింది.

గూఢార్ధ దీపిక

నక్షత్రములు, గ్రిహములు, తారలు, అన్నియు సూర్యుని వల్లనే యుత్పత్తియైనవి.

అ) సూర్యుని యొక్క - "సుషుమ్నా" అనుకిరణము క్షీణచంద్రుని క్షయను దొలగించి కాంతి గలవానినిగ జేయుచున్నది

ఇ) సూర్యునకు తూర్పుభాగమునగల "హరికేశ" అను కిరణము నక్షత్రిములను ఉత్పత్తి జేయుచున్నది

ఉ) సూర్యునకు దక్షిణము వైపునగల "విశ్వకర్మా" అను కిరణము బుధుని సంతుష్టునిగ జేయుచున్నది.

ఋ) వారికి పశ్చిమభాగమునగల- "విశ్వావసు" అనుకిరణము - శుక్ర గ్రిహమును ఉత్పత్తి జేయుచున్నది.

ఌ) "సంవర్ధనము" అనుకిరణమునుండి కుజగ్రిహము ఉత్పత్తియైనది.

ఎ) ఆరవదియగు - "అశ్వభూ" అనుపేరుగల కిరణము నుండి "బృహస్పతి" గ్రహమేర్పడెను

ఐ) "సురాట్" అను సప్తమకిరణము నుండి శని గ్రహము గలిగెను

ఈగ్రిహము లెన్నటికి నష్టముగావుగాన వీనిని నక్షత్రిము లనియునందురు.

ఈగ్రహములు తమకిరణములను సూర్యమండలముపై ప్రసరింపజేయుచున్నవి వాని క్షేత్రిములను సూర్య భగవానుడు గ్రహించుచు యుంటాడు గావున వానికి నక్షత్రినామము సార్ధకమగు చున్నది.

ఈలోకాన్నుండి పైలోకానికి వెళ్లదలచిన సత్కర్మానుష్ఠానపరులను తరింపజేయు చున్నందున వానివి తారకలందురు। అవి తెల్లగా

నుండును గాన వానిని "శుక్లికా" అందురు. (మత్స్యపురాణం) నక్షత్రములు - తారలు అనుటకు మరొక ఉపపత్తిగలదని తై. బ్రాహ్మ ణం యిటుల తెలిపింది.

నక్షత్రములు

యోవా ఇహయజతే। అముగ్ం సలోకం నక్షతే। తన్నక్షత్రాణాం నక్షత్రత్వం।

యజమాని యీలోకంలో ఏనక్షత్రంలో యజ్ఞము గావించునో స్వర్గమును ఆనక్షత్రంలో బొందును.

"నక్షగతౌ" అనుధాతువునుబట్టి నక్షతే అనురూపము వచ్చును అందుచేనవి నక్షత్రములైనవి.

వాని శ్రేష్ఠత్వము ఎట్టిదనగా

"దేవగృహావై నక్షత్రాణి" మనము మన యిండ్లలో దీపం వెలుతురున సంచరించినట్లే దేవతలు గూడ నక్షత్రకాంతి సహాయంతో సంచరింతురుగావున నక్షత్రములు దేవతా గృహములని చెప్పబడింది. తారలు. అనునామమును గూర్చి గూడ అచటనే తెలుపబడింది.

మం॥ సలిలంవా ఇద మంతరాసీత్। యదతరన్। తత్తారకాణాం తారకత్వం।

భూమి ఆకాశములమధ్యగల చరాచర ప్రపంచమెల్ల పూర్వము (అనగా ప్రళయకాలంలో) జలమయంగానే యుండేది. అప్పుడు కృత్తికాది నక్షత్రములు ఆసలిలమును తరించి (దాటి) లోకాంతరమునకు పోయినందున అవితారకలైనవి అనితెల్పింది.

"తేజసామపి తేజస్వీ"

సూర్యుడు తేజోవంతులలో శ్రేష్ఠుడు

మం॥ ఇదంశ్రేష్ఠం జ్యోతిషాం జ్యోతిరుత్తమం॥
(మహాసౌరము)

ఈసూర్యుడు గ్రహములు నక్షత్రములు వీనికంటే శ్రేష్ఠ తేజస్సు గలవాడు.

ద్వాదశాత్మన్

అ) పన్నెండు మూర్తులు గలవాడు, వారు ఇంద్రుడు, ధాత, భగుడు, పూషా, మిత్రుడు, వరుణుడు, అర్యముడు, అంశుమంతుడు, వివస్వంతుడు, త్వష్ట, సవిత, విష్ణువను వారు। అదితి పుత్రులైన యీపన్నెండు మందిని ఆదిత్యులంటారు. వీరిలో ఆదిత్యుడు తనస్వరూపమేనంటూ కృష్ణుడు "ఆదిత్యానామహం విష్ణుః" గీతలో చెప్పిరి. ఈవిష్ణువు వేరు త్రిమూర్తులలో విష్ణువు వేరు. | సంవత్సరమునకు పన్నెండుమాసము లైనందున క్రమంగా ఈ ద్వాదశాదిత్యులు ఒక్కొక్కమాసమునకు అధిపతులగుచున్నారు। మరియు వీరు ద్వాదశమూర్తులైనందున లోక రక్షణకై ఒక్కొక్కమూర్తితో నుండి ఒక్కొక్క కార్యమును నిర్వహింతురు.

ఇంద్రుడు దేవతలకు ప్రభువు। ధాత, ప్రజాపతి। పర్జన్యుడు వర్షించును। త్వష్ట–ఓషధి వనస్పతులలోనుండును। పూషుడు అన్నరూపంలో ప్రజాపోషణ గావించును। అర్యముడు–వాయురూపంలో దేవతలందుండును। భగుడు – మానవులందుండును। వివస్వంతుడు అగ్నిరూపంతో, జీవులు భుజించే ఆహారమును పచనము జేయును అంశుమంతుడు వాయురూపంలో వుండి మనలను రక్షించును। మిత్రుడు లోకమునకెల్ల మైత్రిగలవును– విష్ణువు ధర్మస్థాపనకై యవతరించును.

ఒక్కొక మాసానికి ఒక్కొక్క సూర్యుడధిపతి యని దెలిసికొని యుంటిమి వీరు మాఘాదిమాసాలకు అధిపతులగు చుందురు

శ్లో॥ అరుణో మాఘమాసేతు। సూర్యో వై ఫాల్గునే తథా।
చైత్రమాసేతు వేదాంగః। భానుర్వైశాఖ తాపనః॥
జ్యేష్ఠమాసే తపేదింద్రః, ఆషాఢే తపతే రవిః,
గభస్తి శ్శ్రావణేమాసి। మయో భాద్రపదే తథా॥
ఇషేసువర్ణ రేతాశ్చ। కార్తికేచ దివాకరః।
మార్గశీర్షే తపేన్మిత్రః। పౌషేవిష్ణుస్సనాతనః॥
పురుషస్త్వధికే మాసి। మాసాధిక్యేతు కల్పయేత్।
ఇత్యేతేద్వాదశాదిత్యాః। కాశ్యపేయాః ప్రకీర్తితాః॥

(భ.పు. ఆదిత్యహృదయం)

ఇ) ప్రతిష్ఠాకల్పమునందును పూజాకల్పమునందును విగ్రహమునకు బింబమునకు కళాన్యాసమును జేయుదురు. ఆసందర్భమున సూర్యకళలు పన్నెండు చంద్రకళలు పదునారు అగ్నికళలు మూడు న్యాసము జేయవలయును। దీనినే కళాన్యాసమందురు. వానిలో సూర్యుని ద్వాదశకళలు యీరీతిగ పేర్కొనబడినవి।

తపనీ, తాపినీ, ధూమ్రా, మరీచి, జ్వాలినీ, రుచి, సుధూమ్రా, భోగదా, విశ్వా, బోధినీ, ధారిణీ, క్షమా, సుధూమ్రా లేక సుషుమ్నా అనునవి.

ఉ) సూర్యభగవానుని ప్రాతః స్మరణీయ, ద్వాదశనామములు

శ్లో॥ ఆదిత్యః ప్రథమనామ। ద్వితీయంతు దివాకరః
తృతీయం భాస్కరః, ప్రోక్తః। చతుర్థంతుప్రభాకరః

శ్లో॥ పంచమంతు సహస్రాంశుః। షష్ఠం త్రైలోక్య లోచనః
సప్తమం హరిదశ్వంచ। అష్టమంతు విభావసుః॥
నవమం దినకరః ప్రోక్తః। దశమం ద్వాదశాత్మకః।
ఏకాదశంత్రియీమూర్తిః। ద్వాదశం సూర్య ఏవచ॥
(భ.పు.ఆదిత్యహృదయం)

మం॥ ఆదిత్యానామాదిత్యానాగ్ స్థానేస్వతేజసాభాని।
(ఆరుణం)

పరమాత్మయొక్క మూర్తి విశేషములైన ద్వాదశాదిత్యుల స్థానము నందు స్వీయతేజస్సుతో ప్రకాశింపగలనని సాధకుడు తెలుపుచున్నాడు. ఈద్వాదశాత్మను భక్తితో నమస్కరింతము

శ్లో॥ ఆదిత్యం సర్వకర్తారం। కలాద్వాదశ సంయుతం
పద్మహస్త ద్వయం వందే। సర్వలోకైక భాస్కరం॥

తా॥ సమస్త లోకములందును ఏకైక తేజోమూర్తియు ద్వాదశకళా యుక్తుడును సర్వకర్తయు రెండుచేతులలో కమలముల ధరించి యున్న ఆదిత్యమూర్తిని నమస్కరించుచున్నాను.

ఈద్వాదశాత్మస్తుతి తోటి ఆదిత్యహృదయంలోని పూర్వభాగం, (అంటే స్తుతి భాగం). ముగిసినది॥

16

శ్లో॥ నమః పూర్వాయగిరయే।పశ్చిమాయాద్రియేనమః।
జ్యోతిర్గణానాంపతయే। దినాధిపతయే నమః॥

వివరణ:—

ఈశ్లోకముమండి యుత్తరార్ధము (అనగా నుతిభాగం, లేక నమకభాగం) ఆరంభమవుతుంది—

పూర్వాద్రికి పశ్చిమాద్రికి నమస్కారము. జ్యోతిర్గణములకు పగటికిని అధిపతికి నమస్కారము.

## గూఢార్థ దీపిక

సూర్యుడుదయించే తూర్పునగల పర్వతమునకు "ఉదయగిరి" అని పేరు. వారస్తమించే పడమరదిక్కున గల పర్వతమునకు "అస్తగిరి" లేక అస్తమయ పర్వతమని పేరు.

సూర్యుడిచ్చట ఉదయాస్తమన పర్వతములుగ ప్రతిపాదింప బడెను "అహస్సంవర్తకో వహ్నిరనిలో ధరణీధరః" అను విష్ణు సహస్ర నామము పరమేశ్వరుని "ధరణీధరః = పర్వతమనిచెప్పింది. పర్వతమే పరమేశ్వరుడని అరుణాచలం భద్రాచలం వేంకటాచలం మొదలగు క్షేత్రములలో గలదు. కాననే అరుణాచలంలో బ్రహ్మోత్సవ సందర్భంగా గిరి ప్రదక్షిణము గావింతురు. ఇట ఉదయగిరి అస్తగిరి స్వరూపుడు సూర్యభగవానుడు చెప్పడం జరిగింది

"జ్యోతిర్గణానాం పతయే" పుణ్యాత్ములకు ప్రభువు
సకృతాంవా ఏతాని జ్యోతీగ్ంషి యన్నక్షత్రాణి॥

అనుశ్రుతి వచనానుసారము నక్షత్రములు పుణ్యాత్ములే। వీరికి ప్రభువగు సూర్యునకు నమస్కారము.

## 17

శ్లో॥ జయాయ జయభద్రాయ హర్యశ్వాయ నమోనమః
నమో నమస్సహస్రాంశో। ఆదిత్యాయ నమోనమః॥

వివరణ:-

జయస్వరూపికి నమస్కారము. మంగళముతో గూడిన జయాన్ని ప్రసాదించే జయభద్రునకు నమస్కారము। పచ్చని గుర్రాలపై పయనించే వేవెలుగుల స్వామికి నమస్కారము.

### గూఢార్థ దీపిక

1 జయతీతి జయీ। తస్మై-నమః।

1 జయించువాడై నందున జయి। ఆతని కొఱకు నమస్కారము

2 జయతీతి జయః, అప్రతిహత పరాక్రమః। తస్మై

ఎదురు వీరుడులేని పరాక్రమశాలి గావున జయుడు

3 జయంత్యనేన సద్భక్తా స్సంసారమితి వాజయః। నిజమైన భక్తులు వీరి యనుగ్రహము వలన సంసారమును జయింతురు గావున జయుడు

4 బ్రహ్మలోకాంతమైన సకలలోక జయప్రదుడు

5 జయుడను పేరుగల ద్వారపాలకుడీతడే।

జయభద్రాయ

1 జయభద్రయోః ప్రదాతేర్రి

జయమును మంగళమును ఇచ్చువాడు

2 ఉపాసకానాంరోగ పాపాది జయం, భద్రం= కల్యాణంచ ప్రయచ్ఛతీతి జయభద్రః।

ఉపాసకుల యొక్క రోగములను పాపములను నశింపజేసి కల్యాణమునిచ్చువాడైనందున జయభద్రుడు

3 బ్రహ్మలోకాంత జయప్రాప్యం యద్భద్రం, భూమానందః తదాత్మకాయ।

బ్రహ్మలోకాన్ని జయించినవారు పొందగల నిరతిశయానంద స్వరూపుడు

హర్యశ్వాయ

1 పచ్చని గుఱ్ఱములు గలవాడు

2 హరిః = కపిః। అశ్వః = వాహనం యస్యసః హర్యశ్వః

హనుమంతుడు వాహనముగా గలవాడు, ఈనామము రామావతారమును సూచన చేయుచున్నది. వీరికి పదేపదే నమస్కారము.

నమోనమస్సహస్రాంశో।

సహస్రాణ్యనంతాని అంశవో జీవాయస్యసః = సహస్రాంశుః తస్యసంబుద్ధిః సహస్రాంశో।

అనంతజీవులకు స్వామి శ్రీకృష్ణుడు తాను స్వయంగా గీతలో "మమైవాంశో జీవలోకే జీవభూతస్సనాతనః" అని సెలవిచ్చిరి. కాన వీరికి మాటిమాటికి నమస్కారము।

ఆదిత్యాయ నమోనమః

ఆదిత్యుడవైన నీకు మాటిమాటికి నమస్కారము.

ఆదిత్యుని యవతారము అరుణికీ శ్రుతి యిట్లుల దెల్పినది.

"ఆపోవా ఇదమగ్రేసలిలమాసీత్" అనియొక్క ఐతిహ్యము నారంభించింది.

ఈజగత్తు సృష్టియగుటకు ముందు సర్వము జలమయమైయుండెను ఆయుదక సామ్రాజ్యములో ప్రజాపతియైన బ్రహ్మ ఒక్కరే తామరాకు మీద గూర్చొని యుండిరి. వారికి ప్రపంచమును సృష్టించవలెనను సంకల్పముగల్గినది. అందులకై వారు తపస్సుగావించి ప్రజాసృష్టిని గూర్చి యాలోచన చేయుచుండగా వారిశరీరము కదలనారంభమయ్యెను ఆకంపన వలన అరుణులు, కేతులు, వాతరశనులు, అనుమూడు తెగలగ మహర్షులావిర్భవించిరి మరియు బ్రహ్మగారినఖ (గోళ్లు) కంపనవలన వైఖానసులును, వాలకంపన (కేశము) వలన వాలఖిల్యులను మహర్షులను ఆవిర్భవించిరి।

తదనంతరమాప్రజాపతి శరీరమునుండి యొక కూర్మము (తాబేలు) వెలువడినది. అదియానీటిలో సంచరించుచుండుట జూచి యిదెట్లు వచ్చినదను కుతూహలముతో – ఓకూర్మమా। నీవు నామాంసము చర్మము వీని నుండి యావిర్భవించితివా? అనియడుగగా ఆతాబేలు నేను క్రొత్తగా యిప్పుడు నీచర్మము మొదలగు వానినుండిరాలేదు. నేను నిత్యుడను. సర్వగతుడను గాన యింతకుమునుపే నీహృదయమందు గూడ నుంటినని పలికెను

మం॥ పూర్వమేవాహమిహాసమితి। తత్పురుషస్య పురుషత్వం।

అనిపలికి చైతన్యఘనమైన యాపరమాత్మ అనంతశిరస్సులు అనంతనేత్రములు అనంతపాదములతో విశ్వరూపుడై యా ప్రజాపతికి దర్శనమిచ్చెను.

ప్రజాపతి భక్తితో వారికి నమస్కరించి యిటులపలికెను "ప్రభో। తాము మాకందరకు పూర్వులైనందున యీప్రపంచమును నిర్మింప్రద నిప్రార్ధించెను. అప్పుడాపరమేశ్వరుడు – "సఋత ఆదాయాపః। అంజలినా పురస్తాదుపాదధాత్। ఏవాహ్యేవేతి। తతఆదిత్యఉదతిష్ఠత్। సాప్రాచీదిక్॥

"ఆపోవాఇదమగ్రే సలిలమాసీత్" అనిచెప్పబడినటుల సృష్టికి ముందే యున్నకారణోదకములను తనదోసిలితో తీసికొని_ "ఏవాహ్యేవ" అనుమంత్రముతో ఆజలమునభిమంత్రించి మనము ప్రకృతముతూర్పుగా వ్యవహరించెవైపున విడిచిపెట్టిరి. ఆదిక్కునుండి యాదిత్యుడవతరించెను అదేతూర్పుదిశ। అనియాదిత్యునియవతారమును వర్ణించినందున అట్టి యాదిత్యుని కొరకు నమస్కారము.

## 18

శ్లో॥ నమఉగ్రాయవీరాయ। సారంగాయనమోనమః।

నమః పద్మప్రబోధాయ। ప్రచండాయ నమోనమః॥

వివరణ: _

ఉగ్రమూర్తికి నమస్కారము. రణవీరునకు నమస్కారము. సంసారాన్నుంచి తరింపజేసే సారంగునకు నమస్కారము। బ్రహ్మమూహూర్తమున (వేకువన) వీచేచల్లనిగాలికిహాయిగ విదురించే కమలాలను తన ఉదయకిరణాలతో మేల్కొలిపే చిన్మయమూర్తికి నమస్కారము. సర్వసమర్థుడైన యాప్రచండ భానునకు నమస్కారము.

### గూఢార్థ దీపిక

ఉగ్రాయ = అనుపాసకానాండిగ్రాయ

1 తనను ఉపాసింపనివారికి ఉగ్రరూపమున నుండువాడు.

2 ఇంద్రియములను బ్రవర్తింప జేయగలిగిన స్వతంత్రుడు

3 త్రిపుర సంహారము చేయగల పరాక్రమ శాలి।

వీరాయ

వివిధం ఈరయతి = ప్రాణినశ్చేష్టయతీతి వీరః। తస్మై। ప్రాణులను వివిధముగ ప్రేరణచేసి చలింప జేయువాడు

సారంగాయ

1 సారం = శీఘ్రంగచ్ఛతీతి సారంగః। తస్మై। ఏకనిమిషార్ధేన ద్విసహస్రయోజనం గచ్ఛతీతి పురాణ ప్రసిద్ధిః॥

శ్లో॥ యోజనానాం సహస్రేద్వే। శతేద్వేద్వేచయోజనే।
ఏకేన నిమిషార్ధేన। క్రమమాణనమోఽస్తుతే॥

(భ పు. ఆదిత్యహృదయం 67శ్లో॥)

అర్ధనిమిషంలో రెండువేల రెండువందల రెండు యోజనముల దూరము ప్రయాణము చేయువాడు. కాన సారంగుడు

2 సారంగచ్ఛతీతి సారంగః, తస్మై। సారమును గ్రహించువాడైనందున సారంగుడు అట్టి హంసావతారునకునమస్కారము. "మరీచిర్ద మనో హంసః" విష్ణుసహస్రనామము.

పద్మప్రబోధాయ

1 సరస్సులందు పద్మములను తనయుదయకిరణ స్పర్శచేత వికసింప జేయువాడు

2 మనలోపలగల హృదయకమలమును వికసింప జేయువాడైనందున సూర్యునకు పద్మప్రభోదకుడనునామముసార్ధకము

1 ప్రచండాయ = సర్వసమర్థునకు మానమోవాకము
2 మిగుల కోపముగలవానికి మానమస్కారము.

19

శ్లో॥ బ్రహ్మేశానాచ్యుతేశాయ। సూర్యాయాదిత్యవర్చసే।
భాస్వతే సర్వభక్షాయ। రౌద్రాయవపుషేనమః॥

వివరణ: –

త్రినాదులైన బ్రహ్మ విష్ణు మహేశ్వరులను స్వాధీనమందుం చుకున్న సూరనారాయనకు నమస్కారము. ఎంత ప్రసరించినను తరుగని కాంతితో తళతళలాడే జ్యోతిరాదిత్యునకు నమస్కారము। ఇదిభక్షింపదగినది, ఇదిరక్షింపదగినదను భేదముదలపక ప్రళయంలో సర్వమును భక్షించేవాడు గావున సర్వభక్షుడైన రుద్రమూర్తికి మా అనంతానంత నమస్కారములు.

గూఢార్థ దీపిక

1 "అసావాదిత్యోబ్రహ్మ అను శ్రుతివచనము ఈయాదిత్యుడే బ్రహ్మ యని వక్కాణించినందున సృష్టిస్థితిలయ కారకులగు బ్రహ్మవిష్ణు మహేశ్వరులకు సూర్యభగవానుడే నియంత।

2 బ్రహ్మేశానాచ్యుతేశాయ

బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులకు జనార్దనుడే స్వామి

శ్లో॥ సృష్టిస్థిత్యంత కరిణీం। బ్రహ్మవిష్ణుశివాత్మికాం
సంజ్ఞాంసయాతి భగవాః నేక ఏవజనార్దనః॥

షడ్గుణైశ్వర్యసంపన్నుడైన భగవంతుడగు జనార్దనస్వామియొక్కడే సృష్టి స్థితిలయముల గావించు బ్రహ్మ విష్ణు మహేశ్వరులను సంజ్ఞ కలిగి యున్నారు। జనాం = మాయాం, అర్దయతీతిజనార్దనః మాయాపతి. వారే యీసూర్యభగవానుడు (లేక)

3 బ్రహ్మేశానయోః = బ్రహ్మరుద్రయోః। అచ్యుతేశః = అప్రచ్యుత నియంతా। బ్రహ్మరుద్రులను గూడ సర్వాపదల నుండి రక్షించేవారు.

శ్లో॥ అతీతప్రళయాపాయ। ఉత్థితాయ సవేధసే।
హత్వాఽసురంహయగ్రీవం। వేదాన్ ప్రత్యాహరద్ధరిః॥

అతీత ప్రళయాంతంలో ప్రకటమైన బ్రహ్మగారికి వేదాపహారి యగు హయగ్రీవాసురుని సంహరించి మరల వేదములను దెచ్చి యిచ్చినవారు శ్రీమహావిష్ణువు కావున

శ్లో॥ ప్రళయసిధాతుః సుప్తశక్తేర్ముఖేభ్యః
శ్రుతిగణమపనీతం। ప్రత్యుపాదత్తహత్వా
దితిజమకథయద్యో। బ్రహ్మ సత్యవ్రతానాం
తమహమఖిలహేతుం। జిహ్మమీనంనతోస్మి

(భాగ. 8స్కం 24అ 61శ్లో॥)

హయగ్రీవాసురుని సంహరించి వేదములను దెచ్చియిచ్చిన మాయామత్స్యావతారుని నమస్కరించుచున్నాను భాగవతంలో హయగ్రీవాసురుని సంహరించినటులయున్నను శంకరభగవత్పాదకృతమని తెలియుచున్న దశావతారస్తోత్రంలో మత్స్యావతారస్తుతిలో

శ్లో॥ వేదోద్ధార విచారమతే। సోమక దానవసంహరణే
మీనాకార శరీర నమో। భక్తంతే పరిపాలయమాం॥

వేదములుద్ధరింప యోచనగలిగినవారై సోమకాసురుని సంహరించిన మీనావతార। నీభక్తుడనగు నన్ను పరిపాలించుము॥ అనియున్నందున

ఈసోమకాసురుడు వేదముల నపహరించుట కల్పాంతరవిషయమనిగాని. హయగ్రీవునకే సోమకాసురుడని నామాంతరమనిగాని తెలియవలయును ఈనామముచే మత్స్యావతారము సూచితమైనది.

ఆదిత్యహృదయము శివపరమైనందున "బ్రహ్మేశానాచ్యుతేశాయ" అనునామము వలన వారికి త్రిమూర్తులకధిపతిత్వము జెప్పి దానినుప పాదించుటకై "రౌద్రాయవపుషేనమః" అను పదముతో ఆదిత్యాంత ర్యామి శివుడేనని మహర్షి దెలిపినట్లు అప్పయ్య దీక్షితులవారు సెల. విచ్చిరి

ఆదిత్యవర్చసే.

ఆదిత్యస్యాంతరం వర్చః = జ్ఞానంయస్యసః తద్రూపాయ ఆదిత్యమూర్తిలోవుండే జ్ఞానస్వరూపుడు.

సర్వభక్షాయ

1 సర్వయజ్ఞములందు వేల్చబడే హవిస్సుభుజించె విశ్వభుక్కతడె

2 సర్వసంహర్తా "యస్యచబ్రహ్మచక్షత్రం ఉభేభవత ఓదనః" అను శ్రుతివచనానుసారము సర్వసంహర్తయితడే.

"రౌద్రాయవపుషేనమః

శత్రువును సంహరించుటకు భయంకరమూర్తిని ధరించినవాడ ఈనామము – హిరణ్యకశిపుని సంహరించుటకు సభాస్తంభమునుం వెడలివచ్చిన నృసింహావతారమును దెలుపుచున్నది.

2 రౌద్రాయ

రుతం = దుఃఖం। తస్మాతారాగద్వేషౌ। తస్మాలమజ్ఞానంచ ద్రావయతీతిరుద్రః। తస్యేదంరౌద్రం। అజ్ఞానసంహారక జ్ఞానాకారాయ।

రతమనగా దుఃఖము। దానికి గారణము రాగ ద్వేషములు వాటికి కారణమజ్ఞానము। ఇదిమనజ్ఞానాన్ని ఆవరిస్తుంది

శ్లో॥ అజ్ఞానేనావృతం జ్ఞానంతేనముహ్యన్తి జంతవః॥

గీ 4_15

అజ్ఞానముచేత జ్ఞానముకప్పివేయబడును గావున అజ్ఞానముచేత ఆవరింపబడిన జీవులు మోహమును బొందెదరు. ఎవరియజ్ఞానము జ్ఞానముచే నిర్మూలింపబడునో వారికి జ్ఞానసూర్యోదయమై సమ్యగ్దృష్టియలవడును ఈజ్ఞానస్వరూపుడే సూర్యభగవానుడు.

20

శ్లో॥ తమోఘ్నాయహిమఘ్నాయ। శత్రుఘ్నాయామితాత్మనే।
కృతఘ్నఘ్నాయ దేవాయ। జ్యోతిషాంపతయేనమః॥

వివరణ:—

చీకటిని శిక్షించి మంచును చీల్చి శత్రువులను సంహరించే సూర్యభగవానుడు అమితాత్ముడు. వారిశక్తియమోఘము. వారుగావించేమేలును మరచేవారుకృతఘ్నులు. అట్టివారిని నిర్దాక్షిణ్యంగా దండిస్తారు. కాబట్టి వారుచేసిన మేలునకు మనం సదా కృతజ్ఞులమైయుండాలి కాన అజ్యోతిర్మయుడు వచ్చేసరికి మెలకువతో నుండుట మనకర్తవ్యము. అట్టిస్వయం ప్రకాశమూర్తికి మాఅనంతానంతనమస్కారములు

గూఢార్థము

తమోఘ్నాయ _ చీకటిని పోగొట్టేవానికొరకు

మం॥ యేనసూర్యజ్యోతిషా బాధసేతమో జగచ్ఛ
విశ్వముదియర్షిభాసునా। తేనాస్మద్విశ్వామనిరా
మనాహుతి మపామీవా అపదుష్వప్న్యంసువ।

(మహాసౌరం 42బు)

ఓసూర్యదేవ। తామేజ్యోతిస్సుచేత చీకటిని పోగొట్టి ప్రపంచము నకు స్ఫూర్తిని గలిగించుచున్నారో, ఆజ్యోతిస్సుచేతనే మాఅన్నాభావ మును, యజ్ఞాభావమును బోగొట్టి మాకు సంభవించే దుస్వప్నముల వలని కీడును దూరము చేయుమని ప్రార్థించుచున్నాను.

మంచును బోగొట్టువాడైనందున "హిమఘ్నాయ" అనిరి

శత్రుఘ్నాయ

శత్రువులను జంపువానికొరకు

1 ఆశ్రితుల శత్రువులను ఋణములను రోగములను నశింపజేయువాడు

అ) మం॥ ఉదగాదయమాదిత్యః। విశ్వేనసహసాసహ।
ద్విషన్తం మహ్యం రంధయన్మో అహంద్విషతేరధం॥

భావము॥ అదితి కుమారుడైన ఆదిత్యుడు నాకు ఉపద్రవాన్ని గలిగించు శత్రువులను రోగములను నాశనము జేయుచు తన సంపూర్ణబలముతో గూడ నాయెదుట యుదయించినాడు. సూర్యోపాసకుడనైననేను నారక్షా భారమునువారి యందుంచినందున, నాకు అనిష్టమును గలుగజేయు మాన వులు ఇతర ప్రాణులు లేక రోగములు వీట్లనునేను స్వయముగ నశింప జేయను, నన్ను ద్వేషించువారి విషయమున చేయవలసిన దానిని నానిమిత్తము ఆసూర్యభగవానుడే చేయనిమ్ము. అని భావము.

సూర్యుడు రోగములను నిర్మూలించుటను గూర్చి

మం॥ ఉద్యన్నద్యమిత్రమహః। ఆరోహన్నుత్తరాందివం
హృద్రోగం మమసూర్య। హరిమాణంచ నాశయ॥

(తృచ)

మిత్రునివలె యుపకారము జేయు తేజస్సుగల ఓసూర్యభగవానుడా! నేడు తాము ఉదయించి పైనగలఆకాశమును గూర్చి వెళ్లుచు నాహృద్రోగమును ఆకుపచ్చని వర్ణము కామిలావ్యాధిని (జాండీస్) వినాశమును జేయుము. అనిప్రార్థన.

శత్రుఘ్నాయ

ఇ) శత్రుర్దేహాహంభావః। నిజతత్వ భగవదను సంధానిజ సౌఖ్యేనతస్య శాతనాత్ తస్యహంతా॥

శత్రువనగా దేహమేనేననుకొనుట। ఇదియజ్ఞానముచే గలుగుచున్నది। అందరకు గనిపించే యీదేహమునకాధారభూతుడై యీదేహమందుండే జీవాత్మను "దేహి" అందురు. ఈదేహము "దేహి" ఈరెంటి కలియికకు మరొకపేరే జీవనము। ఈరెంటిలో "దేహ" స్వభావమెట్టిదనగా దహింపబడేదిగాన దేహము. ఇది మరణానంతరమెప్పుడో కట్టెలతో తగుల బెట్టబడుటేగాదు. జీవించియుండేటప్పుడు గూడ తాపత్రయాగ్ని చేత తగలబెట్టబడుతుందిగాన విది దేహమైనది

ఈదేహమందే మనచే సర్వకాలసర్వావస్థలయందును నేను, అని వ్యవహరించు వాడు "దేహి" ఈతను అగ్నిచేత దహింపబడేవాడు కాదని" శ్రీకృష్ణపరమాత్మ "నైనందహతిపావకః" అని గీతలో స్పష్టపరచెను। ఈఅవినాశియైన జీవాత్మను దహింపబడె జడపదార్థముగ భావించుట అజ్ఞానముగాక మరేమగును? ఇదియే దేహాహంభావము.

ఈబుద్ది యుండునంతవరకు పరమేశ్వరుని భక్తితో సేవించుటే ఉత్తమమార్గము. ఆదశలో "దాసోహం" అను భావముతో సేవించుట చేత, దాని పరిపక్వదశలో "దా" కారము లోపమగును। అనగా

దేహము నేను గాను దేహిని లేక."సోఽహం" ఆపరమాత్మయే నేను, అనుదృఢభావముగల్గు చున్నది. ఇటుల అజ్ఞానమును బోగొట్టు జ్ఞాన సూర్యుడుగావున నితడుశతుఘ్నుడు.

అమితాత్మనే =

సర్వవ్యాపకుని కొరకు

శాస్త్రమర్యాదలో సజాతీయ - విజాతీయ - స్వగతభేదము లేనివాడు అని భావము.

శ్లో॥ వృక్షస్య స్వగతోభేదః। పత్రపుష్ప ఫలాదిభిః
వృక్షాంతరాత్సజాతీయః। విజాతీయః। శిలాదిభిః

(విద్యారణ్య కృత పంచదశి)

లోకంలో ప్రతివస్తువునకు మూడుభేదములుండి తీరును. దృష్టాంతము. వృక్షము. ఒకవృక్షమునకు మరొకవృక్షమునకు వుండే భేదము సజాతీయభేదము.

శిలలు మొదలగు వాటికంటే వృక్షము వేరని చెప్పుట విజాతీయ భేదము.

ఒకేవృక్షమునందు ఆకులు, కొమ్మలు, పూలు, కాయలు, పండ్లు వేరువేరుగనుండుట స్వగతభేదము (అనగా వృక్షమునందుండే భేదము)

ఈమూడు విధములైన భేదములు లేనివారు పరమాత్మ ఒక్కరే. వారే యీసూర్యుడుగాన "అమితాత్మ" అయినాడు.

కృతఘ్నఘ్నాయ

1 కృతంచేతనత్వలక్షణం భగవత్కృతముపకారం ఘ్నంతి విస్మ

రంతీతి కృతఘ్నాః భగ ద్విముఖాః అజ్ఞాః సంసారిణః తాఙా. సర్వానర్థ ప్రాపణేన హంతీతి కృ ఘ్నఘ్నః తాదృశాయ.

తా॥ కృతము అనగా భగవంతుడు మనకు చేతనత్వమును ప్రసాదించుట అను ఉపకారము, దానిని మరచినవారు కృతఘ్నులు — (అనగా భగవద్విముఖులు) వారికి జననమరణములను సంసారరూప అనర్థమును గల్గించువారని. తాత్పర్యము

దేవాయ

స్వయంగా ప్రకాశించేవాడు

శ్లో॥ దీవ్యతికీడతి స్వస్మిన్ః ద్యోతతేరోచతేదివిః
యస్మాద్దేవః తతః ప్రోక్తః స్తూయతేశ్వేతభానువై॥

స్వాత్మారాముడును ఆకాశంలో తెల్లని కిరణాలతో ప్రకాశించే నుమూర్తి దేవుడనబడును

జ్యోతిషాంపతయేనమః

జ్యోతిస్సులకు ప్రభువైన భానుమూర్తికి నమస్కారము.

మం॥ ఇదంశ్రేష్ఠం జ్యోతిషాం జ్యోతిరుత్తమం
విశ్వజిద్ధనజిదుచ్యతే బృహత్॥ (మహాసౌరం)

ఈసూర్యుడను జ్యోతిస్సు గ్రహములు నక్షత్రములు మొదలగు జ్యోతిస్సులకు సర్వశ్రేష్ఠము "జ్యోతిషాంరవిరంశుమాన్" అని గీతాచార్యుడు జ్యోతిస్సులలో అంశుమంతుడైన రవినినేనని సెలవిచ్చిరి. వారువిశ్వవిజయిగాన విశ్వజిత్తు। ధనమును జయించినవారైనందున ధనజిత్తు అని చెప్పబడెదరు। వారు అవినాశియగు తేజస్సును ఓజస్సును ప్రసాదించుచు దర్శనమిచ్చు చున్నారు. అట్టి జ్యోతిష్పతికి వందనములు.

21

శ్లో॥ తప్తచామీకరాభాయ। హరయేవిశ్వకర్మణే।
నమస్తమోఽభినిఘ్నాయ। రుచయేలోకసాక్షిణే॥

వివరణ:—

ఈ శ్లోకంలో—వహ్నయే విశ్వకర్మణే॥ అను పాఠంవుంది. "వహ్ని" అను నామం, లోగా తొమ్మిదవ శ్లోకంలో "వాయుర్వహ్నిః అను చోట ఒకసారివచ్చి యున్నందున॥ హరయే అను పాఠము గ్రహింపబడినది.

కాచిన బంగారమువలె కళకళలాడుచు లోకుల అజ్ఞానమును బోగొట్టుచున్నందున హరియను సార్థకనామముగల వాడై కాంతితో వెలుగు లోకసాక్షికి నమస్కారము

విశ్వకర్మణే।

విశ్వంజగత్కర్మ కర్తవ్యంయస్యస: విశ్వకర్మా తస్మై విశ్వకర్మణ్ణే॥ విశ్వమనగా జగత్తు, సూర్యుడాజగత్తుకు నిర్మాతయైనందున విశ్వకర్మ యైనాడు. ఆవిశ్వకర్మకు నమస్కారము। "విశ్వకర్మామనుస్త్వష్టా" అని విష్ణుసహస్రనామము.

రుచయే

రుచి—యనగా కాంతి।

మం॥ యోదేవేభ్య ఆతపతి। యోదేవానాం పురోహితః।
పూర్వోయోదేవేభ్యోజాతః। నమోరుచాయ బ్రాహ్మయే॥

తా॥ ఏప్రభాకరుడు భూరాది లోకముల కొరకై తపించుచున్నాడో, ఏదేవుడు దేవతలకు, రాగల హితమును దెలుపుచుందురో, ఏస్వామి దేవతలందరకంటే తొలుత అవతరించిరో, బ్రహ్మవలె ప్రకాశించు ఆ ప్రభాకరునకు నమస్కారము.

లోకసాక్షిణే॥

లోక్యత ఇతిలోకః=దృశ్య ప్రపంచః। తస్యసాక్షిణే సాక్షాద్ద్రష్ట్రే

చూడబడునదిగాన లోకము (అనగా కనబడుచుండే ప్రపంచము) దానివి స్వయముగా చూచే వాడైనందున సూర్యభగవానుడు లోకసాక్షి యయ్యెను।

మం॥ ఆసత్యేన రజసావర్తమానో నివేశయన్నమృతం
మర్త్యంచ। హిరణ్యయేనసవితారథేనాదేవోయాతి

భువనావిపశ్యన్ అను మంత్రము సూర్యుడు లోకసాక్షియని తెల్పుచున్నది.

2. లోకానాం=జనానాం అంతర్యామితయా సుకృతదుష్కృత కర్మసాక్షిణే। జనుల కంతర్యామిగానుండి వారుచేయు పుణ్యాపాపములను సాక్షియై చూచువాడు. చూచుట నేత్రముయొక్క స్వభావముగాన ప్రపంచము లోని ప్రాణుల నేత్రములకు ప్రకాశాన్నిచ్చే ఆధ్యాత్మిక స్వరూపుడైనందున వీరివి జగచ్చక్షువని కూడ అందురు. అటువంటి వీరికి నమస్కారము.

22

శ్లో॥ నాశయత్యేషవై భూతం। తదేవసృజతిప్రభుః
పాయత్యేష తపత్యేష వర్షత్యేషగభస్తిభిః॥

వివరణ :-

అగస్త్యమహర్షి - "ఆదిత్య స్సవితా సూర్యః" అను పదవ శ్లోకంతో ప్రారంభించి యేక ధారగా పన్నెండు శ్లోకాలతో ఆదిత్యహృదయాన్నియుపదేశించాడు ("తప్తచామీకరాభాయ. రుచయే లోకసాక్షిణే" అనుయిరువ దొకటవశ్లోకం వరకు)

గూఢార్థ దీపిక

మరల సూర్యునిమహిమను "నాశయత్యేషః" అని యీశ్లోకంతో యారంభించి ముచ్చటగా మూడు శ్లోకాలతో చెప్పుచున్నారు.

సూర్యుడు ప్రభువుగాన నిగ్రహానుగ్రహసమర్థుడు। వీరు భూతమును నశింపజేసి మరల సృష్టిస్తారు. భూతమనగా=ప్రాణికోటి। దీనిని తొల్త తనవేడి కిరణాలతో నశింపజేసి మరల ఆవేకిరణాలతో వర్షింపజేసి ప్రాణులను సృష్టించగల సామర్థ్యము గలవాడు గాన వీరిని ప్రభువని పేర్కొనడం జరిగింది.

అయితే మనకు "వీరు బాగుగనుండె సృష్టిని నశింప జేయుటయు మరల దానినే సృష్టించుటెందులకా యనిపించును? ఇదిలయకారకుడైన శంకర భగవానుని సంహారలీలను పరిశీలించితిమేని, తొలగు: రుద్రుడు ప్రళయంకరుడయ్యును శివుడైయున్నాడు (అనగా మంగళదాయకుడు) ఎటులనగా సృష్టి బీజములు సర్వదా లయమునందేయిమిడియున్నవి.

ఉదా=వ్యవసాయదారుడు పండిన పంటను తొల్త కోసికొని, తరువాతగా ఊడుపు చేయడుగదా? చెఱకు తోటను గోసిన వెంటనే వాని మొదళ్లను తగుల బెట్టినగాని మరల నచట చెరకు మొలవదను సంగతి వ్యవసాయ

దారునకు అనుభవమేగదా! ఇటులనే నూతన సృష్టి కొరకు సంహార కార్యమనివార్య మైనందున ఆకార్యము ముందుగజేసి ప్రపంచ కల్యాణమునకు దోహదము చేయువారైనందున వారిని శివ్రదనిరి।

ఇటులనే లోక కల్యాణమును చేయు సూర్యుడును తొలుతప్రాణి కోటిని సంహరించి మరల యీసృష్టిని చేసెదరు।

ప్రభుః = ప్రభువు

ఈసూర్యభగవానుడు జగత్ప్రభువు. ఆదర్శమూర్తి. ఆదర్శప్రభువు, తన ప్రజలనుండి నామమాత్రంగా పన్నునుగ్రహించి మరల దానిని వేయిరెట్లధికముగ పెంచి వారికే యిచ్చి వేయును. ఇంతియగాక ప్రజల యొక్క ఆరోగ్యము క్షేమము రక్షణము గావించుచుండును.

ఈసూర్యవంశ ప్రభువు దిలీపచక్రవర్తి. వారు

శ్లో॥ ప్రజానాం వినయాధానాత్। రక్షణాద్భరణాదపి।
సపితా। పితరస్తాసాం। కేవలంజన్మహేతవః॥

ప్రజలకు శిక్షణ రక్షణ, పోషణగావించి తండ్రియయ్యెను. అనిరి, మరియు ప్రజలవద్ద పన్ను గ్రహించు విషయమునుగూడ

శ్లో॥ ప్రజానామేవ భూత్యర్థం। సతాభ్యో బలిమగ్రహీత్।
సహస్రగుణ ముత్స్రష్టుం। ఆదత్తే హిరసంరవిః॥

(కాళిదాసు)

సూర్యదేవుడు గ్రీష్మఋతువులో భూమినుండి గ్రహించిన జలమును వేయిరెట్లుగ పెంచి నాలుగు మాసములలో మరల యిచ్చుటకై సకాలంలో బయలు దేరి, తన యాస్తిపాస్తులతో లోకానికవసరమైన

ఆహారము ఆరోగ్యము, ఆనందము, గలుగజేయునటుల దిలీపమహారాజును ప్రజలవద్ద పన్నుగ్రహించి దానిని వారికే వేయిరెట్లు పెంచి యిచ్చెడి వాడని కాళిదాస మహాకవి వర్ణించెను.

"పాయత్యేష తపత్యేష వర్షత్యేషగభస్తిభిః"

"జయాయ జయభద్రాయ".... ...... సహస్రాంశో 17వ శ్లోకంలో - సహస్రాంశో। అని సూర్యభగవానుడు వేయి కిరణములు గల వాడుగ తెలుపబడెను. వానిలో – వసంత – గ్రీష్మఋతువులలో హ్లాదినీ" అను పేరుగల మూడు వందల కిరణములతో భూమిని బాగుగ తపింపజేయుచు–సముద్రములు, నదులు,తటాకములు, నూతులు మొదలగు వానియందుండు జలమును ఆవిరి రూపంలో గ్రహించెదరు.

వర్షా – శరదృతువులలో – "చందనా, మేధ్యా, కేతనా, చేతనా, అమృతా, జీవనా" అను విచిత్రాకారముగల నాలుగు వందల కిరణముల ద్వారా బాగుగ వర్షింపజేసి సకల ప్రాణులకు జీవనమును (జలము) ఇచ్చెదరు.

ఈ భూమిమీద ఏడు మేఘములు వర్షించుచున్నవనియు ఆ మేఘములే సప్తవాయువుల ప్రేరణచేత వ్యతిరేకముగ ఊర్ధ్వముఖములు గలవై పైలోకములందు గూడ వర్షించుచున్నవని యారుణికిశ్రుతి తెలిపింది.

మం॥ పర్జన్యాస్సప్త పృధివీ మభివర్షన్తి। వృష్టిభిరితి।
ఏతయైవ విభక్తి విపరీతాః। సప్తభిర్వాతై రుదీరితాః।
అమూన్లోకా నభి వర్షన్తి॥

వాల్మీకి మహర్షి వర్షఋతువును వర్ణించు సందర్భమున–

శ్లో॥ నవమాస ధృతంగర్భం। భాస్కరస్యగభస్తిభిః।
పీత్వారసం సముద్రాణాం। ద్యౌః ప్రసూతే రసాయనం॥
(రా 4 కా. 28 స. 3 శ్లో)

"ద్యౌః" = ఆకాశము కార్తీకమునుండి తొమ్మిది మాసములు సూర్య కిరణములచేత సముద్రములందలి రసమును త్రాగి గర్భధారణచేసి ఆషాఢము మొదలు ఆశ్వీజ మాసమువరకు నాల్గు మాసములు రసాయనమును (రుచికరమైన జలమును) ప్రసవించుచున్నదని వర్ణించిరి.

వర్షాకాలానంతరము హేమంత_శిశిర ఋతువులలో సూర్యమండల మధ్యభాగమునందుగల మూడు వందల కిరణములు మంచును గురిపించు చున్నవి.

సూర్యుడీవిధంగ తన కిరణములను పరివర్తన జేయుచు లోకమునకు శీతోష్ణములను వర్షమును గలుగజేయుచేగాక దేవతలకును పితరులకును మానవులకును అవసరమైన ఆహారమును అనుగ్రహించుచున్నాడు

వర్షముకొఱకు సూర్యుని కిరణములచేత చంద్రునియందు రక్షింపబడు జలము సుధ, లేక అమృత మనబడును, కావుననే చంద్రుడు సుధాంశువు లేక అమృత కిరణుడు అనబడును.

చంద్రునియందుండు ఆసుధను దేవతలు కృష్ణపక్షమెల్ల పానము జేయుదురు గాన చంద్రునికి కళాక్షయమగుచున్నది. ఆ యమృతము పానముజేసి దేవతలు శుక్లపక్షమెల్ల తృప్తినందెదరు. తస్మాదర్ధ మాసే దేవా ఇజ్యన్తే। అని తైత్తిరీయ బ్రాహ్మణం చెప్పింది. చంద్రునియందు సూర్యకిరణములచేత వుంచబడి కాలాంతరంలో మంచి వర్షము నివ్వగల "స్వధ" అను అమృతమును పితృదేవతలు భుజించి ఒక మాసము తృప్తు లగుదురు. "తస్మాన్మాసి పితృభ్యః క్రియతే" అని శ్రుతియీ రహస్యమును దెల్పింది.

(ఉ) సూర్యకిరణములచేత భూమియందు వర్షింపబడినందున వసుంధర సస్యశ్యామలమై మానవులకు గావలసిన యాహారము పండుటచేత, మానవులు దానిని నిత్యము రెండుమార్లు భుజించి తృప్తినందెదరు। "తస్మాద్ద్విరహ్నో మనుష్యేభ్య ఉపహ్రియతే। ప్రాతశ్చ సాయంచ।" అని శ్రుతి తెల్పింది.

ఇటుల "తస్మాదహరహర్మనుష్యా అశనమిచ్ఛంతేఽర్ధమాసే దేవా ఇజ్యన్తేమాసి పితృభ్యః క్రియతే" అని తై॥ సంహితగూడ ప్రతిపాదించింది.

సూర్యభగవానుడిటుల తన కిరణాలచేత దేవతలను, పితరులను, మానవులను గాపాడుచు మూడు లోకములకు మూడు ముఖ్య ప్రయోజనములను సాధించుచున్నాడు. (సాంబపురాణము)

23

శ్లో॥ ఏషసుప్తేషు జాగర్తి। భూతేషు పరినిష్ఠితః।
ఏష ఏవాగ్ని హోత్రించ। ఫలంచైవాగ్ని హోత్రిణాం

వివరణ:-

సమస్త ప్రాణులు నిదురించుచున్నను పరమేశ్వరుడు మనలో మే‹ కొనియే యుండును "అగ్నేత్వగ్ం సుజాగృహి వయగ్ం సుమంది‹ షీహి। అను శ్రుతివాక్యము ననుసరించి సర్వకాల సర్వావస్థలందును మ‹ కతోడునీడయై మనలో వెలుగుచుండు ఆదిత్యుడు మనకారాధ్యదైవము।

"ఏష ఏవాగ్నిహోత్రించ। ఫలంచైవాగ్ని హోత్రిణాం"

ఇతడే గార్హపత్యము, ఆహవనీయము, దక్షిణాగ్నులను మూడగ్ను లందు హోమమొనర్చదగు అగ్నిహోత్రుడు। పై మూడగ్నులను త్రేతా గ్నులందురు.

ఈ త్రేతాగ్నులను నిత్యం ప్రాతస్సాయంకాలములందు ఆరాధిం చుటవలన యజమానులకు రాగల ఫలముగూడ యీ సూర్యభగవానుడే, సర్వము పరమాత్మకంటే వేరుగాదని యీగీతా శ్లోకముగూడ ప్రతిపాదించు చున్నది.

శ్లో॥ బ్రహ్మార్పణం బ్రహ్మహవిః। బ్రహ్మాగ్నౌ బ్రహ్మణాహుతం।
బ్రహ్మైవతేన గంతవ్యం। బ్రహ్మకర్మ సమాధినా॥ అని

శాండిల్య మహర్షి వంశీయులైన శండిలులనువారు అరుణకేతు కాగ్ని నారాధించుటవలన గలుగు ఫలమును నిర్ణయించుటకు అరుణమను ప్రశ్నమునందు ప్రశ్నోత్తర రూపమున సంభాషణగావించి దాని ఫలమును నిర్ణయించిరి.

మం॥ కమగ్నించినుతే। సావిత్ర మగ్నించిన్వానః అముమా
దిత్యం ప్రత్యక్షేణ॥

శండిలులను ఋషులు సూర్యభగవానుని గురించి చేయబడు అగ్ని హోత్రమువలన ఏమి ఫలము గల్గునని ఒకరినొకరు ప్రశ్నించుకొని, సూర్యభగవానుని హవిస్సు మొదలైన వాటిచే యారాధించుటవలన వారిని ప్రత్యక్షము గావించుకొని సూర్యమండలాంతర్వర్తి యగు పరమాత్మనే పొందుదురని సమాధానం జెప్పిరి.

24

శ్లో॥ వేదాశ్చ క్రతవశ్చైవ। క్రతూనాం ఫలమేవచ।
యానికృత్యాని లోకేషు। సర్వ ఏషరవిః ప్రభుః॥

గూఢార్థదీపిక.

మంత్ర బ్రాహ్మణములను పేరుగల శబ్దరాశికి వేదమని పేరు. ఈ శబ్దరాశి అనాదిగ ఋగ్వేదము, యజుర్వేదము,సామవేదము, అధర్వణ వేదమని లోకమున ప్రసిద్ధము.

ప్రళయకాలమందు కుంభక ప్రాణాయామంతో యోగ నిద్రను గ్రహించిన పరమేశ్వరునికి మరల సృష్ట్యారంభ సమయంలో అప్రయత్నంగా వెలువడిన ప్రధమనిశ్వాసమే యీ "శబ్దరాశి". ఈ యంశమును "యస్యనిశ్వసితం వేదాః" అను వచనము స్పష్టముగావించును. ఇట్టి వేదము "అపౌరుషేయమని యార్ష సంప్రదాయము। ఈ వేదములు సృష్టికర్తకు జగన్నిర్మాణ కార్యక్రమంలో సహాయపడుచున్నందున "యోవేదేభ్యోఽఖిలంజగత్।నిర్మమే" ఏపరమాత్మ వేదముల సహాయమున జగత్తును నిర్మించెనో। "సూర్యాచంద్రమసౌధాతాయధా పూర్వమకల్పయత్"అని యీ అంశమే శ్రుతి పేర్కొన్నది. వేదమనగా తెలియజేయునని యర్ధము. లోకవ్యవహారమంతయు సామాన్యముగ అర్ధకామ విషయము. ఈయర్ధకామములకు వశులై సంసార చక్రమున పరిభ్రమించు జీవులనుద్ధరించుటకై ప్రవృత్తినివృత్తిరూప ధర్మము నుపదేశించుటకై యవతరించిన సనాతన శాస్త్రము వేదము.

అనగా నెట్టియర్ధకామములు గ్రాహ్యములో ఏవినింద్యములో అవి యెట్లు ధర్మ సహాయముతో పురుషార్ధములగు చున్నవో, ధర్మస్వరూప

మేదియో, తుదకు ధర్మార్థకామములనుండి నిస్పృతుడై మోక్షమును ఎట్లు పొందునో తెలియజేయుటకై వేదము ప్రవృత్తమైనది. ఇట్లు మానవునకు దివ్యత్వమును సిద్ధింపజేయు ప్రవృత్తిధర్మమును మోక్షమును సిద్ధింపజేయు నివృత్తిధర్మమునుపదేశించెడి సనాతన శాస్త్రము వేదము. వేదమే దేవుడైన సూర్యభగవానుడు.

2 క్రతవశ్చైవ॥

ఈధర్మమోక్షములతీంద్రియములు. పురుషబుద్ధికి గోచరముగానివి అట్టి ధర్మమోక్షముల స్వరూపమును తత్సాధనములగు నిత్యనైమిత్తిక యాగాది కర్మలును సూర్యభగవానుని స్వరూపమే।

"క్రతూనాం ఫలమేవచ"

ఆక్రతువులు సకామంగానూ, నిష్కామంగాను ఆచరించినందువలన వచ్చెడి స్వర్గాది ఫలములూ,లోకమందు జరుగుతుండే సమస్తకార్య ఫలములు అన్నియు పరమాత్మయగు ఈరవి ప్రభువే॥

25

శ్లో॥ ఏనమాపత్సుకృచ్ఛ్రేషు కాంతారేషు భయేషుచ।
కీర్తయన్ పురుషః కశ్చి। న్నావసీదతి రాఘవ॥

వివరణ:—

ఓరాఘవ। ఏమానవుడైనను తనకాపదలు సంభవించినప్పుడుగాని కార్యసంకటములేర్పడినప్పుడును, దుర్గమమార్గములందు చిక్కుపడినప్పుడుగాని లేక భయములు సంభవించినప్పుడుగాని భక్తితో యీ ఆదిత్యహృదయమును జపించెనేని యాసంకటములు దొలగి సుఖించును

26

శ్లో॥ పూజయస్వైనమేకాగ్రో। దేవదేవం జగత్పతిం।
ఏతత్త్రిగుణితం జప్త్వా। యుద్ధేషు విజయిష్యసి॥

వివరణ:_

"రశ్మిమన్తం" అను ఆరవశ్లోకములో "పూజయస్వవివస్వన్తమ్" అనియారంభించి 25 శ్లో॥లో "కశ్చిన్నావసీదతి రాఘవ"అనువరకు తెలిపి యీశ్లోకము పూజయస్వైన మేకాగ్రః వీరిని సావధానముగ పూజింపు మని మరల ఆదేశించి యీస్తోత్రమును పూర్తి చేసి యున్నారు. ఓరామా। స్వయముగ ప్రకాశించే వారిలో శ్రేష్ఠుడును జగత్పతియైన యీ ఆదినారాయణమూర్తిని సావధానముగ పూజింపుము. ఈస్తోత్రమును మూడ మారులు జపించితివేని యుద్ధములందు జయింపగలవనిరి.మూడు మారుల జపింపమని అగస్త్య మహర్షి వైదిక సాంప్రదాయమును తెలిపిరి. ఎట్లన జనక చక్రవర్తి తాను కన్యాదానమును చేయునటుల ప్రతిజ్ఞచేయు సందర్భమున "శ్లో॥ వీర్యశుల్కాంమమసుతాంసీతామ్సురసుతోపమామ్ ద్వితీయామూర్మిళాంచైవ త్రిర్దదామి నసంశయః।"(రామా. బా. 71స॥ 21శ్లో) మనము పలికెడిమాటయు చేయుస్తుతియూ మూడుమార్లుచ్చరించుట చేత దేవతా ప్రీతియగునని శ్రుతి. త్రిరాహ। త్రిషత్యాహిదేవాః అని ఉపదేశించినది.

ఇంతియే కాక "యద్ధిమనసాధ్యాయతి, తద్వాచావదతి, తత్కర్మణా కరోతి" అనుశ్రుతి. మనస్సులో దేనిని ఆలోచించెదమో దానినే వాక్కుతో పలుక వలెననియు ఆవాక్కుతో పలికిన దానినే పనులలో చేయవలెననియూ తెలిపి యున్నది. ఈసాంప్రదాయమునే మహాత్ములైన వారు ఆచరింతురు అనుచూమనస్యేకం వచస్యేకం కర్మణ్యేకం మహా

త్మనామ్" అనియూ చెప్పబడియున్నందున మాడు మూరులు సూర్య భగవామనిస్తుతింపుమనుచూ ఏత త్త్రిగుణితం జప్త్వా అని రాముని యాదేశించుట జరిగినది.

25వశ్లోకములో కీర్తయన్పురుషః కశ్చిత్ అని తెలిపి ఈశ్లోకములో పూజయస్వైనమేకాగ్రః అని ఒకటవపాదము లోను ఏతత్త్రిగుణితం జప్త్వాఅనిమూడవపాదమందు యున్నందున త్రిగుణితం అనుపదమునకు మానసికముగా జపించమనియూ వాక్కుతో కీర్తించమనియూ శరీరము తో పూజించమనియు యిందు సూచింపబడుటచే మనస్సుతో సూర్య భగవానుని ధ్యానించి వాక్కుతో యూస్తుతి ద్వారావారినిస్తుతించి శరీరముతో వారికి నమస్కరించుట వీర్యవత్తరము.

27

శ్లో॥ అస్మిన్క్షణే మహాబాహోరావణం త్వంవధిష్యసిః
ఏవముక్త్వా తదాగస్త్యో జగామచ యధాగతం।

వివరణ:-

ఓ మహాబాహో। నీవుఈక్షణములోనే రావణుని వధింపగలవు. అని పలికి అగస్త్య మహర్షి వచ్చిన మార్గముననే వెడలిపోయెను. మహాబాహో। అని తొలిపలుకులో చేసిన సంబోధనయే మలిపలుకులో కూడకావించి రామ ప్రభువు బాహువులలో ఆదిత్యుని పరాక్రమము సంక్రమించుటను తెలిపి మరల దేవతల మధ్యకే వెళ్లెను.

28

శ్లో॥ ఏతచ్ఛ్రుత్వా మహాతేజా నష్టశోకో భవత్తదా।
ధారయూ మాసస్రుప్రీతోరాఘవః ప్రయుతాత్మవాన్।

వివరణ:_

సమర్థుడగు రఘువీరుడు యీఆదిత్యహృదయ శ్రవణముగావించి ఆయుపదేశ మహిమచేత ఆత్మవేత్త యయ్యెను."తరతి శోకమాత్మవిత్" ఆత్మవేత్త శోకమును దాటగలడు అని ఉపనిషత్తు వాక్యానుసారము ఆత్మ వేత్త అయినందున నష్టశోకో భవత్తదా. అప్పుడు శోకము నష్టమయినది అనిచెప్పబడినది. ఈస్తోత్రమును ఉపదేశించినందున రామప్రభువునకు పరత్వ ప్రకటనలో ప్రమేయములేకుండా రావణవధకు ఉపాయము లభించినందున బాగుగ సంతసించి పవిత్రమైన మనస్సుతో యీస్తోత్ర మును ధారణచేసెను.

29

శ్లో॥ ఆదిత్యం ప్రేక్ష్య జప్త్వాతు పరం హర్షమవాప్తవాన్।
త్రిరాచమ్య శుచిర్భూత్వాధనురాదాయ వీర్యవాన్॥

వివరణ:_

రాముడు మూడుమారులాచమించి శుచిర్భూతుడై పరిశుద్ధమైన మనస్సుతో ఆదిత్యభగవానుని దర్శనము చేయుచూ యీస్తుతిని మూడు మారులు జపించి కోదండమును ధరించి గొప్పసంతోషమును పొందెను.

గూఢార్థ దీపిక

త్రిరాచమ్య అని ఆచమన విషయము యీశ్లోకములో తప్ప యీస్తుతిలోమరెక్కడలేదు ఇంతవరకు రామప్రభువు అగస్త్య మహర్షి వలన శ్రవణము చేసెను. అనుష్ఠానము ప్రారంభించినది యీశ్లోకమునందే కాన యిచ్చట ఆచమనము చెప్పబడినది. కానీ మనము నిత్యము పారాయణ ప్రారంభములోనే ఆచమనము సంకల్పముచేసి తదనంతరము యీస్తుతిని ప్రారంభించవలయును.

త్రిరాచమ్య అని వాల్మీకిమహర్షి కంఠోక్తిగ చెప్పుటచేత క్షత్రియుడైన రాముడు స్మృత్యాచమనము చేసెనని భావము. ద్విజులు స్మృత్యాచమనమును, తదితరులు కేశవాయనమః అను పురాణాచమన విధానమును చేయవలయును. ఈ ఆచమనము సర్వులకు అనుభవములోనే ఉన్నందున స్మృత్యాచమన విధానము వ్రాయబడుచున్నది.

త్రిరాచామేత్ = మూడుమారులు ఆచమనముచేసి
ద్విఃపరిమృజ్యా = చేతి బొటన వ్రేలిని నీళ్లలో తడిపి మనరెండుపెదవులను కుడినుండి ఎడమకు తుడువ వలెను.
సకృదుపస్పృశ్యా = ఒకమారు నోటినితాకి
యత్సవ్యం పాణిం = కుడిచేతిలో నీళ్లుతీసుకొని ఎడమచేతిపైననూ
పాదౌ = రెండుపాదములపైననూ
ప్రోక్షతి = చల్లుకొనేది
అప్లే శిరః = చేతిలో నీళ్లు శిరస్సుపైన చల్లుకొని
చక్షుషీ = రెండునేత్రములు
నాసికే = రెండు ముక్కురంధ్రములు
శ్రోత్రే = రెండుచెవులను తాకవలెను. ఇదిస్మృత్యాచమనము. ద్విజులు ఈవిధముగ ఆచరించ వలయునని మహర్షి హృదయము

30

శ్లో॥ రావణంప్రేక్ష్యహృష్టాత్మా యుద్ధాయసముపాగమత్।
సర్వయత్నేసమహతావధేతస్య ధృతోభవత్॥

వివరణ:—

ఆదిత్యహృదయమును నియమముతో జపించిన రాముడు సంతసమున యుద్ధసన్నద్ధుడై రావణుని ఎదుట నిలిచి ఆతనిని సంహరించుటకు సర్వయత్నములతో సిద్ధమయ్యెను.

శ్లో॥ అథరవిరవదన్నిరీక్ష్య రామం
ముదితమనాః పరమం ప్రహృష్యమాణః
నిశిచరపతి సంక్షయం విదిత్వా
సురగణ మధ్యగతో వచస్త్వరేతి।

వివరణ:—

అప్పుడాకాశములో దేవతల మధ్యగల రవి రావణవధ నిశ్చయమైనందులకు సంతసించి రామా। నీవిక రావణవధను గురించి త్వరపడుమని పలికెను ఇటుల రవి ప్రత్యక్షమై రావణ వధను గూర్చి రామునితో త్వరపడుమని పలుకుటచే సూర్యభగవానుడు ప్రత్యక్ష దైవమనుటకు ప్రబల నిదర్శనము.

## ఉపసంహారము

మంత్ర ద్రష్టలైన మహర్షులు ఆమంత్రముల ద్వారా సూర్యభగవానునికి వివిధరూపములున్నటుల కనుగొనిరి. సూర్యభగవానుని యొక్క

అ) ఆధిభౌతికరూపము = సూర్యమండలము

ఇ) ఆధి దైవికరూపము = ఆమండలమందు గల చైతన్యమూర్తి

ఉ) ఆధ్యాత్మికరూపము = మన నేత్రములందుండే జ్యోతి స్వరూపము

సూర్యభగవానుని యీమూడు రూపములు ఒక్కటియుక్కనందే వ్యక్తమగు చున్నవి. "ఉద్వయం తమసస్పరి జ్యోతిష్పశ్య న్త ఉత్తరమ్। దేవం దేవత్రా సూర్యమగన్మ జ్యోతి రుత్తమమ్॥"

తా॥ చీకటికావలనుండు శ్రేష్ఠమైన జ్యోతిస్సును దర్శించుచూ మేము దేవలోకములోగల సర్వశ్రేష్ఠజ్యోతి స్వరూపమగు సూర్యదేవుని యొద్దకు చేరితిమి.

## ఆధ్యాత్మిక భావము

అంతర్యాగము చేయుచూ సూర్యోపాసకులమైన మేము అజ్ఞానమను చీకటికి పై భాగమునగల ఉచ్చ—ఉచ్చతర—జ్యోతిస్సును సాక్షాత్కరించు కొనుచూ ఉచ్చతమ స్వరూపుడునూ దేవతా శ్రేష్ఠుడునూ పరమాత్మ యగు సూర్యభగవానుని వరకూ చేరితిమి.

పై మంత్రమునందు ఉత్, ఉత్+తర=ఉత్తర, ఉత్+తమ= ఉత్తమ అను మూడు పదములున్నవి. వానికి క్రమముగా అధిభౌతిక— అధిదైవిక— ఆధ్యాత్మిక అర్థములు చెప్పబడుచున్నవి.

అ) ఈ లోకములోనుండే భౌతికాంధకారాన్ని పోగొట్టే సూర్య తేజస్సుకు "ఉత్" అనిపేరు.

ఇ) దేవతలమధ్య దేవతారూపంలో వుండే సూర్యజ్యోతిస్సు ఉత్తరం అనియూ పై రెంటికంటె విశిష్టమైన జ్యోతిస్సు ఉత్తమమ్ అని తెలుపబడినది. ఈ మూడు పదాలు సూర్యభగవానుని యొక్క కార్యాత్మక: కారణాత్మక। కార్యకారణ అతీతస్థితిని తెలుపుచున్నవి భౌతిక శాస్త్రజ్ఞులు సూర్యమండలమును కేవలము అగ్నిగోళమని తలచుచున్నారు. ఆ అగ్ని చల్లారిపోకుండా దృఢముగా నుండుటకు ఇంధనము (కట్టెలు) అవసరము, ఇంధనము అగ్నిలో పడవేయకున్న కొంతసేపటికది చల్లారిపోవునుగదా? అప్పుడీ ప్రపంచదశ యేమగును? అందుచే ఆయగ్ని సదా వెలుగుచుండు టకై మన మహర్షులు సరియగు ఇంధనమును కనుగొనిరి. ఎటులనగా సూర్యుడు గూడ మనవలెనే జడచేతనాత్మకుడు. మన శరీరము జడమై ననూ ఇందుండే శరీరి చేతనుడైనటుల సూర్యమండలము భౌతికమయ్యునూ ఆ మండలమందు చైతన్య ఘనము వుండనేవున్నది. సయశ్చాయం పురుషే యశ్చాసావాదిత్యే సఏకః। అనే ఉపనిషత్తు యీ విషయమును తెలిపినది.

లోకములో మనలను ఇతరులెవ్వరైననూ స్తుతించినపుడు మన మనస్సు సంతసించును. భగవతియగు వేదమాతయూ ఈ మార్గమునే అవలంబించి సూర్యదేవుని యీ విధముగ స్తుతించినది. "వర్ధస్తుత్వా సుష్టుతయోగిరోమే యూయంపాత స్వస్తిభిస్సదానః" ప్రభో! సూర్యదేవా! మా సుందరమైన వాక్కులు తమ తేజస్సును బలమును వృద్ధిచేయునుగాక. అందుచేత తాము సంతసించి మమ్ములను రక్షింతురుగాక. అని స్తుతించుటచేత ఆ అగ్ని గోళమైన సూర్యునకు యీస్తుతి యింధనమై ఆ అగ్ని ఎన్నటికి చల్లార కుండును. ఇటుల సూర్యభగవానుని మనము సదా స్తుతి చేయుచుండిన యెడల వారందుచే మిక్కిలి సంతసించి మనలను తప్పక కాపాడెదరు. కాన మనము శ్రద్ధా విశ్వాసములతో యీ ఆదిత్య హృదయముచేత వారిని స్తుతించి సంతసింపజేసి వారి యనుగ్రహపాత్రులమై ఆయురారోగ్య ఐశ్వర్యాది సకలశ్రేయస్సులను పొందెదము గాక॥

ఇది ఆదిత్య హృదయ రహస్యము

ఓమ్ తత్సత్



## ఈ గ్రంథమునకు ద్రవ్యసహాయకులగు దాతలపేర్లు

| | | | |
|---|---|---|---|
| 1 | సర్వశ్రీ సరిపల్లి రెడ్డెయ్యగారు, | నర్సాపురం | 300-00 |
| 2 | " నిడుమోలు వెంకటేశ్వరరావుగారు, | " | 116-00 |
| 3 | " పరిహారాజు సీతారామచంద్రమూర్తిగారు, | " | 116-00 |
| 4 | " గూడా వెంకట్రామయ్యగారు, | " | 116-00 |
| 5 | " జయసుఖలాల్ మెహతాగారు, | పాలకొల్లు | 116-00 |
| 6 | " తెలనాకుల నరసింహులుగారు, | " | 58-00 |
| 7 | " వలవల సత్యనారాయణగారు, | నర్సాపురం | 58-00 |
| 8 | కె. శ్రీరామమూర్తిగారు, | హైద్రాబాదు | 58-00 |
| 9 | శ్రీమతి పొన్నపల్లి సీతారత్నంగారు, | నర్సాపురం | 58-00 |
| 0 | సర్వశ్రీ కొప్పర్తి రామన్నదాదీగారు, | " | 30-00 |
| 1 | " చెన్నాప్రగడ రామచంద్రరావుగారు, | " | 25-00 |
| 2 | " కొప్పర్తి లక్ష్మీనారాయణగారు, | " | 25-00 |
| 3 | కుమారి మంగెన ఛాయాపద్మినిగారు, | " | 25-00 |
| 4 | సర్వశ్రీ వెల్లంకి లింగమూర్తిగారు, | | 25-00 |
| 5 | " మామిడన్న శేషగిరిరావుగారు, | " | 25-00 |
| 6 | " శ్రీపాద లక్ష్మీనరశింహంగారు, | పాలకొల్లు | 25-00 |
| 7 | శ్రీమతి చావలి వెంకటరమణమ్మగారు, | నర్సాపురం | 25-00 |
| | సర్వశ్రీ కొణకంచి శ్రీనివాసరావుగారు | " | 25-00 |
| | " పెనుమత్స రామరాజుగారు, | పాలకొల్లు | 20-00 |
| 0 | " డి. నాగేశ్వరరావుగారు, | " | 20-00 |
| | " టి. వి. సత్యనారాయణగారు, | " | 20-00 |
| | " బత్తుల రామారావుగారు | " | 20-00 |
| | " పునాతి లక్ష్మయ్యగారు, | " | 20-00 |
| | " Ch. B. వెంకటేశ్వరరావుగారు | నర్సాపురం | 20-00 |

| | | | | |
|---|---|---|---|---|
| 25 | సర్వశ్రీ | సింగంశెట్టి వెంకటనరసయ్య, | నర్సాపురం | 20–00 |
| 26 | ” | గుర్రం వెంకటసుబ్బయ్య | ఏలూరు | 16–00 |
| 27 | శ్రీమతి | పచ్చిపులుసు వెంకటరత్నమ్మ | నర్సా: రం | 10–00 |
| 28 | ” | చెక్కా పద్మావతి | ” | 10–00 |
| 29 | ” | గూడా విజయలక్ష్మమ్మ | ” | 10–00 |
| 30 | ” | గూడా కామేశ్వరమ్మ | ” | 10-00 |
| 31 | ” | గోనెళ్ళ స్వరాజ్యలక్ష్మి | ” | 10–00 |
| 32 | ” | అద్దంకి పద్మావతమ్మ | ” | 10–00 |
| 33 | సర్వశ్రీ | పుప్పాల యతిరాజులు | ” | 10–00 |
| 34 | ” | కొత్త వెంకటరాజలింగయ్య | ” | 10–00 |
| 35 | ” | అద్దంకి శ్రీనివాసరావు | ” | 10–00 |
| 36 | ” | గొర్తి వెంకటలక్ష్మి రాజగోపాలం | ” | 10–0[illegible] |
| 37 | ” | విష్ణువఝుల జగన్నాధశర్మ | ” | 10–0 |
| 38 | ” | పాలంకి లక్ష్మీపతి | ” | 10– |
| 39 | ” | శ్రీ పద్మావతి శ్రీరామ చిరంజీవి | ” | 10– |
| 40 | ” | పి. లక్ష్మణరావు | ” | 10- |
| 41 | ” | ఆండ్రి సుబ్బారావు | ” | 1[illegible] |
| 42 | ” | పి. వి. యస్. యస్. ఆర్. సోమయాజులు | ” | 1[illegible] |
| 43 | ” | యస్. వెంకటేశ్వర్లు | ” | 10- |
| 44 | శ్రీమతి | కొలకలూరి బాలాత్రిపురసుందరమ్మ | ” | 1[illegible] |
| 45 | ” | బెందులూరి సీతమ్మ | ” | 1 |
| 46 | సర్వశ్రీ | కె. యస్. పి. ప్రకాశరావు | ” | 1 |
| 47 | ” | పుణ్యమూర్తుల తమ్మిరాజు | ” | 1[illegible] |
| 48 | ” | కే. అచ్యుతరామయ్య | ” | 1[illegible] |
| 49 | ” | కాశీచయనుల సూర్యచింతామణి | ” | 10 |
| 50 | ” | వక్కలగడ్డ ముత్తుస్వామి | ” | 10–[illegible] |

| | | | |
|---|---|---|---|
| 51 | సర్వశ్రీ పొదిల సోమయాజులు, | నర్సాపురం | 10-00 |
| 52 | శ్రీమతి పి. సూర్యకుమారి, | " | 10-00 |
| 53 | కుమారి తాడేపల్లి వెంకటరత్నం, | " | 10-00 |
| 54 | సర్వశ్రీ చిలకమర్తి గోపాలకృష్ణమూర్తి | " | 10-00 |
| 55 | " తాతపూడి వెంకట సత్యనారాయణ | " | 10-00 |
| 56 | శ్రీమతి రంగనాయకమ్మ | " | 10-00 |
| 57 | సర్వశ్రీ బిహెచ్ జినేంద్రనాథ్ | " | 10-00 |
| 58 | " యమ్. సత్యనారాయణ | " | 10-00 |
| 59 | " యన్. వి. యస్. మూర్తి | " | 10-00 |
| 60 | " మామిడన్న సూర్యనారాయణమూర్తి | " | 10-00 |
| 61 | శ్రీమతి వఝల అన్నపూర్ణమ్మ | " | 10-00 |
| 62 | సర్వశ్రీ జోశ్యుల దీక్షితులు | " | 10-00 |
| 63 | " సూర్యాలయం, తణుకు | " | 10-00 |
| 64 | " డి. మోహనరావు | " | 10-00 |
| 65 | " రాళ్లబండి శ్యామలరావు | " | 10-00 |
| 66 | " జామ మాణిక్యాలరావు | " | 10-00 |
| 67 | " వాడవల్లి మృత్యుంజయ సోమయాజి | ద్రాక్షారామం | 10-00 |
| 68 | " యర్రిగుంట్ల సూర్యసుబ్రహ్మణం | రామచంద్రపురం | 10-00 |
| 69 | " నటరాజ కథాగాన కళాపరిషత్ | గుంటూరు | 10-00 |
| 70 | " పి. యస్. రామచంద్రరావు | " | 10-00 |
| 71 | " చావలి సుబ్రహ్మణ్యం | " | 10-00 |
| 72 | " పి. కేదారేశ్వరరావు | " | 10-00 |
| 73 | " పి. నరశింహరావు | " | 10-00 |
| 74 | " కొలపర్తి వెంకటేశ్వర్లు | " | 10-00 |
| 75 | " దెందుకూరి కృష్ణమూర్తి | " | 10-00 |
| 76 | " గుంటూరి సూర్యనారాయణ | " | 10-00 |

| | | | |
|---|---|---|---|
| 77 | " ఈవని రాధాకృష్ణమూర్తి | గుంటూరు | 10-00 |
| 78 | „ చెరువు పార్థసారధి | „ | 10-00 |
| 79 | " కె రంగాచార్యులు | „ | 10-00 |
| 80 | " మద్ది సుబ్బారావు | " | 10-00 |
| 81 | " దామరాజు సత్యనారాయణ | " | 10-00 |
| 82 | " తల్లాప్రగడ గోపాల కృష్ణారావు | „ | 10-00 |
| 83 | " కె వి సూర్యనారాయణ | " | 10-00 |
| 84 | " కెంబా శ్రీనివాసురావు | " | 10-00 |
| 85 | " వీరుభొట్ల సీతారామయ్య | " | 10-00 |
| 86 | " దెందుకూరు చిదంబరసోమయాజులు | " | 10-00 |
| 87 | " మెరికపూడి కోటేశ్వరరావు | " | 10-00 |
| 88 | శ్రీమతి విశ్వనాధం వెంకట లక్ష్మమ్మ | నర్సాపురం | 10-00 |
| 89 | " చల్లా దుర్గాంబ | " | 10-00 |
| 90 | సర్వశ్రీ కడించర్ల నాగేశ్వరరావు | " | 10-00 |
| 91 | „ లంక విశ్వనాధం | " | 10-00 |
| 92 | „ పుత్రేవు జోగి జగన్నాధరావు | „ | 10-00 |
| 93 | „ గొడుగుల నారాయణ శాస్త్రి | గుంటూరు | 10-00 |
| 94 | „ తోట బుచ్చిరాజు | నర్సాపురం | 20-00 |
| 95 | „ పారేపల్లి శేషయ్య | " | 10-00 |
| 96 | „ కొప్పర్తి యెగ్గెన్న | „ | 10-00 |
| 97 | „ మాడా చెన్న బసవలింగం | „ | 10-00 |
| 98 | „ మోచర్ల రాజారాం | „ | 10-00 |
| 99 | „ సర్వా మురళీ కృష్ణ | , | 10-00 |
| 100 | " మల్లాది సుబ్బారాయుడు | - | 10-00 |
| 101 | „ నండూరి అచ్యుతరామం | " | 10-00 |
| 102 | శ్రీమతి పొన్నపల్లి రామలక్ష్మి | „ | 10-00 |

# గ్రంథకర్త పరిచయము

పౌరాణిక విద్వన్మణి, శుకవాగ్విశారద, రామకథా ప్రవచన కోవిద, శ్రీరామచంద్ర శాస్త్రిగారు కాళిదాస వంశమునందు జన్మించి వైదిక, పౌరాణిక వాఙ్మయమును క్షుణ్ణముగ అధ్యయనముజేసి కొద్దికాలము తెలుగు పండితులుగను, కొంతకాలము వెంకటగిరి ఆస్థానమున పౌరాణికులుగను వుండి తదుపరి [illegible] అవతారమూర్తి యగు శ్రీరామచంద్రమూర్తి కావ్యమగు శ్రీ మద్రామాయణమును ప్రచారము చేయుటయే తమ ధ్యేయముగా భావించి యిప్పటికి ఆంధ్రదేశములోని 52 ముఖ్యపట్టణములలో 52 పర్యాయములు ప్రవచనము గావించి ప్రజల మన్ననలను, పలుచోట్ల ఘన సన్మానములను బొంది యున్నారు. వీరి ప్రవచన విధానము మిక్కిలి శ్రావ్యముగాను, ఆకర్షణీయముగాను వుంటుంది. ప్రతివిషయమునకు వేద ప్రమాణమును జూపుచు హృదయమునకు హత్తుకొనునట్లుగా విపులీకరించుదురు. ఆదిత్య హృదయ రహస్యము వారి విద్వత్తుకు, వైదిక వాఙ్మయ విజ్ఞతకు, పాండిత్యప్రకర్షకు చక్కని తార్కాణము ఇదేవిధముగ ఎంతో కాలముగ ఎదురు చూచుచున్న సుందరకాండ మూడు భాగములుగ ఎన్నో విశేషములతో శ్రీ శాస్త్రిగారి కలమునుండి వెలువడుచున్నది. శ్రీ శాస్త్రిగార్కి ఆ శ్రీరామచంద్రమూర్తిని ఆయురారోగ్యైశ్వర్యములనిచ్చి కాపాడుచుండుమని మనసారా ప్రార్థిస్తున్నాను.

డాక్టరు కె. యస్. సత్యనారాయణ,
ఎమ్. ఏ., పిహెచ్. డి
హిందీ శాఖాధిపతి
శ్రీ వై. యస్. కాలేజి, నరసాపురం.

*Wrapper printed at Jeevan Jyothi Press, Narsapur-534 275.*